



పల్లెపడుచులు

చిత్రకారుడు: శ్రీ హెచ్. వి. రామగోపాల్



విరోధి సం.
ఫాల్గునము

# భారతి

సంపుటము 27
సంచిక 3

## శోకశ్లోకము

శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

ఓయి కవిప్రభూ! చనితి వోయి, దరిద్రుల మైన మేము వా
పోయిన నెన్నడుం దిరిగి పుట్టని గిట్టని దివ్యభూమి; నీ
పోయిన పోకలో నయితముం గవితాపథ మొక్క డుండి మా
కాయువు పోయకే పలుకునా, గళవీణలు మూఁగె నత్కవీ!

గీచిన గీతలు, నఱగా-జూచిన చూపులును, అమృతసురుచిరకవితా
రోచులుగ జేసి చనగా-మా చెప్పెడి కవిత దిక్కుమాలిన దోయీ!

అరుణకరాళి దూసికొనునట్టులు నీ ప్రతిచాటువుఁ దమో
భరమగు గుండెలన్ వెలుగు వంపులు దీఱిచికొన్న; హో కవీ
శ్వర! చెళపిళ్ల వేంకటతపస్వి! కవిత్వముతో భవంబు ని
స్తరణము చేసికొంటివిగదా, మొద మాకు విషాద మేలొకో!

నీ పొన్నుకఱ్ఱపట్టున-నీ పొలుపగు పొడుముపట్టు నేర్పున గవితా
దీపికలు వెలిగిపోయిన-హో ప్రజ్ఞపరమాశయ! కవిత్వయోధుడ వయ్యా!

ఒక పం డెన్నడో రాలెను: నేడు మఱి వేఱొండైన పెన్పండు ము
చ్చిక ప్రీలెన్: గనువిందు లిచ్చు కవితాశ్రీసాహితీనాళకాం
తి కటా! ప్రోడగు పాదుకాల మిది పోని మ్రోడయయామేయు! వే
డుక లూరన్ మధుమాససంపదల నిండుల్ వెండి విచ్చేయునే!

---

# అస్తమయము

శ్రీ సామవేదం జానకిరామశర్మ

నన్నయ్యకవితావనవిధాతమునిమహాళియాత్మ నీలో నైక్య మైనదేమొ!
తిక్కయజ్వలు రసోదీర్ణాపగలు వచ్చి నీలోన జీవమ్ము నిలుపుకొనిరొ!
పోతన్ననిరుపమాద్భుతభక్తి రసమూర్తి నీహృదయమ్ముగా నిలిచెనేమొ!
శ్రీనాథుడు జగత్ప్రసిద్ధభోగి, కవీంద్రు డీ నీదు రూపమ్ము పూనెనేమొ!
ఏమొ! మా కెల్లయుగముల, నెందఱెంద-ఱాంధ్రకవు లుండి రందఱు నన్నియుగము,
లీవమైతి మహాద్భుత మిదియు తగును - కృతమహాపుణ్యపరిణతమతికి నీకు.

అనిదంపూర్వము నీమహత్త్వము మహాత్మా! తెల్గునా డెల్ల నీ
వనగా బ్రహ్మరథమ్ము పట్టినది, ఊహాతీతసద్గౌరవం
బున రాజన్యులు నీసమర్చనము నామోదానుసంధాంతుగా
మనమం దెంచి తపించి రా సుకవిసమ్మానంబు సామాన్యమే?

పరిపక్వగోస్తనీఫలరసాస్వాదసంజనితానుభోగవిస్తార మొకట
గ్రీష్మకాలాభ్రసంకీర్ణధారాధర స్తనితానుభోగవిస్తార మొకట
అనుకూలవనితాజనాశ్లేషసౌఖ్యానుభోగాతిరేకసంపూర్తి యొకట
మధుమాసకోకిలోన్మదకూజితోన్నత దివ్యానుభోగసందీప్తి యొకట
ననుభవంబయ్యె మనముల నచ్చటచట - తావకగ్రంథపఠనసందర్భములను
కొలదియిడరాని నీశక్తి కలయజూడ - సరసకవిధుర్య! వేంకటశాస్త్రివర్య!

"కడియము పోయి నీవు కవిగా నయిరమ్మ"ను మేటిమాటకుఁ
దోడవయినట్టివా డమృతతుల్యమనోహరహాస్యభాషలన్
ఉడుగర లిచ్చువాడు, మహిమోన్నతు డుత్తమసాధువర్తనన్
గడపిన వేంకటేశున కఖండజయ మ్మగు స్వర్గభూమిలోన్.

పండిన పండు రాలె నను భావ మదొక్కఁడు లోనలోన దా
నుండియు, పండితప్రవరు డూర్జితదివ్యమనోజ్ఞసాహితీ
ఖండితశాత్రవుం డలఘుకల్పితశిష్యగణుండు, నిర్జితా
ఖండలకీర్తియుక్తు డను గాఢవిషాదము నన్ గలంచెడున్.

"మంచిచెడ్డ లెల్ల మరణకాలమ్మున - తేలు"ననెడి బుధుల తేటమాట
అర్థవంత మయ్యె నాశ్చర్య మిది శివ - రాత్రినాడు తనువు రాలిపోయె!

పలికిన దెల్ల గవిత్వము - తలచిన దెల్లయును విశ్వతాపహారముగా
జలిపిన త్వదుపజ్ఞకు ఏ - వెల యిడగాగలము విశ్వవిఖ్యాతకవీ!

# కనుమఱుగైన కళాప్రపూర్ణ మహాకవి

ఙ

శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి

శతావధాని శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారికి నేను ఏకలవ్యశిష్యకోటిలోనివాడనుగాని, వారిని శుశ్రూషించి ధన్యతగన్న ఛాత్రగణములోనివాడను గాను. కాకపోయినను వారు నన్ను ఛాత్రునివలెనే-ఇంకను అంతకన్న మిన్నగనే మన్నించెడివారు. నేను వారి దర్శనమున కరిగినప్పుడెల్ల ప్రియబంధువు నడిగినట్లు ముందు మా కుటుంబక్షేమసమాచారములు వివరముగా నడిగెడివారు. పిమ్మట తమ నూతన రచనలను వినిపించి, నా మాటకును కొంత విలువ యిచ్చి యభిప్రాయ మడిగెడివారు. తరువాత నాచేత చదివించి, విని సంతసించెడివారు. హెచ్చుగా చనవిచ్చి, తమ పిన్నతనపు ముచ్చట లేమేమో చెప్పెడివారు. నాకే చిన్నసందేహము కలిగినను వారికి వ్రాసికొనెడివాడను. వారు శ్రమయనుకొనక మఱుటప్పాలోనే బదులు వ్రాసి నా సందేహములను తీర్చుచుండెడివారు. వారికి నాయం దట్టి కరుణ కల్గుట మహాభాగ్యముగా నేను మురిసిపోవుచుండెడివాడను. నా మురువుముచ్చట లన్నియు మొన్నటి శివరాత్రితో ముగిసిపోయినవి. ఆ దయామయుని నిర్యాణము నా హృదయమున కొక పెద్ద యభిఘాతమైనది. ఆ యభిఘాతమువలని వ్యథ నపనయింపగల మందు_ అద్భుతావహమును, ఉత్సాహజనకమును, విజ్ఞానప్రదమును, ఆనందదాయకమును, పవిత్రమును నైన తచ్చరిత్రస్మరణముకంటెను మఱి లేదని తోచి నే నీ వ్యాసము వ్రాయబూనుకొన్నాను. ఇది స్మరణమాత్రమే కాని క్రమమైన సమగ్రచరిత్ర కాదు. శ్రీశాస్త్రులవారి ప్రతిభాసంపత్తి, కవితాప్రాశస్త్యము, ధారాధారాళత, ధారణాపటిమ, వాదకౌశలము, వాక్చమత్కారము మొదలగు గుణవిశేషములను దెలుపు ఘట్టము లొకకొన్ని యిందు ప్రస్తావింతును.

సంస్కృతభాషాప్రాబల్యమున నలిగి యడుగు వట్టిన జానుతెనుగును పైకి తీసి, ప్రాణముపోసి, తెనుగు కవిత్వమును ప్రబంధగతినుండి ప్రజాసాహిత్యమునకు మరల్చి, తెనుగుజాతికి మహోపకారము చేసిన మహాపురుషులు శ్రీ తిరుపతివెంకటకవులు. అందును వెంకటకవీంద్రుడు ప్రథమస్మరణీయుడు. అది యెట్లనగా - ఆయనగారు పుట్టుకతోనే తెనుగుకవి. తిరుపతిశాస్త్రిగారు కేవలసంస్కృతకవి. ఉభయులును పిన్నవయసుననే శ్రీ చర్ల బ్రహ్మయ్యశాస్త్రిగారియొద్ద వ్యాకరణశాస్త్రమును సమగ్రముగా నభ్యసించినారు. అచటనే ఆ యిరువురికిని కలయిక. అసలు వా రిద్దఱు నొకయూరివారు కారు; ఒకసీమవారును కారు. తిరుపతిశాస్త్రిగారిది జిల్లీసీమలోని యెండగండి. వెంకటశాస్త్రిగారిది (ఫ్రెంచివారి) యానాము. వా రొక శాఖవారును కారు. మొదటివారు వెల్నాటివారు; రెండవవారు ఆరామద్రావిడులు. దైవ మాయిద్దరిని బ్రహ్మయ్యశాస్త్రిగారియొద్ద సంధానించినాడు. అక్కడనే దివాకర్ల తిరుపతి కవియు, చెళ్లపిళ్ల వెంకటకవియు కలిసి, 'వెరసి తిరుపతి వెంకటకవు' లయినారు. వెంకటశాస్త్రిగారు తిరుపతిశాస్త్రిగారికి తెనుగునం దభిరుచి పుట్టించినారు. వారు వాదప్రతివాదమార్గమున, వెంకటశాస్త్రిగారివలన తెలుగుతెన్ను లన్నియు తెలిసికొన్నారు. ఆశువుగా పద్యము లల్లుటయం దిద్దరును సరియుజ్జీలు. వీరి కవితాధారకు గురువుగారు మిక్కిలి సంతసించి, యెక్కువ మక్కువ చూపుచుండెడివారు. బ్రహ్మయ్యశాస్త్రిగారు కాశీపండితుల చేత 'అపరపతంజలి' యనిపించుకొన్న వైయాకరణ

సార్వభౌముఁడు; కాని వారికి కవితాపరిచయము లేదని వినికి. ఈ కీవిషయమును శ్రీ. శే. పంచాగ్నుల దక్షిణామూర్తిశాస్త్రిగారు చెప్పినారు.

తిరుపతివెంకటకవు లాసుకవిత్వముతోపాటు అష్టావధానప్రజ్ఞయు నలవరచుకొని, అవధానమొనరించి ధనమార్జించు తలఁపుతో నొకనాఁడు గురువుగారి యనుజ్ఞ పడసి కాకినాడకు వెళ్లినారు. ఆ ప్రయాణములోనే తిరుపతిశాస్త్రిగారు ఆంధ్రచ్ఛందోరహస్యము లనేకము వేంకటశాస్త్రిగారివల్ల గ్రహించినది. కాకినాడలోని సంపన్నగృహస్థు లీకవులచేత అష్టావధానము చేయించి, సంతసించి, చక్కఁగా సత్కరించి, "శతావధానము చేయవలసిన" దని కోరిరి. శతావధాన మన నేమో తి. వెం. కవుల కప్పటికి తెలియదు. అందువల్ల వారు "అయ్యా, శతావధానము మే మెక్కఁడను చేయలేదు; చూడనైనను లేదు. దానినిగూర్చి యాలోచించి రేపు చెప్పెద" మనిరి. "శతావధాన మనగా నూర్గురికి పద్యములు చెప్పుటయే; కావున నది మన బుద్ధి కొక పెద్దపని కాదు. కాని, నూరుపద్యములను ధారణచేయ గలమో లేమో" యని శంకించుకొని, కవులిద్దరు నొక కొంకాయతోటకు పోయి, చెట్లనే పృచ్ఛకులుగా భావించుకొని, ప్రశ్నలు తామే నిర్ణయించుకొని, చెరియొక చరణముగా నూఱుపద్యములను చెప్పి, మరల నన్ని పద్యములను ఇద్దఱు నప్పగించి సరిచూచుకొని, 'ఓహో! ఈపాటికేనా యీపని' యనుకొని, మరునాఁ డా గృహస్థుల కడ కరిగి "మేము శతావధానము చేయుదు"మని చెప్పిరి. పౌరులు మహోత్సాహముతో సంపూర్ణశతావధానము చేయించిరి. అనర్గళకవితాధారతో, అకుంఠితధారణాశక్తితో అవధానము నవలీలగా పూర్తికావించి, బహుపండితకవి ప్రశంసలతో నాలుగునూటపదార్లు, నేలఁజోడులు బహుమతిగా నందుటయే కాక, ఆ పిన్నవయసుకవులు అసూయాపరుల దురాక్షేపములను ఖండించి 'కింకవీంద్రఘటాపంచానన' బిరుదమును గూడ పొందిరి.

బహుమతులతోను, ప్రశంసాపత్రములతోను, బిరుదములతోను వచ్చి తనకు మ్రొక్కిన శిష్యులను బ్రహ్మయ్యశాస్త్రిగారు అత్యంతము గారవించి యాశీర్వదించిరి.

కేవలసంస్కృతకవియైపోనున్న తిరుపతిశాస్త్రిగారిని తెనుఁగుకవిగా మార్చి లిన శుద్ధిచేసికొని తత్సహాయమున తెనుఁగుకవిత్వమున కభ్యుదయము చేకూర్చిన మహానుభావుఁడు కావున వేంకటశాస్త్రిగారే తెనుఁగు ప్రపంచమునకు ప్రథమస్మరణీయులన్నది యిక్కడ ప్రకృతము.

వారి వీరి మాట యేల, ఆ తిరుపతిశాస్త్రిగారే, వేంకటశాస్త్రిగారిని గురువుగా సంభావించెడివారు.

"వితతాత్మీకృతశతావధానకవితా
విద్యాపయోరాశి సం
భృతశిష్యాంబుదవాఙ్మయామృతరస
ప్రీతాఖిలాంధ్రక్షమా
దృతరత్నప్రదపీఠకావతంసకృతసం
దిష్టోత్తమాలావిభూ
షితు మా వేంకటశాస్త్రి నే బొగడెదన్
శివస్వరూపు బుధన్."

అన్నారు నర్సరావుపేటశతావధానములో. అంతే కాదు; ప్రసంగములో 'నీవు' అన్నను జాబులలో మాత్రము 'వేంకటశాస్త్రిలవారి పాదపద్మముల సన్నిధికి' అనే వ్రాసెడివారట. తిరుపతిశాస్త్రిగారు స్తమించినపుడు, ఈవిషయమునే తెల్పుచు వెంకటశాస్త్రిగా రిట్లు విలపించినారు:

"త్వంకారోక్తులతో ప్రసంగము సహో
ధ్యాయిత్వముం దెల్ప, ని
శ్శంకన్ వ్రాసెడి వ్రాతలందలి నమ
స్కారాదిసంభావనా
లంకారంబులు వాయెనం గల యన
ల్పత్వత్కృతజ్ఞత్వముం
బొంకమ్మున్ వెలిపుచ్చు వర్తిలిన నీ
బుద్ధిన్ నుతింతున్ సఖా."

అన్నివిధముల తన కీడుజోడైన తిరుపతిశాస్త్రిగారిని తోడుచేసికొని వెంకటశాస్త్రిగారు ముప్పది

సంవత్సరములు అవధానకవితాసామ్రాజ్యమును ఏకచ్ఛత్రాధిపత్యముగా నేలినారు. అది యవధాన యుగము. ఆనాడాంధ్రదేశమున ఆ కవిసింహములు త్రొక్కి చూడని పట్టణము లేదు. వారు చొచ్చి చూడని సంస్థానము లేదు. ఆ కవిచంద్రులను పూజింపని రసికుడు లేడు; సత్కరింపని రాజు లేడు. ఆ కవుల జంట తమ యనుపమకవితామృతవర్షమున రసికలోకము నోలలాడించి, తమ్మెదిరించిన ఉద్దండపండితమండలి నోడించి, దిగ్విజయభేరీభాంకారములతో గజారోహణాద్యుత్సవములతో వెలిగిపోయినది.

"ఏనుగు నెక్కినాము ధర
 నీంద్రులు మ్రొక్కగ నిక్కినాము స
న్మానము లందినాము బహు
 మానములం గ్రహియించినార మె
వ్వానిని లెక్కపెట్టక ని
 వారణ దిగ్విజయంబొనర్చి ప్ర
జ్ఞానిధు లంచు పేరుగొని
 నారము నీవలనన్ సరస్వతీ !"

అన్న పద్యమునకు ఎట్టి మాఱుపాటును పొసగకుండ, జీవితాంతమువరకును నిష్కళంకయశస్సుతో విరాజిల్లిన మహాకవులు తిరుపతి వేంకటేశ్వరులు.

అవధానములలో ఆ కవులు చూపుచువచ్చిన ప్రజ్ఞ అద్భుతావహకము; వర్ణనాతీతము; అతిమానుషము కూడను.

శతావధానములో పృచ్ఛకులు స్థానములు మార్చి కూర్చున్నను, వాదప్రతివాదములు పెంచి చిత్తమునకు విక్షేపము కలిగించినను, వారి ధారణ చెక్కుచెదరదు గదా ! అది యట్లుండగా, పద్యములను వరుసగా చెప్పనీయక, పృచ్ఛకు లొకప్పుడు "ముందు మాపద్యమును పూరింపుడు, మాపద్యమును పూరింపు" డనుచు— ౧౦, ౫, ౬౪, ౪, ౯౨, ౩, ౨౦ అని చెల్లాచెదరుగా తమతమ సంఖ్యలను తెలుపుచుండురు. అవధానులాప్రకారమే చెప్పి, తుదకు నూఱుపద్యములను, ఎట్టి చ్యుతియు లేకుండ వరుసగా నొప్పగింతురు. ఇది సామాన్యమానవబుద్ధికి సాధ్యమగు కృత్యమేనా ? ఆ మేధానిధులు "శతఘంటకవనమ్ము సల్పుసంగతియన్న గరతలామలకమ్ము గాదె మాకు" అన్నారంటే, అందతిశయోక్తి యేమున్నది ?

అష్టావధాన మనిన వేంకటశాస్త్రిగారికి చెరలాటము. నిజానికి శతావధానముకంటెను అష్టావధానము కష్టతరము. అందు 'నిషేధాక్షరి' అవధానికి తలప్రాణము తోకకు తెచ్చు కృత్యము. వేంకటశాస్త్రిగారు, అందుకు కూర్చున్న కవికి అంతు పట్టియ్యకపోతి నాడించిన ట్లాడించెడివారు.

అష్టావధానిని గట్టిగా పట్టిచూచు రెండవ ఘట్టము వ్యస్తాక్షరి. వ్యస్తాక్షరి యనగా, పరీక్షకులు కొన్ని పదములను కాగితపు ముక్కలపై వ్రాసి, వరుససంఖ్య వేసి, అవధానసమయమున వానిని వరుసజంబడి కాకుండ చెల్లాచెదరుగా అవధాని కప్పుడొకటి— అప్పుడొకటిగా చూపి మరల తీసికొనుచుందురు. అవధాని అవధానానంతర మా మాటల నన్నిటిని వరుసప్రకార మొప్పగించవలెను. సాధారణముగా ఒక వృత్తపాదమో, ఒక వచనపంక్తియో ఇరువదియక్షరములకు మించకుండ వ్యస్తాక్షరి కిచ్చుచుందురు. ఆ మాత్రమునకే యవధాని ధారణ చెడి తారుమారగుచుండును. అట్టి వ్యస్తాక్షరికి శ్రీతిరుపతి వేంకటకవులకు, ఇంగ్లీషుదొరలు చేయించిన యొక యవధానములో—

(౧) యిష్, వైఙ్, నిఖ్ట్, వాస్, సోల్, రోస్, బిడాయిటెస్ట్, డాస్, యిష్, యిష్, సో, ట్రవరిష్, టిస్, అరోఙ్, మెర్కఙ్, హౌస్, రోట్లెఙ్, లైటెఙ్, డాస్, కంపెట్, నూర్, షోన్, డెఙ్ —అను జర్మనీభాషాపదములును,

(౨) యూయం, తత్ర, సిగార్, తథాపి, వెరివెల్, తస్మాత్, న్యయాయా, శశీ, సోగోసార్, మదరాసు, కాయకరితం, హింగేంపు, బాయేందునం, నింగతూర్వరయ, నింగహూద, విజుదల్, నీవాడనంటిం గదా, కిపాస్వస్తే మయిబోల్తహాం, అజీ, సునో, తక్సీర్, న, మేరే, ఉపర్— అను నానాభాషాపదములతో గూడిన శార్దూలవిక్రీడితమును,

(3) అవధానుల కవితాశక్తిని అర్జునుని బాణవర్షముతో బోల్చి అప్పటికప్పుడే రచింపబడిన— "అట్టావదానికళ్, శెయ్యువల్లే, మెక్, ద్రవైపు హుందు, తట్టామలేశిలర్, తత్తలిప్పార్, విల్లిలిక్, శిరంలోల్, ఎట్టెపుహుంద్రు, పిన్నె, టెట్టెట్టె టింగి వరై, యొప్పు, ముట్టాదు శెయ్యువల్లారిల్లై, యేయింద, మెయిణిలత్తె" అను ద్రావిడభాషాశ్లోకమును ఇయ్యబడినవి.

ఒక్క పదమైనను వెనుకముందు కాకుండ అవధాను లీగంపెడుమాటలను వరుసవెంట నప్పగించిరి. సభ్యు లా ధారణాబలమున కత్యాశ్చర్యపడిరి. అంతటి ప్రజ్ఞావిశేషము కలవారు గావుననే, వారు

"అష్టావధానకష్టాపలంబనమున్న-
నంబికొండయదండనంబు మాకు"

అన్నారు.

అష్టావధానములో కవిత్వ మొక యంశము. తక్కిన యేడంశముల సమర్థించుకొనుచు, నలుగురైదుగురికి వారు కోరినరీతిగా పద్యములు చెప్పుటయే కష్టము. అట్టిచో నా మహాకవులు, అష్టావధానములో నేబదిమందికి పద్యములు చెప్పిన పట్టులును ననేకము కలవు.

అన్నిటికంటెను 'ఆశాశపురాణ' మబ్బురము గొలుపు విషయము. ఆకాశపురాణ మనగా, సభ్యులప్పుడే వినిపించిన యొక క్రొత్తకథ నాధారముచేసి కొని, ఆ జంటకవులలో నొకరు గ్రంథము చదువుచున్నట్లుగా సరిక్రొత్తవర్ణనలతో నాఁకువుగా పద్యములు చెప్పుచుండగా, రెండవ వా రాపద్యములకు పురాణఫక్కిలో నర్థము చెప్పుట. ఈ యంశమునకు బందరు నోబిలుకాలేజిలో బైబిలులోని యొక యితిహాస మియ్యబడినది. వెంకటగిరిసంస్థానములో 'రాజాగారి రామేశ్వరయాత్ర' వస్తువుగా నొసగబడినది. ఏబది పద్యములు చెప్పబడినవి. ఆ యశ్వాసములోను ఆ కవీంద్రుల కవితాధార యెంత ప్రౌఢముగా, ఎంత చమత్కారముగా సాగినదో చూడుడు.

## ఆంజనేయస్తవము

"కావ్యనాటకముఖోద్గ్రంథముల్ చదువని
వాని కబ్బిన మంచి ప్రతిభ యేల?
చతురభామామణీసాంగత్య మబ్బని
వానిదౌ నవ్యయౌవన మదేల!
అష్టశతావధానాదిసత్క్రియ చేయ
దగని యాకవి కవిత్వం బదేల!
త్యాగభోగాదిభాగ్యము వందగా లేని
ధనికునిదైన యా ధన మదేల?
నీ పదధ్యానసంసక్తి నెగడనట్టి
వాని జన్మం బదేల? సౌభాగ్య మేల?
అహహ! సీతాపతీమపత్యంఘ్రి తామరస
కంజసంసక్తహృదయ, యో యాంజనేయ."

అవధానసమయమున పృచ్ఛకు డెట్టి కఠినవిషయములతో కోరినను కాదనక పద్యము చెప్పగల శక్తి ఆ కవిద్వయమునకు దప్ప మఱియొక్కరికి లేదు.

వినుకొండలో జరిగిన యవధానములో నొక పృచ్ఛకుడు "దశావతారముల పేరులు కందపద్యములో నిముడ్పగలరా?" యనెను. తిరుపతిశాస్త్రిగారు "ఏమో ప్రయత్నింతు" మనిరి. మరల నా పృచ్ఛకుడు "దశావతారముల పేరులు కందమున రెండుచరణములలోనే యుండవలె"ననెను. వెంకటశాస్త్రిగారు "మఱి తక్కిన రెండు చరణములలోనో?" అనిరి. పృచ్ఛకుడు "తమ యిరువురి పేరులు నుండవలె" ననెను. తిరుపతిశాస్త్రిగారు "అంతేనా?" అనిరి. అప్పుడు పృచ్ఛకుడు "అయ్యా, మఱచిపోయినాను. అన్యథాశైన పరబ్రహ్మశాస్త్రిగారి పేరుకూడ నుండవలెను." అనెను. అప్పుడు వెంకటశాస్త్రిగారు "ఓయీ, నీకోరికను కాదనలేక మే మెట్లో పద్యమును పూరింతుము. దాని కేమిగాని, మేము యాచకులము. పదియవతారము లెత్తిన హరియు వామనావతారమున మావలె యాచకుడే. కాని మన యధ్యక్షుడు మూడువాలుగువందల జీతము తీసికొనుచున్న మండల ప్రభువుగదా! మా ప్రక్కన కూర్చుండుటకు సమ్మతించునా? కందములో చోటు చాలలేదు, జరుగు మని

మేము నొక్కుచో (ఆయనగారు మూలకారకులు) సహింతురా ?" యనెను. సభ చప్పటలతోను, నవ్వులతోను మాఱుమ్రోగెను. అధ్యక్షుడు "స్వామీ! నే నొక చెంప నిలువబడుమన్న నిలువబడుదును. తా మెట్లైనను ఆ కందములో నా కింత చోటు కల్పింపవలె"నని యర్థించెను. వెంటనే పద్య మిట్లుత్పన్న మయ్యెను.

"జలచరఘుటికిరినరహరి
కలిలవటుత్రివిధరామకల్కులు బుద్ధుం ;
డిల దిరుపతి వేంకటశా
స్త్రులును, పరబ్రహ్మశాస్త్రి జాతురు పేర్కొన్"

కుత్సితాక్షేపకులకును, వంచకులకును బుద్ధి చెప్పుటలో వెంకటశాస్త్రిగారి వంటి నేర్పరి నభూతో నభవిష్యతి.

ఒక వంచకుడు 'చింతకాయపచ్చడిమీద పద్యము చెప్పెదరా ?' యనెను. వెంటనే శాస్త్రిగారు "అబ్బో ! చెప్పకేమిగాని దానికి పద్యముకంటే పాట అయితే బాగుండును" నన్నారు. "అయితే—అదే చెప్పండి" అన్నా డా ధూర్తుడు. అప్పుడే శాస్త్రిగారు—

"చేరెడేసి విత్తూలుండరా-మూరెడేసి యీనెలుండరా
చింతకాయపచ్చడి చెప్పా తరమా ?"

అని పాటపాడి వికటస్వరముతో తాళము వేసి ముక్తాయింపు గూడ చూపించి, "ఏమోయి ! బాగున్నదా ?" అనిరి. సభయంతయు గొల్లున నవ్వి చప్పటలు తట్టి ఆ పృచ్ఛకుని హేళనచేసెను. పృచ్ఛకుడు మొగము ముడిచేసికొని యధ్యక్షునివంక చూచెను. "మంచివిషయ మేదైనను మఱియొకటి యడుగు" మని యధ్యక్షు డాతనిని హెచ్చరించెను. ఆతడు 'చింతాకు మీద చెప్పు' డనెను. 'అదియు నుచితమైన ప్రశ్నము కా'దని యగ్రాసనాధిపతి నివారించెను. అపు డా పృచ్ఛకుడు, 'చీకుముల్లుమీద జెప్పెదరా ?' యని బింకముగా బలికెను. వెంటనే వెంకటశాస్త్రిగారు—

"నిన్ను గాల్చినగాని నీబుద్ధి మానదే ఛీ !"

యనెను. పృచ్ఛకుడు బిత్తరపోయి—తెప్పరిల్లి—"ఎందుకండీ నన్నట్లు తిట్టుట ?" అని యడిగెను.

తిరుపతిశాస్త్రిగారు-"అబ్బాయీ, అది నిన్ను దూషించుటకాదు ; చీకుముల్లుమీది పద్యము. అది సీస చరణము. ఆయనగారి కవిత్వముతీ రంతే" ననుచు—

"యే మనందునే చీకుముల్ల"

అని ఆ సీసచరణమును పూరించిరి. పిమ్మట వెంకటశాస్త్రిగారు పద్యము నిట్లు పూర్తిచేసిరి:

"దొంగరీతిని దూఱి దొరకకుందువుగదే ఛీ !...
పొరలోపలం జేరి పోటుకాఱ్చెదుగదే ! ఛీ !...
పద మాశ్రయించియు బాధగొల్పెదుగదే ! ఛీ !...
నిన్ను మర్యాదగా జూచు నేని యెట్టి
దట్టు జేసియు నీదు కోతలకు లోగ
జెప్పదెబ్బకుదప్ప నీ చెడ్డగుణము
చీకదుసుమీ, యిసీ ! యిసీ ! చీకుముల్ల ?"

ఆనాటి సాయంకాలపుసభలో ఆ పృచ్ఛకుని మొగము మరల కనబడలేదు.

తిరుపతిశాస్త్రిగారు అవధానకార్యమునందు గాఢదీక్ష వహించియుందురు. ఇక పండితుల ప్రశ్నలకు సమాధానములు చెప్పుట, దుండగీడుల దూకుడు లడగించుట, దుర్వాదములకు దిగువారికి వాకట్టుకట్టుట, సభ్యులకు విసుగుదోపకుండ కమ్మకమ్మని పద్యములతో సరససంభాషణలు సాగించుట మొదలగు సర్వవ్యవహారనిర్వాహణము వెంకటశాస్త్రిగారిదే. ఈయెల్ల పనులు సవరించుకొనుచునే తమవంతు వచ్చినప్పుడు, గంగాఝురీవేగముతో పద్యపాదములు పూరించువారు ; తుదకు తిరుపతిశాస్త్రిగారితోపాటు తామును పద్యము లన్నియు నప్పగించెడివారు. అది యేమి మేధయో ! అది యెక్కడి ధారణాపటిమయో ! ఒక్కొక్కప్పుడు వెంకటశాస్త్రిగారు తిరుపతిశాస్త్రి గారికి హస్తాకృతిసూక్ష్మసంకేతములతో చేయూత నొసగుటయును కలదు. నే నెఱిగిన దొక్క విషయము.

వినుకొండ అవధానములో పృచ్ఛకు డొకడు "శవములు జీవించియుంట సంభవమయ్యెన్" అను సమస్య యిచ్చి—"ఇందు కపిశవములు అనగూడ" దని శాసించినాడు. తిరుపతిశాస్త్రిగారు వెంటనే పద్యమును ప్రారంభింపక ఒక్క క్షణకాల మాలస్యము చేసినారు. అది చూచి వెంకటశాస్త్రిగారు కుర్చీనుండి కటాలున లేచి 'అవతలికి పోయివత్తు'నని చెప్పి కుంటుచూ నడచిపోసాగినారు. "ఎందుకు కుంటుచున్నా"రని యెవరో అడుగగా "కాలిలో ముల్లు గ్రుచ్చుకొన్న"దంటూ వెళ్లిపోయినారు. వారు తిరిగి వచ్చులోపల తిరుపతిశాస్త్రిగారు—

"భవనంబునుండి వెలుపటి
కి వచ్చునంతనె యదేమి కీడో కో! కాలం
దవిలె నొక క్రేవిడొకో
శవములు జీవించియుంట సంభవ మయ్యెన్"

అని సమస్య పూరించి కూర్చున్నారు.

ఈ క్రిందిసమస్యను వెంకటశాస్త్రిగారు తామే వ్రాసి మఱియొకరి కిచ్చి వారిచే నడిగించుకొని పూరించినారు.

(సమస్య) "మాకులదాస! యెంత యభి
మానము లేదుర? చంద్రశేఖరా!"

"నాకు విభూతిరాయ డొక
నాయకుడా?"యని వీడు భార్యర
త్నాకరు కెట్టవట్టు టది
యూరసియుండియు, సిగ్గులేక ర
త్నాకరు జంక బెట్టుకొని
యక్కలటన్ దలదాల్చె దొర! భా
మాకులదాస! యెంత యభి
మానములేదుర? చంద్రశేఖరా!"

ఈపద్యమున తద్జ్ఞులవలన దెలిసికొనవలసిన గాథ కొంత యున్నది.

ఎందుకు విస్తరము? అవధానకళ తిరుపతి వేంకట కవుల సొత్తు ఆ కళ నుద్ధరించుటకే వా రవతరించినారు. అది దైవదత్తమగుశక్తి; పౌరుషమున సాధింపదగినది కాదు. కావుననే వేంకటశాస్త్రిగారు, గద్వాల సంస్థానములో, వందలకొలది పండితకవు లున్న మహాసభలో లేచి—

"గమురై పండితులెల్ల వాహ్వారె! యనం
గా, సత్కవుల్ మెచ్చ దు
ర్గమదుర్గాకరణాకటాక్షవిసర
ప్రాప్తాసుధాటీవిశే
ష మెలర్పంగ శతావధానకవితా
సామ్రాజ్యపట్టాభిషే
కము పొందంగను మాకు దక్కెగలదే
గద్వాలభూపాలకా."

అని సవాల్ చేసినప్పు డెవ్వరును పల్లెత్తిపలుక లేక పోయినారు.

తిరుపతి వేంకటకవులు—"వ్యర్థమను వాదము లొనర్చునట్టివారి డంబ మణగించు టాపోశనంబు మాకు" అన్నారు. అందును అతిశయోక్తి లేదు.

కొండలవంటి పండితులుకూడ వారిని పరాభవింపబూని పరాభూతులైనారు. ఒక్క యుదాహరణము.

ఉద్దండపండితులైన పేరి కాశీనాథశాస్త్రులవారు తి. వెం. కవుల ఐశ్వర్యపట్టాభిషేకనాటకమును విమర్శింప దొరకొని, ముందు ఆ కవులకు గల 'కింకవీంద్రఘటాపంచానన' బిరుదము నిట్లాక్షేపించినారు:

"కింకవీంద్రులు అను, ఏనుగులగుమికి సింహములు అను నర్థముతో వా రీబిరుదమును ధరించినారు. కాని 'యేనుగు' అను నర్థమిచ్చు పదము 'ఘట'కు ముందు లేదు గనుక కిం-క-వీ+ఇంద్ర=కుత్సితములైన జలపక్షిశ్రేష్ఠములయొక్క, ఘటా = సమూహమువలె, పంచ = వెడల్పైన, ఆనన = ముఖముగల వారు; అనగా 'కొంగముక్కులవంటి పెద్దముఖములు కలవారు' అనియే కాని కింకవిగజఘటలకు సింహములన్న యర్థ మేర్పడదు. వారు పెట్టుకొన్న బిరుదమే యింత హాస్యాస్పదముగా నున్నదే, ఇక వారి గ్రంథ మెంత చక్కగా నుండునో?" అని ఆక్షేపము.

అందుకు కవు లొసగిన సమాధానము—"ఆర్యా! శాస్త్రిగారూ, ఆ బిరుదు మాకు పండితు లొసగినది



శతావధానమున అమరయశస్సు నొందిన శ్రీ తిరుపతి వేంకటకవులు.

కాని మేము పెట్టుకొన్నది కాదు. మీ యాక్షేపమునకు సమాధానము చెప్పవలసినవారా పండితులుగాని మేము కాము. కాకపోయినను మాకు తోచిన మాటలు మనవిచేయుచున్నాము.

ఆ పండితులు 'ఘటా' శబ్దమును కరిఘటార్థము వనే వారికేమో మాకు తెలియదు. మేముమాత్ర మాయర్థములో అభిరుచిని ధరించుటలేదు. పెద్దలు తా మూహించిన 'కొంగముక్కు' అర్థముతోనే ధరియించి యున్నాము. ఎందుకనగా: ఎప్పటికైనను 'కాశీనాథులు' లభింతురనీ, అప్పుడు చక్కగా పనికి వచ్చుననీ.

'కాశి' యనగా (క + అశి) నీరు త్రావి జీవించునది = చేప; కాబట్టి 'కాశీనాథ' శబ్దమునకు మత్స్యశ్రేష్ఠమని యర్థము. అది లభించినపు డుపకరించునది 'కొంగముక్కు' గాని 'ఏనుగ సమూహము' కాదు. చిత్తగించినారా!

స్వామీ! 'ఘటా' శబ్దమునకు 'ఏనుగులగుం' పనియే యర్థము. 'కరిణాం ఘటనా ఘటా' అని యమరములోనే యున్నది. కావున తమ యాక్షేపము తప్పు".

చూచితిరా! సమాధాన మెంత యుక్తియుక్తముగాను, ప్రౌఢముగాను ఉన్నదో! ఇట్టి కథ లనేకమున్నవి. ఇక్కడ ఎన్నని చెప్పగలము.

* * *

'తిరుపతివేంకటేశ్వరులు'—ఎంత ముచ్చటైన పేరు! పేరుల వలెనే మనసులును, మనసులవలెనే కవితారీతులును చక్కగా హత్తుకొనిపోవుటచేత ఆ జంటకవుల పద్యములు వీనుల కమృతపు సోనలై ఒక్కసారి విన్నంతనే హృదయమున ముద్రితమై పోయెడివి. అందుకు తోడు వెంకటశాస్త్రిగారి కమ్మని కంఠస్వరము—వారు పద్యము పఠించు ఫక్కి ఇట్టిదని చెప్పరాని యానందమున సొక్కించెడివి. మోహనరాగచ్ఛాయలతో వారు పద్యము చదివినప్పుడు శ్రీకృష్ణ మురళీమధురగానమును విన్న గోపికలవలె సభ్యులు సమ్మోహితు లయ్యెడివారు.

నేను పూర్వజన్మమున జేసిన పుణ్య మత్యల్పము. ఒక మూడు (నర్సరావుపేట, వేమవరము, వినుకొండ) అవధానములుమాత్రమే చూడగలిగితిని. అవి యవధాన కళకు వార్ధకపు దినములు. బహుశః వినుకొండయవధానమే తుట్టతుదిదేమో! ఆ యవధానప్రారంభములో వెంకటశాస్త్రిగారు—"మే మీశ్రమ కోరువజాలము. ఇం కెన్నినాళ్లు మా కీపరీక్ష? ఒకసారి 'సర్టిఫికేట్టు' పొందినవానిని మాటిమాటికిని పరీక్షించుట యేమి న్యాయము" మన్నారు. అది శ్రోతృబహుళమైన సభ. "ఎక్కువశ్రమ కోరువజాలకున్నచో ఒక యిరువది మందికే చెప్పండి" అన్నారు సభ్యులు. అప్పుడు తిరుపతిశాస్త్రిగారు ఒక్కనిమిషమైనను ఆలోచన సేయకయే—

"అవధానంబులు మానుకొంద మన నే
మాయేతికాయేడు చి
న్నవో లేకుండిన పెద్దవో యొనరుపగ
మాన్యుల్ కవిత్వాఖిలి
ష్ణవు లీరీతిగ శ్రద్ధ దేయునపు డి
ష్టుల్ గాయి మాకేటి కీ
వ్యవసాయంబును మాన మామరణ మో
వాగ్దేవి రక్షింపవే"

అని పద్యమును చదివి—"ఏమిటి మొదటి ప్రశ్న?" అన్నారు. "మాన మామరణ మో వాగ్దేవి" యని తిరుపతిశాస్త్రిగా రన్నప్పుడు నా 'వొళ్లు' జలదరించినది. నా కిప్పటికిని వారి జలద గంభీర గళధ్వని వినవచ్చుచున్నది. మొరటుసభికుల గడుసుదనమునకు విసిగి, ముకిపడిన ముఖముతో నిలువబడియున్న యామహాపురుషుని మూర్తి నా కన్నుల వ్రేలుచున్నది.

ఆ దినములలో తి. వెం. కవుల అవధానపద్యములు, నానారాజసందర్శనచాటువులు, వివాదకవితలు తెనుగుదేశమున నింటింట మాఱుమ్రోగినవి. వారి శ్రవణానంద మిప్పటికిని పలువురు రసికులకు పారాయణగ్రంథమే. ఇక భారతనాటకములకు గల ప్రశస్తి చెప్పనక్కరయే లేదు. వారి యవధానసభలు, వివాద ఘట్టములు, కావ్యములు, నాటకములు తెనుగు యువ

కులకు భాషాభిమానమును కలిగించినవి. కవితాశ మెత్తించినవి. వందలకొలది చిన్నవాండ్రు ఆశుకవు లైనారు; అవధాను లైనారు; కావ్యకర్త లైనారు; విమర్శకు లైనారు. నేటి మేటికవులలో పలువురు వారే కావున, ఈనాటి కవిలోకమునకు తిరుపతి వేంకట కవులు గురువులు. అందు వేంకటశాస్త్రిగారు పరమ గురువు.

తిరుపతిశాస్త్రిగారు దివంగతులై యిప్పటికి ముప్పదియేండ్లయినది. అయినను వారు లేరన్న కొదవ కనబడనీక తమ యశస్సును కాపాడుకొనుటయేకాక, వేంకటశాస్త్రిగారీ ముప్పది సంవత్సరములను సారస్వతతపస్వియై యుండి, తుదకు ప్రభుత్వాస్థానకవిపీఠ మధిష్ఠించి, తమ పూర్వయశస్సును ద్విగుణీకరించినారు.

ఎత్తిన కలము తుదిగడియవరకును దించకుండ అరువదియేండ్లు శారదాసేవ చేసి, ఐహికప్రతిష్ఠలలో సర్వోన్నతపదము నధిగమించి యెనుబదవయేట శివరాత్రిపుణ్యదినమున దేహము చాలించి శివునిలో చేరి పోయినారు మాగురువులు వేంకటశాస్త్రిగారు.

అట్టి ప్రతిభాప్రభావమహితు లెన్నటికైనను మరల మనదేశమున నవతరింతురా! ఏమో! ఎన్ని శతాబ్దులకో!



# సంస్కృతభాషలో కొందఱు శతావధానులు, ఆశుకవులు

●

శ్రీ ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులు

'నానృషిః కురుతే కావ్యం
ఋషిశ్చ కిల దర్శనాత్.' (భట్టతౌతుడు)

ఆర్ష సంస్కృతి లేనివాడు కావ్యనిర్మాత కాజాలడు. అతీంద్రియములను, పరోక్షములు నగు విషయములను, దృశ్యములను గ్రహించు శక్తి గల వాడు ఋషి. 'రవి కానని చో కవి కాంచునే కదా' అని వృద్ధసూక్తి. ల్యాటిన్ భాషలో కవికి 'వేట్స్' (*'Vates'* = *Prophet*) అను పదము వాడుదురని మహామేధావి 'కార్లయిల్' పండితుడు వ్రాసియున్నాడు. పై 'వేట్స్' పదమునకు *'Seer'* (దర్శించు వాడు—ద్రష్ట) అని యర్థము. ఇదియు నార్యసూక్తిని సమర్థించుచున్న ట్లున్నది.

'కావ్యకర్మణి కవేః సమాధిః వ్యాప్రియతే'.

(కావ్యకల్పనమున సమాధి—ఏకాగ్రచిత్తము—మిగుల నవసరము) అని శ్యామదేవుని మతము. 'మనస ఏకాగ్రతా సమాధిః. సమాహితం చిత్త మర్థాన్ పశ్యతి' అని రాజశేఖరవిద్వత్కవి.

మనస్సు నేకాగ్ర మొనరించుట (నిశ్చలత్వమునందించుట) యే సమాధి. సమాహితచిత్తమునకు వర్ణనీయములగు విషయములు, దృశ్యములును కన్నులకు గట్టిన ట్లుండును.

సారస్వతసిద్ధి విద్వాంసులుకూడ నిపుణతతో సేవించినగాని లభింపని మహారహస్యవస్తువు. ఆ సిద్ధి కొక్కటియే యుపాయము — వేద్యవస్తువును దెలిసికొను చిత్తమున నేకాగ్రతను గలిగించుటయే యని రాజశేఖరుడు 'కావ్యమీమాంస'లో నుడివియున్నాడు. కావ్యనిర్మాణమున సమాధి యాంతరప్రయత్నము; అభ్యాసము బాహ్యప్రయత్నము.

'చిత్తైకాగ్ర్యమ్ అవధానమ్. చిత్తస్య ఏకాగ్ర్యం = బాహ్యార్థనివృత్తిః, తదవధానమ్' అని వామనుడు. (చక్షుశ్శ్రోత్రాదిబహిరింద్రియములు తమతమ వ్యాపారములనుండి నివృత్తి నందుటవల్ల జేకూరెడి యేకాగ్రతయే యవధానము)

సావధానమగు చిత్త మెంతటి దుర్ఘటకార్యము నైనను సాధింపగలుగును. నూఱువిషయములపై చిత్తము నేకాగ్ర మొనరించుట శతావధానము. ఇట్టి విశిష్టప్రజ్ఞను మన ప్రాచీనసంస్కృతవిద్వత్కవులు సారస్వతక్షేత్రమున కఠోరవ్యాసంగ మొనరించుటకై వినియోగింపజొచ్చిరి. సునిశితధారణాపటిమవల్ల ధారాశుద్ధియు, దానివలన ధారావాహికముగ (నిరంతరముగ)—అప్రయత్నముగా—నాశువుగా—శీఘ్రముగా—కవితానిర్మాణనైపుణియు వారికి సంక్రమించినవి.

కొన్ని వేలయేండ్లనుండి భారతీయుల కాశుకవిత యలవడియున్నది. వ్రాతయే తెలియని ఋగ్వేదకాలమునుండియు బయలువెడలిన ఛందోబద్ధరచన యంతయు—లేఖనము, లిపిజ్ఞానము కలుగువఱకును—ఆశురచన, శీఘ్రకవిత కాక మఱియేమగును ? ఇట్టి రచయితలను 'శీఘ్రకవు' లనియు నందురు.

కావ్యనిర్మాణమునకు 'ప్రతిభ' ప్రధానము. నవనవోన్మేషశాలిని యగు ప్రజ్ఞయే ప్రతిభ. శబ్దసమా

హము, అర్థరాశి, అలంకారతంత్రము, ఉక్తి వైచిత్రి—ఇత్యాది కౌశలములన్నిటిని హృదయఫలక మున చిత్రించి, రేంది ప్రకాశింపజేయునో యద్ది ప్రతిభ. ప్రతిభానిధులకు చర్మచక్షువుల కగోచరము లగు దేశాంతర కాలాంతరవ్యవహారములు, విషయము లును కన్నులకు గట్టినట్లే భాసించును. సామాన్యమాన వుల కగోచరమగు వస్తుగతసౌందర్యము ప్రతిభాన్వితున కిట్టె పొడగట్టును. మేధావిరుద్రుడు, కుమారదాసుడును జాత్యంధులయ్యు, తమతమ ప్రతిభాప్రభావమువల్లనే మహాకవులై కావ్యనిర్మాణదక్షులుగా ప్రఖ్యాతినందిరి.

శిశూదయమునకు జనని పడు నవస్థలవలెనే ప్రతిభయు కావ్యోత్పత్తినకు నైదవస్థల ననుభవించి కావ్యరత్నమును గనును. అందు—

౧. మొదటిది 'హృదయసంవాదము'—రమణీయ వస్తుదర్శనమువలన గలుగు భావసంచలనము (*Stimulation.*)

౨. తన్మయీభవనము (*Conception*)—భావ గర్భితమై యాయా సన్నివేశములతోడను, విషయముల తోడను, పురుషులతోడను (లేక ప్రాణిజాతముతోడను) ఐక్యమై, వానియందును, వారియందును లీనమై, హరిద్రామార్గములు (పసుపు, సున్నము) రెండును గలిసి ప్రత్యేకవస్తుత్వవర్ణముల గోల్పోయి యేకవర్ణమై నట్లు, తన్మయమగుట.

౩. ఆస్వాదన—చర్వణము (*Gestation*)—భావావేశము క్రమముగా పరిణతినంది, వివిధభావము లేకీభవించి, యొక్క యనుభూతిగా చేర్పడుట.

౪. చిత్తవృత్తినిఃష్యన్దనము (*Inspiration*)—భావసంచలనము ననుభవించి, తదనుభవము నావిష్క రించుటకై—వెలువఱచుటకై—కల్గు తీవ్రప్రేరణము.

౫. నిఃష్యన్దము—నిర్మాణము (*Creation*)—ప్రతిభావంతుడు తాను దర్శించిన దృశ్యమును బుద్ధి పూర్వకముగగాని, యప్రయత్నముగగాని, రచనా రూపముగ జిత్రించుట. †—కావ్యమును రచించుట.

ఇక, ప్రాచీనాధునికసంస్కృతశతావధానుల యొక్కయు, ఆశుకవులయొక్కయు వృత్తాంతములు సంగ్రహముగా నొసగబడును.

౧. శ్రీశఠకోప యతీశ్వరులు :

(క్రీ. ౧౬ వ శతాబ్ది)

దక్షిణభారతవర్షమున శ్రీ వేదాంతదేశికులచే (క్రీ. ౧౨౬౮-౧౩౬౯) వజ్రకవచమును దొడిగించు కొనిన విశిష్టాద్వైత సిద్ధాంత సంప్రదాయమునకు జెందినది అహోబ(బి)లమతము. ఆదివణ్ శఠకోప స్వామి (క్రీ. ౧౩౭౯-౧౪౫౮) యాపీఠము నలంకరిం చిన ప్రథమాచార్యులు. ఈపీఠము మైసూరుసంస్థానము లోని తిరునారాయణపురమున (మేల్ కోట) స్థాపితము. ఈమతమునకు జెందిన పీఠాధిపతు లంద ఱును సంస్కృతమున మహావిద్వాంసులు, నందు కొందఱు కవిశిరోమణులై విలసిల్లిరి. ఈ పీఠాధిపతుల పరంపరలో నాఱవవారు (శంగిపురం) పరాంకుశ యతిచంద్రులు (క్రీ. ౧౪౯౪-౧౫౧౧) కృష్ణదేవరాయల కల్లుడగు అళియ రామరాజునకు సమకాలికులు. సప్తమ పీఠాధిపతియైన శఠకోపయతీశ్వరులు విజయనగరాధీశు డగు శ్రీరంగరాయల సమకాలికులు. ఈ యతివర్యులు పూర్వాశ్రమమున 'ఎలంకాడు' (బాలవన) వాస్తవ్యు లును, భారద్వాజగోత్రజులు నగు శ్రీనివాసాచార్యుల తనయులు. వీరి పూర్వాశ్రమనామము తిరుమలా చార్యులు. వేదాంతదేశికులకువలెనే వీరికిని 'కవి తార్కికకంఠీరవ' బిరుదము గలదు. వారివలెనే వీరు నాటకవిచంద్రులు. శతావధానప్రజ్ఞాధురంధరులు, సద్యఃకవితాప్రవీణులు నగు నీ యతివర్యులు ముకుంద దేవగజపతి ప్రభుసపర్యలను స్వీకరించిరి. నాడు ప్రసిద్ధి నందిన వాహినీపతి యను సంస్కృతకవీంద్రు డీసంయ మీంద్రుల శిష్యుడై యాయనను స్తుతించెను. హరి భాస్కరుని 'పద్యామృతతరంగిణి'లో నుల్లేఖింపబడిన విశ్వనాథవాహినీపతియు, చతుర్భుజుని 'రసకల్ప ద్రుమము'న నుట్టంకింపబడిన వాహినీపతియు, శఠకోప యతివర్యుల శిష్యుడగు వాహినీపతియు నభిన్నులుగా తోచును.

---

† '*The Creative Process or Stimulation to Creation*'—*Dr. R. N. Vale, M. A., Ph. D.*

శఠకోపయతీంద్రులు మనోహరకవితాసురభిళ మగు 'వాసంతికాపరిణయ' మను నైదంకముల సంస్కృతరూపకమును రచించిరి. వాసంతిక యను దేవకన్యకను, అహోబిలనరసింహస్వామికిని జరిగిన కల్యాణమహోత్సవ మిందు చిత్రింపబడినది.

౨. దేశికభక్త వేంకటాచార్యకవి :

తిరువహీంద్రపురవాసియగు నీ దాక్షిణాత్యకవి కవితాపటిమ యసదృశము. ఈయన జిహ్వాంచలమున కవితాసరస్వతి స్థిరవాస మేర్పఱచుకొనెనట. అందువలన నీ 'శీఘ్రకవి' మాటలాడునప్పుడును ఛందోబద్ధముగా గవితాచమత్కృతితో వ్యవహరించెడివాడట! కొన్నియేండ్లక్రిందట నీయన స్వర్గస్థుడయ్యెను. సమకాలికుల కర్ణకుహరములలో నిప్పటికిని ఈ యాశుకవి ఛందోబద్ధరచనలు ప్రతిధ్వనించుచున్నవని తెలియుచున్నది.

కాశ్మీరకవిశేఖరుడు బిల్హణకవి (క్రీ. ౧౧ వ శతకము) తా నుపనీతుడగునాటికే - అనగా, (ప్రాచీనకాలమున గర్భాష్టమవత్సరమున నుపనయనము విధిగా జేయుచుండుటచే నాత డేడేండ్లయీడున నున్నప్పుడే) బాల్యముననే తన జిహ్వాగ్రమున కవితాకన్య నాట్య మొనరించుచుండెడి దనియు, తరువాత దాను స్వాధ్యాయనిరతుడై వేదపఠన మొనరించుచుండ నీ వేదఘోషలో నా కవితాకామిని మంజీరనాద మంతగా బ్రస్ఫుటము కాదయ్యెననియు జెప్పుకొనియున్నాడు.

పాశ్చాత్యసంస్కృతిముగ్ధులై, ఇతఃపురాపఠిత ప్రాచ్యగ్రంథజాత్యంధుల కిది విడ్డూరముగా, నసత్యప్రలాపముగా గన్పట్టవచ్చును. కావున నొండు రెం డాంగ్లకవుల వృత్తాంతముల సూచించెద :

మొన్న మొన్న నస్తమించిన కవికోకిల సరోజినీదేవి యతిబాల్యమున ఇంగ్లాండులో విద్యాభ్యాస మొనరించుకాలముననే రెనిమిదివేల (౧౩౦౦) చరణములు గల యాంగ్లకావ్యమును రచించిన ట్లామెజీవితచరిత్రలో జిన్నతనమున చదివియున్నాను.

కేవలాంగ్లేయుడగు అలెగ్జాండర్ పోప్ (**Alexander Pope** : ౧౬౮౮-౧౭౪౪) అను కవి తొక్కుపలుకులు పలుకునప్పుడే ఛందోబద్ధముగా మాటలాడుచు పద్యములు వ్రాయుచుండెడివాడట. చదువుకొనుట మాని పద్దెములు వ్రాయుచున్నాడని తండ్రి యాతనిని కొట్టబోగా నీపసిబాలుడు ఛందోబద్ధముగా నిట్లు జనకుని వేడుకొనెనట:

***'Papa, Papa, beat me not.'***

తండ్రి నవ్వుకొని, 'వీనికి కవితోన్మాద మసాధ్యరోగముగా నున్నదనియు, వీ డిక పనికిరాడనియు విసుగుకొని యూరకుండెనట. తరువాత నీ బాలకవి ప్రఖ్యాతకవియై, పైని సూచించిన తన ప్రజ్ఞ నిట్లు చెప్పుకొనియున్నాడు :

*'As yet a child nor yet a foal to fame,*

*I lisped in numbers (verses), for the numbers came'*—

(అప్రయత్నముగా ఛందోబద్ధ రచన నానోటినుండి వెలువడుటచే, తొక్కుపల్కులు పలుకునప్పుడును నానోట పద్యములే వచ్చుచుండెడివి.)

3. అష్టావధానం అనంతాచార్యకవి :

ఈయనయు తిరువహీంద్రపురవాసియే. అష్టావధానమున, నాటకపఠనమున దిట్టయగు నీయన కవితామార్గమున క్లిష్టగ్రంథముల విరగొట్టుచు జేయు సమస్యాపూరణప్రావీణ్య మత్యద్భుతజనకముగ నుండెడిదట. పద్యములలో నాయాపద్యనామముల నర్థవంతముగ, చమత్కారముగ నిముడ్చుట శంకరభగవత్పాదుల రచనలయందును, జయదేవుని 'గీతగోవిందము'నందును, మఱికొన్ని కృతులయందును గన్పట్టుచున్నది. అనంతాచార్యకవి పద్యములలో రాగముల నామములను జమత్కారముగ నిముడ్చుచుండెడివాడు :

ఉదా — 'చికురాళీకుమరాళీ
వదనం తవ భాతి శంకరాభరణమ్.'

౪. శతావధాన - ఈచంబాడి శ్రీనివాసాచార్యకవి :

(క్రీ. ౧౮౪౮-౧౯౧౮)

ఈకవియు తిరువహీంద్రపుర (దక్షిణార్కాటు

జిల్లా) వాస్తవ్యుడే. కౌండిన్యగోత్రజుడు. తండ్రి వేదాంతాచార్యులు. శ్రీనివాసకవి చిరకాలము కుంభకోణమునందలి ప్రభుత్వకళాశాలయందు గీర్వాణపీఠాధిపతిగా నుండెడివాడు. శతావధానప్రజ్ఞానిధియు, సుదాత్తకవితానిర్మాణనిపుణుడుమాత్రమే కాక యీయన ప్రౌఢవైదుషీభూషితుడుగా గూడ విఖ్యాతి నందెను.

కాళిదాసమహాకవిగ్రంథములను బాగుగా జెప్పవలెనన్న నీయనయే చెప్పవలెనట. అందును శాకుంతల మీయనసొమ్మట.

ఈయనరచనలను నాలుగు కక్ష్యలుగా పేర్కొనదగును:

I వ్యాఖ్యానములు:—

౧. 'సహృదయ' (శాకుంతలవ్యాఖ్య)

౨. 'బాలప్రియ' (మృచ్ఛకటికావ్యాఖ్య)

౩. నాగానందవ్యాఖ్య.

II గద్యకృతులు:—

౪. శార్ఙ్గరోపాఖ్యానము.

౫. శ్రీకృష్ణలీలాయితము. ('సహృదయ'యను సంస్కృతమాసపత్త్రికలో గొంత ప్రకటితము)

III పద్యగేయాత్మకములు:—

౬. హంసవిలాసము—౬ సర్గముల మహాకావ్యము. రూపకాతిశయోక్తిప్రధానముగా కృష్ణమిశ్రుని 'ప్రబోధచంద్రోదయము'వలె నాధ్యాత్మికవిషయవిచారకము.

౭. అమృతమథనము: జయదేవుని 'గీతగోవిందము'వలె పద్యగేయాత్మకము. కవిగానకళానైపుణ్య మిట బాగుగా బ్రకటింపబడెను.

౮. అమృతమథనము: కావ్యము. (అసమగ్రము.)

IV రూపకములు:—

౯. ఉషాపరిణయము.

౧౦. శృంగారతరంగిణి (భాణము)

ఈ కవిశేఖరుని కవితామాధురి తెలియుటకై నాల్గు శ్లోకము లుల్లేఖింపబడును:

౧. స్రగ్ధర.

'సంమూర్ఛద్వేణునాదశ్రవణహృతిహృదాం
సంభ్రమాదాద్రుతానా
మాకృష్ట్యానేదుషీణాం ప్రజహరిణదృశాం
మణ్డలే సాక్షిభీతః,
ఏకైకస్యాః పురస్తా ద్యుగపదుభయత
శ్చాత్తమాయాశరీరః
శైలూషో గోపవేషః కలయతు కుశలం
రాసలీలాగురుర్నః.

౨. శా. శక్త్యా గమ్య మశక్యమార్గ మమలం
దీప్తార్థజాతోజ్జ్వలం
శ్లిష్టం శబ్దగుణాశ్రయా నవరసా
సారప్రసారాస్పదమ్,
కావ్యం యత్కవివేదసో బుధగురో
ర్వాగీశ్వరా దాగతం
తద్వ్యోమేవ న మీయతే, వితరతి
స్థానంచ వాచాం పునః.

౩. శా. స్రోతోభి స్తటినీవ యా నవనవైః
శబ్దార్థయోర్జగత్
నిష్పన్నై రసవేదిభి శ్చిరతరం
తృష్యద్భి రాపీయతే,
తీరక్షోభదశాం కవిమణే
ర్వ్యక్షోభయన్ భారతీం
తాస్తైరేవ కషోపలో గుణవతాం
వ్యాఖ్యాపరాధో మమ.

౪. మందా. సద్వ్యాఖ్యానం యదిహ విగుణం
నైష దోషో నవో మే,
శ్లాఘా నైషా యది గుణలవః
క్వాపి దృశ్యేత సద్భిః,
ఇత్థం ధీరస్యవసితి రహం
సాహసేఽస్మి ప్రవృత్తః,

కాలః క్రీడతి గచ్ఛ త్యాయు-
స్తదపి న ముంచ త్యాశావాయుః'

—(శాకుంతల వ్యాఖ్య)

## ౫. మ. మ. శంకరలాలమహేశ్వరశాస్త్రి:

(క్రీ. ౧౮౪౪-౧౯౧౬)

ఈయన పశ్చిమభారతవర్షమునందలి 'కథియవార్' మండలము (*Kathiawar*) లోని జాంనగర వాసి. 'ప్రశ్నోరనాగరబ్రాహ్మణ' వంశమునకు జెందిన వాఁడు. భారద్వాజగోత్రజుఁడు. తండ్రి మహేశ్వర పండితుఁడు. తల్లి మాంఘీబాయి (*Monghibai*). శంకర లాలపండితు డాశుకవితయందును, అవధానములయందును నిష్ణాతుఁడు. ౧౫ ఏండ్ల వయస్సుననే యీయన కవితారచనకు మొదలిడెను. కథియవార్ మండలము నందలి 'మోర్వీ' నగరమున నున్న 'రావ్‌జీరాజసంస్కృత కళాశాల' (*Rawajiraj Sanskrit College at Morvi*) కు ప్రధానాచార్యులు (*Principal*) గా నీయన ౨౧ వ యేటనే నియమింపబడి, యప్పటనే యనేకవత్సరములు విద్యాదాన మొనరించెను. ఈయన యాశుకవితాప్రావీణ్యమునకు మెచ్చి జాంనగరమహారాజీయనకు 'శీఘ్రకవి' యను బిరుదము నొసగెను.

ఈయనప్రౌఢప్రతిభాపాండిత్యములను గుర్తించి ౧౮౯౪ వ సంవత్సరమున ప్రభుత్వమువా రీయనను 'మహామహోపాధ్యాయ' బిరుదము నొసగి సత్కరించిరి. ౧౯౧౬ లోనే యీ విద్వత్కవిచంద్రుఁ డస్తమించెను. ఈయనస్మృతి చిహ్నముగ తచ్ఛిష్యులు, నభిమానులును 'శంకరాశ్రమ' మను నొక యాశ్రమమును స్థాపించి, యందు సన్న్యాసులచే నాధ్యాత్మికవిచారకములు, మతప్రబోధకములు నగు నుపన్యాసముల నిప్పించు చుందురు

ఈ కవిచూడామణి బహుగ్రంథనిర్మాత. తద్రచనములలో ప్రధానములు :

I. మహాకావ్యములు :—

౧. 'రావజీరాజకీర్తివిలాసము' - మోర్వీసంస్థానాధీశ్వరుల వంశానుచరిత్ర వర్ణనము.

౨. బాలచరితము.

II. లఘుకావ్యములు :—

౩. అరుంధతీవిజయము.

౪. కేశికృపా పేశలహరి.

౫. కైలాసయాత్ర.

౬. పాంచాలీచరితము.

౭. ప్రసన్నలోపాముద్ర.

౮. భాగవతీభాగ్యోదయము

౯. భ్రాంతిభ్రమభంజనము

౧౦. మేఘప్రార్థనము

III. రూపకములు :—

౧౧. కృష్ణచంద్రాభ్యుదయము

౧౨. గోపాలచింతామణి

౧౩. ధ్రువాభ్యుదయము

౧౪. పార్వతీపరిణయము

౧౫. భద్రాయుర్విజయము

౧౬. వామనవిజయము

౧౭. సావిత్రీచరితము.

IV. గద్యకథారచనములు :—

౧౮. అనసూయాభ్యుదయము

౧౯. చంద్రప్రభాచరిత్రము

౨౦. భగవతీభాగ్యోదయము

౨౧. మహేశప్రాణప్రియ.

ఇవికాక యీయన రచించిన స్తోత్రములు, ప్రశస్తులు ననేకములు కలవు.

---

# శేషం కృష్ణకవి

శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి

పూర్వకాలమున విద్వత్త్వకవిత్వముల వన్నె కెక్కిన యాంధ్రదేశీయపండితవంశములలో శేషంవారి వంశ మొకటి. వీరి యాద్య నివాసము తెలంగాణాలోగాని, రాయలసీమలోగాని యొక గ్రామము కావచ్చును. అది యిపుడు నిరూపింపరాదుగాని యీవంశములోని యొక కుటుంబము కాశీనగరమునకును, మఱియొకటి మహారాష్ట్రదేశమునకును, ఇంకొకటి దక్షిణదేశమునకును వలసవెళ్ళినట్లు కనబడుచున్నది. వారివారి రచనలే యిందుకు ప్రమాణము.

శేషం కమలాకరరత్నాకరపండితులు గీతగోవిందమునకును, శేషం గోవిందపండితుడు అమరుకశతకమునకును నిర్మించిన వ్యాఖ్య లున్నవి. గోవిందపండితుడు వినతానందవ్యాయోగము, గోపాలలీలార్ణవ భాణముకూడ నిర్మించియున్నాడు. శేషం రామచంద్రబుధుడు హర్షనైషధమునకు టీక రచియించెను. శేషంవేంకటపతి మధురానాయకుడైన విజయరంగచొక్కభూపాలుని యాస్థానకవియై తారాశశాంకవిజయ మను నాంధ్రప్రబంధమును నిర్మించెను. ఇట్లు దేశము నలుగడలనుండి సారస్వతసేవయొనరించిన యీ శేషమువంశములోని నరసింహకవి శా. ౧౭౫౦ ప్రాంతమందు కాశీపురమున కేగి యందు స్థిరపడెను.

ఆ కాలమందలి కాశీపండితులలో నరసింహకవి శబ్దశాస్త్రనిధి యని కీర్తిగన్నవాడు. భట్టోజీదీక్షితులు, నాగేశభట్టు మొదలగు మహావైయాకరణులు పాణినీయమున నతని మతము నెక్కువగా నాశ్రయించి రనుటయే యతని వైదుష్యమహత్త్వమునకు గొప్ప గుర్తు. శాస్త్రపారీణులయ్యు, కవితాధురీణులైన నాటి కొలది విద్వత్కవులలో నత డొకడు. తాండవపురరాజైన గోవిందచంద్రనృపతి యాదరమందిన యాకవీంద్రుడు పోషకునిపేర గోవిందార్ణవ మను ధర్మశాస్త్రగ్రంథము నిర్మించెను. ఆనాడు వారాణసిలో శబ్దశాస్త్రపాఠమునకు పరమగురువైన యతనికి చింతామణి, కృష్ణుడు నని యిద్దఱు కొడుకులు జన్మించిరి. చింతామణి మహావైయాకరణుడై, కవియునై రుక్మిణీపరిణయనాటకమును, రసమంజరీపరిమళ మను నాలంకారికకృతిని నిర్మించెను. ద్వితీయుడైన—

ఈకృష్ణకవి తండ్రివలె నన్నవలె శబ్దశాస్త్రప్రవీణుడై కవితాచతురుడై మురారివిజయము, ముక్తాచరితము, సత్యభామాపరిణయము, సత్యభామావిలాసము, ఉషాపరిణయము, క్రియాగోపనరామాయణము, పారిజాతహరణము, కంసవధ అను కావ్యములు రచియించెను. వీనిలో కడపటి రెండు నిపుడు ముద్రితములైనవి. కంసవధ యేడంకముల నాటకము. ఇది, అక్బరుపాదుషామంత్రియైన

రాజాతోడరమల్లుని కుమారుడగు గోవర్ధనధారి యనబడిన గిరిధారి నృపతి ప్రోత్సాహమున రచియింపబడినదని ప్రస్తావనయే యిట్లు చెప్పుచున్నది:

"తస్యాస్తి టండనకులామలమండనస్య
శ్రీతోడరక్షితిపతేస్తనయో నయజ్ఞః,
నానాకలాకులగృహం సువిదగ్ధగోష్ఠీ
మేకోఽధితిష్ఠతి గురుర్గిరిధారినామా"

దీనినిబట్టి యితడు శా. ౧౫౧౦ ప్రాంతమం దీకృతి నిర్మించె ననవచ్చును. ఈక్రింది సూత్రధారోక్తిని బట్టి యితని చతుర్దశవిద్యావివేకము గోచరించుచున్నది.

"చతుర్దశసు విద్యాసు పరికర్మితచేతసః
కవిరేతి కియన్నామ తస్యాశ్చర్యం విపశ్చితః?"

శబ్దశాస్త్రకోవిదత్వము కవులకు భూషణము. అది లేని కవిత బాల్లియున్న లతాంగివలె రసికులను రంజింపజేయజాల దన్న యితని మాట యిది:—

"రసాలంకారసారాపి వాణీ వ్యాకరణోజ్ఝితా,
శ్విత్రోపహతగాత్రీవ నరంజయతి సజ్జనాన్"

ఈకవి తన తండ్రివల్ల కృతినందిన టాండవపుర (కాశీసమీపమున) రాజాతమ్మడైన నరోత్తమనృపతి కంకితముగా పారిజాతాపహరణచంపువు రచియించెను. ఆంధ్రుడైన యీ విద్వత్కవి సుప్రసిద్ధుడైన జగన్నాథపండితరాయలకంటె పెద్దవాడు, ఢిల్లీ నగరమున వీరిరువురు పరస్పరము చూచుకొన్నవారు ననుట కవకాశము కలదు.

ఈ కృష్ణకవికి వీరేశ్వరుడు, నారాయణుడు నను నిరువురు పుత్రులు కలరు. వీరిలో పెద్దవాడు పండితరాయల గురువులలో నొకడు. ఆ వీరేశ్వరుడు వేజేమో యని కొందఱు సంశయింతురేమో కాని, ఆకాలమున కాశీనగరమునందు శబ్దశాస్త్రప్రసిద్ధుడైన వీరేశ్వరు డీ కృష్ణకవిపుత్రుడే కాక మఱియొకడు కానరాడు. ఈ వీరేశ్వరునొద్దనే భట్టోజీదీక్షితులును, అన్నంభట్టును శబ్దతర్కశాస్త్రము లభ్యసించిరని పండితలోకప్రతీతి కలదు. దీనినంతనుబట్టి తెలుగుదేశములోని యొక విద్వద్వంశము దేశాంతరములందు విద్యావంశములు నెలకొల్పినదని విదితమగును. అట్టి శేషంవంశములోని యీ కృష్ణకవి కృతులను సంపాదించి ప్రకటించుట యాంధ్రుల కర్తవ్యము.

---

# పిచ్చిగాయకుడు

[శ్రవ్యనాటిక]

●

శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

మొదటిరంగము

[హుమయూన్ చక్రవర్తి గుజరాతునంతా జయించి ఆప్రాంత మేలే బహదూర్‌ను బంధించి రక్తవర్ణవస్త్రాలతో సింహాసన మధిష్ఠించేడు. రక్తవర్ణం జనసంహారసూచకం. మొగలు సైనికులు చెలరేగి బహదూరు ప్రజలను రాజద్రోహు లనే నెపంతో చీల్చి చెండాడుతున్నారు.

బేజూబారా ఒక జానపదగాయకుడు. అతని పాటకు ప్రకృతి పులకిస్తుంది. తన దేశప్రజల హింసలు చూడలేక బేజూ ఉన్మత్తుడై గ్రామాలవెంట భయభ్రాంతుడై తిరుగుతూ ఒకనాటిఉదయం ఇట్లా పాడుతూ ఒకవీథివెంట తిరుగుతున్నాడు]

బేజూ

(గీతం)

లేవాలేవా లేనేలేవా దేవా
త్రోవలేని పెనుచీకటిలో నీ
తోడు వెదకు దీనుల కిప్పుడు ॥లేవా॥

అనదజనుల కుత్తుక నెత్తురు
లాని పూని చెలరేగు కత్తులకు ॥లేవా॥

చెదరిబెదరి ఏమైతివో ఈ జన
పదముల మృత్యువిహారము జూడక ॥లేవా॥

(వెనుకనుంచి కోలాహలం)

౧ గొంతు:—తల్వార్, తల్వార్!

౨ గొంతు:—మార్ డాలో.

3 గొంతు:—ఖూన్ - ఖూన్.

౧ గొంతు:—పకడో - ఉస్కో - పకడో.

కొన్ని గొంతుకలు:—అయ్యో - అయ్యో - బాధ - దాహం - దాహం. (మూలుగులు)

౧ సైనికుడు:—పట్టుకో - ఆ దివానాని పట్టుకో.

౨ సైనికుడు:—ఆగు, దివానాభయ్యా, ఆగు.

బేజూ:—(పెద్ద నిట్టూర్పు విడిచి) వచ్చారా, సరిగ్గా నే ననుకున్నట్లు వచ్చారా? రండిరండి. (వెర్రిగా నవ్వి) నేనే వద్దామనుకుంటున్నాను మీకోసం... వెతుక్కుంటూ.

౧ సైనికుడు:—రాదలచిన వాడవు భయపడి పరుగెత్తుతున్నా వెందుకు?

బేజూ:—త్వరగా మీదగ్గరకు చేరుకు నేటందుకు.

౨సై:—(తోడి సైనికునితో, నవ్వుతూ) అచ్ఛా దివానాదోస్త్!

౧ సైని:—వణకుతున్నావు, భయంగా ఉందా?

బేజా:—చలిగా ఉంది. మీవంటి స్నేహితుల్ని చూడగానే భయం పోయింది.

౨ సైని:—ఎండలో ఉన్నా చలిగా ఉందా దివానాభయ్యా!

బేజా:—సూర్యుడికికూడా చలిగా ఉంది. చూడండి ఎట్లా ఒణుకుతున్నాడో మీముందు. యిదివరకు పగలు సూర్యుడుదయించేవాడు కాని యిప్పుడు చంద్రుడుదయిస్తున్నాడు. చూడండి ఎంత చల్లగా ఉన్నాడో.

(ఇద్దరుసైనికులు సూర్యుని చూస్తుండగా బేజా పారిపోతాడు)

౧ సైని:—(చూచి) అరే దేఖో, దివానా దౌడ్తాహై...బద్మాష్ !

౨ సైని:—(పరుగెత్తి బేజూను పట్టుకువచ్చి) మోసగించి ఎంతదూరం పరిగెత్తగలవు? ఇక నీపని...ఫైసలా. చూచేవా దీన్ని? వందలకొద్ది కాఫిర్లతలలు సఫాచేసిన కత్తి యిది. ఖబడ్దార్.

౧ సైని:—భాయీ, తొందరపడకు. ఇలా కొందరు పిచ్చిగా నటించి ఎంతో బంగారం, డబ్బు దాస్తారు. పూరా కనుక్కొని అప్పుడే చంపుదాము.

౨ సైని:—అచ్ఛా, దివానాభాయీ! నీదగ్గర ఏమున్నా యిచ్చివెయ్యి. ఎందుకు చచ్చిపోతావు?

౧ సైని:—ప్రాణా లుంటే మళ్ళీ సంపాదించుకుంటావు. ఆలోచించుకో.

బేజా:—(నిర్లక్ష్యంగా)నావంటి బికారి దగ్గర మూటలుంటాయా? నేను దివానాను కాను. మీరు. పాటలున్నాయి, వింటారా?

౨సైని:—బడా బద్మాష్. సోనానహీ-గానా కహ్‌తాహై-మారో!

౧ సైని:—అరే దివానా! లాభంలేదు. నీ తల ఎగిరిపోతుంది. కాసుకో.

బేజా:—(వెర్రిగా నవ్వి) పిచ్చి భాయీలూ! వినండి. తెగిపోయినా నా తల తెగపాడుతుంది. నా బ్రతుకంతా పాటే. ఈ గుజరాతుకొండలు, నదులు, పొలాలు, గాలి-అన్నీ నాపాటలతో నిండిపోయాయి. మీ కుటిల దృష్టులతో, క్రూరఖడ్గాలతో నన్ను చంపగలరుకాని నాపాటల్ని చంపలేరు. ఆలుబిడ్డల్ని పోగొట్టుకొని పాటలతో బతికే ఈ బికారితో మీకేంపని? విడవండి నన్ను.

౨ సైని:—విడవడానికి రాలేదు. పొడిచి మరీ పోతాము.

౧ సైని:—అరేభాయీ. వీణ్ణి చేతులు విరిచి ఆ చెట్టుకు కట్టు ముందు.

౨ సైని:—(బేజూను చెట్టుకు కట్టి వేస్తాడు)

బేజా:—(కట్లలో ఉండి) భాయిలో! నాకంఠం స్వాధీనంలో ఉండగా ఒక పాట వినండి.

(గీతం)

వేడికన్నీటితో విలపించు భూమీ!
పాడి చెడి దైవమే పయనించెనమ్మా!
నానేల నేమూల గానకళ వినిన
నను జూడ తలలెత్తు జనులార రారా! ॥వే॥
ఎన్నాళ్ళు నాజగతి కీ చేదుబ్రతుకు?
మన్నన్ని నాళ్ళు ఆమని రానెరాదా? ॥వే॥

(హఠాత్తుగ సరంబీమీద మొగలు సైన్యాధిపతి చంద్రసింగు ప్రవేశం)

౧ సైని :— (అలజడిగ) భాయీ, భాయీ! సర్దార్ చంద్రసింగ్!

ఇద్దరు:—(కంగారుగా) సలామ్‌సలామ్ సర్దార్ జీ.

(చంద్రసింగు ప్రవేశించి)

చంద్ర:—ఎవ రిక్కడ? ఏమి చేస్తు న్నారు? ఇత డెవరు?

౧ సైని : — లేదండి. ఏమీలేదు. పాదుషావారిశత్రువులుఎవరైనా గ్రామాలలో దాగి ఉన్నా రేమో అని చూస్తున్నాము.

చంద్ర:—(నవ్వి) పాదుషావారి శత్రు వుగా ఈ బికారి దొరికేడా?

౨ సైని:—ఒక యింటిలోనుంచి యిత డేదో ఎత్తుకొని పరారి అవుతుంటే పట్టు కొన్నాము సర్దార్ జీ.

చంద్ర:—దొంగసొత్తు దొరికిందా?

౧ సైని:— లేదు హుజూర్.

చంద్ర:—చెట్టుకు విరిచికట్టడ మెం దుకు? చెట్టులో దాచాడా?

౨ సైని:— దొంగిలించా డని మా అనుమానం.

చంద్ర:—అనుమానానికి కారణం?

౧ సైని:—కుచ్ నహీ...

౨ సైని:—(మెల్లగా) చుప్ రహో— సర్దార్ జీ! ఇట్లాంటి దొంగల్ని చాలామందిని పట్టుకున్నాము.

చంద్ర:—ఇక చాలించండి. ముం దితని కట్లు విప్పండి. కత్తికైనా దయ ఉంటుందికాని మీకు లేదు. పరమమూర్ఖులు. శత్రువుల పేరు చెప్పి గ్రామాలు దోచుకుంటున్నారు. జాగ్రత్త. ఇత డీదేశాని కంతటికీ పేరుపడ్డ గాయకుడు. ఇతని పాట విని పరవశంకాని గుజరాత్ జీవి ఉండడు. పాదుషావారు చూసి సంతోషిస్తారు. నాతో వస్తాడు. మీరు నడవండి...(బేజూతో) బేజూ! ఖేదపడకు. ప్రభువుపేరిట నీచులు చేసే అత్యాచారా లివి. నీ గానవాహిని దూరానికి నాచెవి సోకి నన్ను రప్పించింది. జాతులకు, ద్వేషాలకు అతీతమైంది నీ గానం. నీ అమూల్యసంగీ తంతో నీదేశానికి ఎంతైనా సాధించగలవు. పాదుషాకు హృదయం లేకపోలేదు. రా, నాతో. గుర్ర మెక్కు!

బేజూ:—ప్రభూ, ఈ బికారికి చక్ర వర్తిదర్శన మెందుకు? నా శోకగీతాలలో నన్ను కరిగిపోనివ్వండి. మాయేలిక బహా దూర్ రక్షించలేని దేశాన్ని ఈ దీనుడు కాపాడగలడా? నన్ను మన్నించండి.

చంద్ర:—ఓయి పిచ్చివాడా! మాటాడ కుండా నాతో రా. నీశక్తి నాకు తెలుసు.

బేజూ:—ప్రాణదాతను తిరస్కరించ లేను. పదండి.

## రెండవ రంగము

[హుమయూన్ చక్రవర్తి దర్బారు. సభ్యులతో రాజకీయాలు చర్చిస్తూఉంటాడు. మొగలుసైనికు లిద్దరు ఆందోళనగా పరుగెత్తుకొనివచ్చి—]

౧ సైని:—ఖుదావంద్...ఈ హిందూ సర్దారులతో వేగలేకుండా ఉన్నాము.

౨ సైని:—మేము పట్టుకున్న కాఫిర్లను విడిపించి వారిమెదుట మమ్మల్ని హరాం చేస్తున్నారు.

హుమ:—ఏమిసంగతి?

౧ సైని:— పాదుషావారి హుకుం ప్రకారము పల్లెపల్లెలా దాగిఉన్న దుశ్మన్‌లను పట్టి బందీచేస్తూఉంటే సర్దార్ చంద్రసింగ్‌జీ మమ్మల్ని తిట్టి వారిని విడిపిస్తున్నారు.

౨ సైని:—ఔను సర్కార్...

హుమ:—(ఆశ్చర్యంగా) ఏమి! చంద్రసింగు ద్రోహుల్ని విడిపిస్తున్నాడా? చాలా వింతగా ఉంది. ఇంతవరకు చంద్రసింగ్ మా హుకుం శిరసావహించి పనిచేస్తున్నాడు. ఇప్పుడు మారి స్వజాతిఅభిమానం చూపుతున్నాడా? సరే! మీరు వెళ్లండి. కఠినంగా విచారిస్తాను.

(సైనికులు వెళ్లారు)

౧ సభ్యుడు:— హుజూర్! చంద్రసింగ్‌జీ రాజభక్తి శంకించరానిది. వీరి ప్రవర్తనలో ఏదో అక్రమం ఉండిఉంటుంది.

౨ సభ్యుడు:—ఏమిమాట! హిందువును కోసినా అభిమానం పోదు. సర్దారును కఠినంగా విచారించాలి పాదుషావారు.

(ప్రవేశం: చంద్రసింగ్ - వెనక పిచ్చివేషంతో బేజూబావా)

చంద్ర:—(సైనికమర్యాదతో నమస్కరించి) ఖుదావంద్! మన సైనికులు...

హుమ:— (గంభీరంగా) అంతా విన్నాము. మీరు చెప్పవలసింది చెప్పండి.

చంద్ర:—(తెల్లబోయి సర్దుకొని) విన్నవిస్తున్నాను. విచక్షణ లేకుండా సాధువులను బాధిస్తున్నారు.

హుమ:—(కఠినంగా) హిందువులందరూ సాధువులే. మీరు విడిపించండి.

చంద్ర:— (నిశ్చయంగా) ఏజాతీ పూర్తిగ సాధువులతో కాని, అసాధువులతో గాని నిండిఉండ దని పాదుషావారికి తెలియనిది గాదు. ఏమతమూ సాధుహింసను ప్రోత్సహించదుగదా సర్కార్...ఇతడు సాధువు.

హుమ:—చూడగానే మీకు తెలిసిందా?

చంద్ర:—కాదు ప్రభూ...వినగానే—

హుమ:—ఇతని కీర్తి అంత ముందుగా మీచెవి కెక్కినదా?

చంద్ర:—ముందు చెవికెక్కినది కీర్తి గాదు, ఇతని రాళ్ళుకరిగించే గానం. ఇతని పేరు తెలిసినతరువాత ఇతని కీర్తి. సర్కార్! విచక్షణలేకుండా విన్నమాట నమ్మేటంత అమాయకుడు కాడని నమ్మండి మీసర్దార్.

హుమ:—(గంభీరంగా నవ్వి)అచ్చా... మీ కింత కళాభిమానమని ముందు మాకు తెలియదు. ఇత డెవ్వరు?

చంద్ర:—చిత్తము. ఇతని పేరు వినని గుజరాత్ ప్రజ లేదు. పేరు బేజూబావా. గొప్ప జానపదగాయకుడు. సితార్ అందుకొని గొంతు కదిపితే చాలు, ప్రకృతి పరవశమై వెంటపాడుతుంది. ఏలినవారి దర్బారుకు అమూల్యమణిగా ఉండగలడని నిశ్చయించి సైనికుల చేతులనుండి విడిపించాను. కళను గౌరవించని ప్రభుత్వానికి ప్రతిష్ఠ లేదు. ఇతని అమృతకంఠంనుంచి ప్రభువువారి విజయగీతాలు ప్రపంచమంతా వినాలని నా కోరిక.

హుమ:—బహుత్ అచ్ఛా... ఇతని చేత పాడించి మీమాట రుజువుచెయ్యండి.

చంద్ర: — జీ...సర్కార్...బేజూ! చక్రవర్తి వినగోరడం నీఅదృష్టం. నీ కల కంఠం కదిపి ఒక్క గీతం ఆలపించు.

(బేజూ ముందుకు వచ్చి పాదుషాకు నమస్కరించి కూర్చుని మెల్లగ గొంతు సవరించి పాడతాడు)

(గీతం)

రాగమెరుగని వీణ—రక్తినెరుగని గాణ
ఎడద కీలలు రగులగా—రారాజ!
ఏగీతములు పలుకునో. ॥రా॥

పాషాణహృదయాలు—పాలించు లోకాన
ద్వేషమే పంటగాదా—ఓ రాజ!
ప్రేమ కరవై సురుగదా! ॥రా॥

కొసరి నీయశములో—విసము కలిపిన చేయి
దెసలెల్ల నెత్తుపూసె—రారాజ!
కసిరేచి కత్తిదూసె. ॥రా॥

తెగిన కంఠముతోడ—తేటి పాడిన పాట
సొగయునా నీమెడంద—ఓ రాజ!
పొగులదా కన్నీటితో? ॥రా॥

(బేజూ గద్గదకంఠంతో తుదిచరణం తిరిగి పాడుతూఉండగా చక్రవర్తి దిగ్గన లేచి అంతఃపురానికి వెళ్ళిపోతాడు. సభ్యుల్లో కలవరం)

౧ సభ్యు:—కొంప మునిగిపోయింది. పాదుషావారికి ఆగ్రహం వచ్చివుంటుంది. పిచ్చివాడి తల ఎగిరిపోతుంది పాపం!

౨ సభ్యు:—కాదు - ప్రభువు ఎంత గాంభీర్యం వహించినా సూర్యకిరణం సోకిన హిమఫలకంవలె ఇతని గీతంతో మనస్సు ద్రవించి ఆ విశాలనేత్రాలలో తడిజాడలు కనిపించాయి.

౧ సభ్యు:—హుష్...మాటలాడకండి ప్రభువు తిరిగివస్తున్నారు. ఓహో! ఏమిది... చక్రవర్తి రక్తవస్త్రాలు విడిచి పసుపువస్త్రాలు ధరించారు.

౨ సభ్యు:— పాదుషావారి ముఖం ఇప్పు డెంత శాంతసుందరంగా ఉంది!

(ప్రవేశం: హుమయూన్ చక్రవర్తి)

హుమ:—(సింహాసన మధిష్ఠించి) ఎవ డురా అక్కడ?

భటుడు:—జీ...హుజూర్...

హుమ:—ఒక తెల్లని పారశీకగుర్రం, బంగారుకత్తి, రవసెల్లాబట్టలు తక్షణం తీసుకురా.

భటు:— జీ సర్కార్...

(భటుడు చక్రవర్తి కోరినవి తెచ్చి ఎదుట ఉంచుతాడు.)

హుమ:—గానకళానిధీ ... బేజూ. నీ గానామృతం హింసాకళంకితమైన నా హృదయాన్ని కడిగి పవిత్రంచేసింది. ఒక దుఃస్వప్నం నుంచి ఇప్పుడు మేలుకున్నాను. నీ నిరుపమానగాంధర్వవిద్యకు భారత చక్రవర్తి బహుమానం యిది—స్వీకరించు.

బేజూ:—(కృతజ్ఞతతో వణకిపోతూ) ప్రభూ! ఈబికారి ఈ మహాసన్మానానికి అర్హుడు కాడు. మన్నించండి. తమ అనుగ్రహం చాలు.

హుమ:—నీవు నేటినుండి మొగలు పాదుషాదర్బారు గాయకుడవు. ఇవి ఆస్థాన గాయక లాంఛనాలు.

బేజూ:—(మౌనం)

హుమ:—సందేహించకు. ఈ గుర్ర మెక్కి కోరిన నీ ఆప్తులను చూచిరావచ్చు. ఈకత్తితో నీ విరోధులను నరికివెయ్యి. ఇది నీకు నా వరం.

బేజూ:—ఖుదావంద్! కళాజీవికి శత్రువులు లేరు. ద్వేషం మరిగేహృదయంలో కళ నిలువజాలదు ప్రభూ—ఒక్క నా కోరిక చెల్లించండి. అన్నింటికంటె అది నాకు పరమప్రియమైనది.

హుమ:—(సంతోషంగా) వెంటనే చెప్పు.

బేజూ:—మాయేలిక బహదూర్‌ను బందీనుంచి విముక్తుణ్ణి చేసి నా మాతృభూమిలో జరిగే కరాళహింసను మాన్పించండి. అదే నాకు మహాప్రసాదం.

హుమ:—అవశ్యం. నీకోరికను సంతోషంతో నెరవేరుస్తాము. చంద్రసింగ్! వెంటనే బహదూర్‌ను సకుటుంబంగా విడిచి మనకు సామంతరాజుగా ఉండే ఏర్పాటు చెయ్యండి. నేటినుంచి ఈ గుజరాతులో ఎట్టిహింస జరిగినా సహించమని హుకుం జారీచేయించండి. (బేజూతో) ఏమి...గాయకమణీ... తృప్తి కలిగిందా?

బేజూ:—(పరవశంగా) జయహో... హుమయూన్ చక్రవర్తికీ.

['రంగవల్లిక'నుంచి]



# 'నిషాదం'

[కథానిక]

శ్రీ కందుకూరి లింగరాజు

"ఈ మొఖంతోటి నన్ను చూడ్డానికి వచ్చేవా? ఇన్నాళ్లూ లేని తీరుబడి ఇప్పుడు దొరికింది కామూ?" అని, అంతవరకూ అంతూ పొంతూ లేని దుఃఖంతో అవ్యక్తమైన పార్వతమ్మ అనడం సీతారామయ్యకు గుండెల్లో గునపం గ్రుచ్చినట్టే అయి, మాటల్లేకనే గోడకు జేరబడిపోయేడు. తను ఏ లోకంలో వున్నాడో కూడా అర్థం కాలేదు. కళ్లు మాత్రం ఒప్పగించేడు.

"మాట్లాడ్డానికేముంది? బ్రతికినన్నాళ్లూ రాలేనివాడివి ఇప్పుడైనా వచ్చేవుకదా" అని కన్నీళ్లు తుడుచుకుంటూనే పార్వతమ్మ ఏడ్పు మొదలెట్టింది.

దారిపొడుగునా చెట్టంత దుఃఖంతో కళ్లు ఎర్ర బారినై. తన అక్కగారికి అవయస్సులో తీరని కష్టం వచ్చిందని ఏడ్చేడు. ఇప్పుడు తను ఏడ్వాలో ఏం చెయ్యాలో కూడా తెలియలేదు. స్వభావంగా బావగారియెడ వున్న గౌరవ, ప్రేమ, వాత్సల్యాలు కూడా ఈవిరుద్ధపరిస్థితిలో తనకు ఏమీ సహకరించలేకపోయేయి. తన అక్కగారికి అంతకష్టం కల్గించే పని తను ఏంచేశాడో కూడా తెలియలేదు. ఆయన జీవించి వున్నన్నాళ్లూ తను అడుగు లకు మడుగులు ఒత్తినా, ఇప్పుడు, ఈక్షణంలో అక్కగారు ఇల్లా అనడానికి తగినకారణం కనుపించలేదు.

తలతెగిన మేకలాగే, తల ఒంచుకుని బావురు మన్నాడు. కన్నీళ్లు కొంత శాంతాన్ని ఇచ్చినా, బయటకు అడుగులు వేసేటప్పుడుమాత్రం గుండెలు గుబగుబలాడేయి. తన ఆత్మే ఎందుకో భయపడింది. ఏదో ఉప్పెన వస్తుందన్నట్టే.

ఆరోజు భోజనాలు చేస్తున్నపుడే వేలు పుడిస్తే నాల్గోసారో, ఐదోసారో మేనమామ "సీతాయ్! మరి పార్వతిని తీసుకువెళ్లవా?" అని అడిగేడు. మాటల్లోనే అన్నాడు 'అల్లాగే' అని. అంతకంటే ఎక్కువ మాటలు రాలేకపోయేయి. మేనమామ అననయ అభినయాల్తోనే చచ్చిపోయిన బావగుణగణాలను పొగిడేడు. మానవలోకంలోని సంప్రదాయం అదేకాబోలు ననుకున్నాడు. బావగారు బ్రతికున్నకాలంలో ఈయన ఒక్కసారైనా వచ్చినట్టు జ్ఞాపకం లేదు. ఈనాడు ఎక్కడలేని ఆపేక్షా ఒలికిపోయినట్లే కబుర్లు చెప్పుతున్నాడు.

జీవితాలు ఎంతలో విచ్ఛిన్నమైపోతాయో బోధపడినా, భావిలో అక్కగారిని ఏవిధంగా అనునయించేసి, ఆవిడకి శాంతి కల్పించగలనా అన్న అస్థైర్యం వచ్చింది. కాని కల్పించగలనన్న ధీమా వుంది. తన భార్య తనమాటలకు జవదాటదన్న నమ్మకం వుంది. అయినా ఈనాడు అక్క అన్న వాక్యాలుమాత్రం జీవితాన్ని భయపెడుతున్నై. శాంతం వుండదంటున్నై.

లోపలిగదుల్లో ఒక్కసారి గొల్లుమన్నట్టయితే ఉలిక్కిపడ్డాడు. అడుగులు బరువుగా వేసుకుంటూ వెళ్లేడు. ఇప్పుడు ఆఅక్కగారి గదిలోకి వెళ్లాలంటేనే భయం పట్టుకుంది. గుమ్మంవరకూ వెళ్లేసరికే "బావా!

ఈనాడు ఇల్లా అవుతానని అనుకునివుండవు కాదుకదూ ? వ్రాత ఇల్లా వుండాల్సివుంటే..."ఇక ఎక్కిళ్లల్లో వినిపించలేదు. వేసే అడుగు వెనక్కి ఆగినట్టే అయింది. కొద్దిఘంటల్లోనే ఆ స్వరభేదం ఒకేవాతావరణంలో వున్నా, పార్వతమ్మలో కనపడడం ఆశ్చర్యం కలిగించింది. ఏదో కుతూహలం మొలకెత్తింది.

"పారూ !"

"బావా..."

సీతారామయ్యకు ఆ పిలుపులో ఏవో గూఢార్థాలు వ్రాసినట్టనిపించింది. ఇదివరకు తన తల్లీ తండ్రీ వున్నపుడు పార్వతిని ఉమాపతికి ఇద్దామని అనుకోవడం, కట్నాలగొడవల్లో వెనకసిపోవడం గుర్తువుంది. వాళ్లిద్దరూ చిన్నప్పుడు దంపతులక్రింద బొమ్మలాటలు ఆడుకోవడం తెలుసు. అది సఫలీకృతమవుతుందని అనుకున్నారని ఇప్పుడు తెలియడంతో దుఃఖం పట్టపగ్గాలు లేకుండానే ఉబికింది.

తన జీవితంలో తనూ ప్రేమించేను అనుకున్నాడు. దానిలో వుండే హృదయపుఆరాటం రుచి చూసేడు. కాని అది గతించిన సంవత్సరాల్లో సంసారంలో పడి ఉందో లేదో అనిపించింది. ఇప్పుడు పార్వతీ, అటు ఉమాపతీకూడా ఇటువంటి అగ్నిని మూటకట్టుకుని బాధపడుతున్నారని అనుకోవడంలో, తను మరిచిపోయిన దినాలు జ్ఞాపకం వచ్చేయి.

ఆ సఫలీకరణానికి తన పేరు, ప్రతిష్ఠలు త్యాగం చేద్దామనుకున్నా, సంఘం, మళ్లీమళ్లీ పార్వతి వయసన్నా ఒప్పుకోదు. తను ఒప్పలేడు. ఉబికిన దుఃఖం మ్రింగుకుంటూనే కళ్లు తుడుచుకున్నాడు.

తలుపుబందుల సందుల్లోంచి, కళలేని ముత్తయిదువతనం వచ్చినందుకు దిగాలుపడడం కనపడింది. ఉమాపతిఖండువాఅంచులు ఊగుతున్నాయి. దొంగతనం చేస్తున్నట్టుగానే సీతారామయ్యహృదయం బాధలో తప్తమైన, ఉమాపతిని చూడాలన్న నియమం ఆపింది.

"ఆశలు ఎప్పుడూ ఒకలుకోలేం. వాట్లతో జీవించడం మానవులకు ఉగ్గుపాలతో పోసేరు...పారూ! వెళ్లి వస్తా" ఉమాపతి గుమ్మం దాటుతూనే సీతారామయ్యను చూసేసరికి, ఆగని ఆవేదనతోనే "బావా !" అని సీతారామయ్యను కౌగిలించుకున్నాడు.

ఉమాపతి హృదయంలో తను ఓ శాంతి పొందగలనన్న ధైర్యంతోనే, చంటిపిల్లవాడిక్రిందే వెక్కివెక్కి ఏడ్చేడు. అనునయంగానే "ఊరుకో బావా! మంచివాళ్లకే ఎప్పుడూ భగవంతుడు కష్టాలు ఎక్కువగా పెడతాడు. పారూ ఏపాపం చేసిందని ? ఆ మెను నవ్వు-బాధ మరిచిపోయేట్టు చెయ్యాలి. అంతకంటే ఏం చెప్పలేను." ఉమాపతిమాటల్లో ప్రేమమూర్తీభవించినట్టే తట్టింది. ఓటినంగా తను నిర్ణయం చెయ్యలేని కర్తవ్యం ఇప్పుడు రూపంపొందింది. అయినా తన్ను చూడగానే పారూ అన్న ఎత్తిపొడుపు మాటలకు, ఇప్పుడు ఏర్పడుతున్న రూపానికి సమన్వయం అవుతాయా అన్నదే సమస్యక్రింద వుంది.

భుజం పట్టుకునే పీఠిలోకి వచ్చేరు. ఉమాపతిని చూస్తుంటే ఏకో లేని ధైర్యం, గౌరవంకూడా సీతారామయ్య పొందినట్టే వుంది. ఇంకేమైనా చెపుతాడేమో అన్న ఆశ కలిగినా, తను ఏంఅనాలో, ఏం అడగాలోకూడా తెలియలేదు.

"ఒకానొక కాలంలో పారూ నాకు చుక్కాని అవుతుందని అనుకున్నా. ఇద్దరం చేదోడువాదోడుగా ఉంటామని ఆశించేను. కాని విభిన్న పరిస్థితుల్లో ఇద్దరం పడిపోయేం. ఈనాడు పారూను చూస్తుంటే గుండె తరుక్కుపోతోంది. సీతాయ్య! నాకోసంఅయినా పారూకు కష్టం, దుఃఖం అన్నది లేకుండా చెయ్యి. అదే నిన్ను కోరుతున్నా" అని ఉమాపతి చేతులు పట్టుకున్నాడు.

సీతారామయ్యగుండె చెరువై పోయింది. అమితదుఃఖంలోనే, ఉమాపతిచేతుల్లో వాలిపోయే "అల్లాగే బావా" అనిమాత్రం అనగల్గేడు. అందులో ఓ శాంతి పొందినట్టుమాత్రం ధైర్యం వుమిలింది.

అమర్నాడు రైలు ఎక్కించేటప్పుడు ఉమాపతి దగ్గరనే ఉన్నాడు. ఉమాపతిహృదయంలో చూస్తూ, అతని మాటలు వింటూ, అతనికోసం అన్నదాంట్లోనే

సీతారామయ్యకు ఉత్సాహం కలిగింది. దానికి కారణం ఏమిటో అంటే తను చెప్పలేడు. పారూ కూడా చెప్పలేదేమో!

రైలు కిటికీలోంచే "పారూ! దుఃఖం అన్న దాన్ని మింగడం అలవాటు చేసుకో. దాన్నే మననం చేసుకుని, నిర్జీవత పొందడం, నిరాశతో విస్వసం కూడా మానవలక్షణం కాదు. కాలం అనేది నీకు ఆ ధైర్యాన్ని ఇస్తుందన్న ధైర్యం వుంది. పారూ, జీవితాన్ని మనం ఏపరిస్థితుల్లో వున్నా, జయించి ఆనందమయం చేసుకోవాలి" అన్నాడు.

వినిపించీవినిపించనట్టు అని సీతాయికి వినిపించేయి. ఉమాపతిది కవిహృదయం. లోపల్లోపలే బడబాగ్నులతో దహించుకుంటూ, పైకి నివురుకప్పిన నిప్పు అని తెలుసు. అతని కథల్లో తను ఎన్నోసార్లు చూసేడు. జీవితానికి దుఃఖమే పరమావధి. ఎక్కువ దుఃఖంలో ఎప్పుడూ ఆనందం వుందన్న వేదాంతం తరచితరచి చెప్పేవాడు. ఈనాడు అదే అతని నోటమ్మట వచ్చింది.

బండి కదిలింది. నూర్నపరిణామంలో నున్న పారూ, కళ్లార్పకుండానే, చేతులు జోడించింది. ఉమాపతి దుఃఖంతోనే, వెనక్కి తిరిగి గబగబా అడుగులు వేసేడు. దూరమైపోతున్న రైలులోనుంచి ఉమాపతి కళ్లు తుడుచుకున్నట్టు కనపడ్డంతో, సీతారామయ్యకు, తను ఈ విచిత్రఘట్టంలో ఏ కొసని ఉన్నాడో తెలియలేదు.

దిగవారుగానే, తనచోటులో కూర్చుని ఆలోచించడం ప్రారంభించేడు. ఏవోఏవో వచ్చేయి. అవి విచిత్రంగా వున్నా, వ్యక్తావ్యక్తంలోనే కలలు, అలలలాగే తట్టేయి.

* * *

వీధిగుమ్మంలో బండి దిగి లోపలికి వెళ్లేటప్పటికి వెంకటలక్ష్మి ఎదురుగా వచ్చింది. బావురుమంటూనే రెక్క పట్టుకుని లోపలికి తీసుకువెళ్దామని చెయ్యి చాచేసరికి "ఆరోజుల్లో చూడ్డానికి తీరుబడి లేనిదానవు, ఈరోజుల్లో ఆపేక్ష ఒలకరించనక్కర లేదు" అని విసురుగానే లోపలికి వెళ్లింది పార్వతి. వెంకటలక్ష్మి, ఇటునూటు కేసులో పలపెడుతున్న సీతారామయ్యా కొయ్యఅయ్యేరు. అడుగులోనే హంసపాదుతో ప్రారంభమైన దీనికి ఎటూ పాలుపోలేదు. "నిన్న కాక మొన్న నే పథ్యం పుచ్చుకుంది. అంచేత నేనే తీసుకురాలేదు." అని అందామనుకున్నా, సీతాయికి ధైర్యం చాలలేదు. దైన్యంగా, బాధతో వెంకటలక్ష్మిచూపులు తన బాధ్యతను గుర్తుకుతెప్పిస్తే "లేదక్కా! దానికి పదిరోజులనుండి జ్వరం, రెండు రోజులే అయింది మెతుకు కొరికి" అని అన్నాడు.

మడమమీదనే గిర్రున తిరుగుతూ పార్వతి "ఈ మొఖాన్ని ఎప్పుడు చూస్తే ఏముందిరా" అని లోపలికి వెళ్లింది.

వెంకటలక్ష్మి వెనకాలే వెళుతూ "అల్లా అంటారేం ఒదినా! పుట్టెడంత దుఃఖంలో రాలేక పోయేనని ఎంత ఏడుస్తున్నాను. మాయదారిజ్వరం పిక్కతినకుండా వుంటే......" అంతవరకూనే విన్నాడు సీతాయి. తర్వాత ఏం జరిగిందో తనకు వినిపించలేదు. ఏదో భోజనాలకు వెళ్లేవరకూ, తుమార్పణగా, వెంకటలక్ష్మి అంటూనే ఏదోఏదో వెనక వెనక తిరుగుతూ ఉండడంమాత్రం చూసేడు.

అంతవరకూ ఆ పదిహేనురూపాయల చిన్న ఇంటికి వెంకటలక్ష్మి, తనూతప్ప ఇంకెవ్వరూ లేనే లేరు. రెండువత్సరాలక్రితం బావమరిదికొడుకు ఓసంవత్సరం ఉండి చదువుకొని వెళ్లిపోయేడు. ఇన్ని రోజులూ వెంకటలక్ష్మిని తను అర్థంచేసుకోవడంలోనూ, తన్ను వెంకటలక్ష్మి పరీక్షించడంలోనూ, సరిపోయింది. సీతాయి అనేకవిధాలుగా వెంకటలక్ష్మిని తరచిచూసేడు. మొట్టమొదట్లో స్కూల్ ఫైనల్ వరకు చదివి, ఒక్కగా నొక్కత్తె కూతురైన పిల్ల, కష్టాల్లో సుఖాల్లో అదుకోగలదా అని అనుమానపడ్డాడు. అయినా రోజులు జరగడంతో, తన వూహలు పటాపంచలవడంతో సిగ్గుపడ్డాడు.

ఇప్పుడు నిజంగా పార్వతి రావడం ఓపరీక్ష లాంటిదే. అందులోనూ, ఒక్క వెంకటలక్ష్మికేకాక

తనకుకూడా గడ్డుసమస్యలాంటిది. ఏక్షణంలో ఆ కరకుముక్కలు పారగా అందో, అప్పటినుండీ తనమీద నిష్కారణంగానే పగపట్టినదని గ్రహించేడు. తల్లినీ, తండ్రినీ గోల్పోయినతర్వాత అంతవరకూ తను అక్కకుగాని, బావకుగాని ఏవిధమైన లోపం లేకుండానే జరిపేడు. ప్రతిపండగకూ పిల్చేడు. బట్టలు పెట్టేడు. తన చర్యల్ని సింహావలోకనం చేసుకుంటే, ఏవిధమైన కష్టం కలిగి పని చెయ్యలేదని అంతస్సు చెపుతోంది. తను భావిలో ఎప్పుడూ వారుకు కష్టం కలగకుండానే త్యాగం చెయ్యాలని నిశ్చయించుకున్నాడు. ఈలోపంలో, పగలో పార్వతి తన్నా, వెంకటలక్ష్మినా ఆహుతిచేసుకునే దన్నదే సందేహంగా వుంది.

రోజులు గడుస్తున్నాయి. మిగిలిపోయిన అక్కడక్కడి చుట్టాలు పరామర్శకు వచ్చేరు. వీళ్లు రావడం అన్నది ఏ సంఘపు పెద్దమనుష్యులు నిర్ణయించికోకాని మానవహృదయాల్ని వ్రక్కలుచేస్తోంది. ఆ ఆతీతానికి ఆదుకోలేకనే రెండుమూడుసార్లు తిట్టుకున్నాడు.

"సీతాయ్! మీబావది బోలెడంత ఆస్తి. దానిని బ్రతికున్నంతకాలమూ గడించి వదిలిపోయేడు. వెర్రిపిల్ల లక్ష్మికి దక్కనియ్యకుండా, వాళ్లవాళ్లు కాజేయకుండా చూడేం" అని ఆయన సలహా ఇచ్చేడు పరామర్శకు వచ్చి. వయస్సులో, ఒకఅనుభవంలో ఆయన పెద్దవాడు. ఇంతవరకూ దీని ఆలోచన సీతాయికి తోచలేదు. ప్రక్కగదిలోవున్న పారూకూడా ఇది వినే వుంటుందన్న నిరుకు వుంది. ఈవిషయాన్ని ఆమె ఆలోచించిందో లేదో తెలియనేలేదు. ఇప్పుడు తను చెప్పడం సమంజసంగా వుంటుందో లేదో అని అడకత్తెరలో పడ్డాడు.

లా ప్రకారం భర్తపాలు ఆమెకు సంక్రమించవలసిందే. తను దానికి ముందర కాలుదింపి లేనేకాని రాదు అనీ తెలుసు. కాని అక్కగారి భావాలు ఎల్లా వున్నాయో తెలియటం లేదు.

ఆరోజు యాదాలాపంగానే దీని విషయం ఎత్తేడు. తోకత్రొక్కిన పాములాగే "ఆయన ఎంత మంచివాలో నీకు తెలియదూ? కోర్టుముఖం పట్టి, ఆస్తికోసమని ఎల్లా నన్ను తిరగమంటావు! బ్రతికివున్నప్పుడు లేకపోయినా చచ్చినతర్వాత మమకారం ఎక్కువౌతుందా? ఆయనకు అక్కర్లేనిది ఇప్పుడు నాకెందుకు కావాలా? నీకంత ఆపేక్ష ఎందుకూ?" కసిరి వట్టే అంది.

తెల్లబోయేడు సీతాయి. సర్వసాధారణంగా స్త్రీలోకానికి డబ్బన్నా, ఆస్తన్నా మమకారం ఉండకపోదని తన లోకానుభవం చెపుతోంది. ఇప్పుడు పార్వతి దుఃఖంలో వుండి అల్లా అని వుంటుందని ఊహించుకున్నాడు. కాలంగడిస్తే యథాప్రకారంగా తనంతట తానే ఆసంగతి ఎత్తి, ఏదో చెయ్యమంటుందన్న ధైర్యం వుంది. ఇప్పుడు ఈసమయంలో ఎందుకు ఆప్రసక్తి ఎత్తేనా అని కుల్లిపోయేడు.

కాని లోపల్లోపల ఇల్లు చక్కబెట్టుకో సేసరికి ఊరు మాటుమణగదుకదా అన్న దుడుకు లేకపోలేదు. ఈలోపునే మరదులు అంతా ఏకమై ఏం సృష్టిస్తారో అన్న అనుమానం కలిగింది. ఇప్పుడు తను ఏమీ చెయ్యలేదు. ఉమాపతికి ఈవిషయంలో ఉత్తరం వ్రాద్దామన్న మార్గం ఒక్కటే తట్టింది. ఆరాత్రి కూర్చుని ఉమాపతికి పెద్ద ఉత్తరం వ్రాసి నిద్రపోయేడు.

ఈ అంశం గడిచిన నాల్గురోజులవరకూ పిల్లిమీదా ఎలకమీదా పెట్టి డబ్బు, ఆస్తివిషయం ఎత్తిపోడవడం సీతాయికి కొరివితో తలగోక్కున్నట్టే అయింది. ఓరోజు రాత్రి వెంకటలక్ష్మి వచ్చి 'ఎందుకు ఆప్రసక్తి ఎత్తేరని' చాలా చెప్పింది. దీంతో మరీ దిగజారిపోయేడు.

* * *

రోజూ పదిగంటలకు ఆఫీసుకు వెళ్లడం సీతాయికి అలవాటు. ఇదివరకు వెంకటలక్ష్మి ఉడుకూ మడుకూ పప్పూఅన్నం పెట్టి పంపేది. కాని పార్వతి వచ్చినతర్వాత ఆ ఖంగారుభోజనంలో మార్పు జరగవలసివచ్చింది. మొదటిరోజుల్లో ఎల్లా వున్నా

నెల తిరక్కముందే "ఇంట్లో బోడివాన్ని ఉన్నానుకో. ఇంక నా బ్రతుకేముంది ఒంటింట్లో కాక?" అని అంటూనే ప్రభుత్వం పుచ్చుకుంది. పదిగంటలకు అన్నం ఉడకడమే బ్రహ్మాండమైపోయి, రోజూ ఆఫీసులో లేటుపడడం, సంజాయిషీ ఇచ్చుకోవడంతోనే సరిపోతోంది. చాటుగా ఓరాత్రి వెంకటలక్ష్మితో చెప్పేడు. "నేనేం చెయ్యనండీ? పూజలూ, పునస్కారాలూ మొదలుపెట్టేను. మాట్లాడితే నేనే కయ్యిమని 'పునిస్త్రీగా ఉంటే నన్నెవ్వరైనా అనేవారా? వెధవముండను అయ్యేనుకనుక ఈ ప్రారబ్ధం' అంటారు" అని చెప్పింది. ఇదివరకల్లా ఆఫీసరుగారి దృష్టిలో మంచిగా వున్నవాడు దిగజారుఅవడం కష్టంగా కన్పించింది. తనకు ఇంట్లో స్థలం లేనట్టే ఆఫీసులో తిట్లూ తప్పవన్నట్టు తయారైంది.

పార్వతికి ఆరోజుల్లో కాస్త పడిశం పడితే "అక్కాయి, రోజా స్నానాలు ఎందుకు? వెంకటలక్ష్మి చేస్తుంది వంట" అని అన్నాడు.

"అక్కగారిమీద ఆపేక్ష ఒలికిపోతోంది! ఆనాడు ఆయనకు చేసిపెట్టకపోయినా ఈనాడు నాకు తప్పదు. ఈమాత్రం చేసిపెట్టకపోతే నా తిండీబట్టా నీకు దండగ అవదా!" అంది.

"అదేం మాట? నీకు కావలసినంత ఆస్తి వుంది, మహారాజులా జరుగుతుంది. ఎందుకక్కా అల్లా అంటావ్? నేనేం తప్పు మాట అన్నానా? ఒంట్లో ఆరోగ్యం సరిగాలేదని అంటున్నాను. అంతే" అన్నాడు ధైర్యం తెచ్చుకుని.

"నామీదా, నారోగంమీదా కాదన్నమాట నీ ఆపేక్ష. నాకున్న ఆస్తిమీద. ఇల్లా తగలేస్తే దబ్బున చస్తాగా, అప్పుడు నీకే వస్తుందిలే" అంది.

తింటున్న ముద్ద నోట్లోకి వెళ్ళలేదు. నిలువునా నిప్పులమీద కాల్చినట్టయింది. తన హృదయం ఎంత సాక్షిగా ఉంచుదామన్నా, అది వక్రమార్గులకు వక్రంగానే కన్పించి తనమీదే తిరుగుతోంది. తను అల్లా వుండడంకూడా తప్పేనా? తన అక్కే తన్నే ఇంత క్రూరంగా అంటోంది. గుడ్లమ్మట నీళ్లు తిరిగేయి.

మనసారా ఈకారం తగ్గించుకుందుకైనా ఏడ్వాలి అనిపించింది. కాని వయస్సు ఒప్పుకోదు. తలుపు చాటున ఉన్న లక్ష్మి దిగాలుపడిపోయి, కళ్ళు తుడుచుకుంది. అది చూచే, తిన్నట్టు నటించి, చేయి కడుక్కుని వచ్చేడు.

గదిలోకి వచ్చిన లక్ష్మికళ్ళల్లోకి బాధగా చూసి, ఆఫీసుకు వెళ్లేడు. ఆరాత్రి లక్ష్మి "నా తమ్ముడు నాకు పెడితేనే డబ్బు ఖర్చు అవుతోందని బెంగపెట్టుకుని అన్నం కూడా తినకుండా వెళ్లేడు. నా ఆస్తికోసం తమ్ముడు నాకు ఆదరం ఇచ్చేడుకాని, మరో అందుకా......" అ కేవరసలో సణిగిందని చెప్పింది.

ఏంచెయ్యాలో తెలియటం లేదు పార్వతిని. తన కున్న జ్ఞాపకంలో, వెనుకటి సంగతులు మననంచేసుకుంటే చిన్నప్పుడు చేసిన మంకుతనం, అల్లరి, పెంకి గడుసుతనం జ్ఞాపకంవున్నాయి. పెద్దయినతర్వాత కూడా, భర్తని చేతుల్లో పెట్టుకొని మగవాలిగా చేసుకుందని విన్నాడు. ఆ అధికారం భరించలేకనే ఆయన చచ్చేడేమో అనికూడా అనుకోవడం విన్నాడు. ఆ జీవనాలు ఎల్లా వున్నా ఇప్పటి స్థితిలో పార్వతిలో ఎల్లా మార్పు తెస్తుందా అన్నదే సమస్య అయింది. ఇది తప్పు, ఇది ఒప్పు అనికూడా చెప్పలేనంత అధైర్యం, భయంతో పడ్డాడు.

ఏరోజు ఇంట్లో కాలు పెట్టిందో ఆరోజునుండి లోపల సమస్య పెరుగుతూనే వుంది. అది రోజురోజుకూ ఎక్కువయ్యే సన్నివేశాలు వస్తున్నాయి. వచ్చిన మొదటిరోజునే, ఎంత చెప్పకూడదనుకున్నా, "లక్ష్మి! నాకోసం కొన్నాళ్ళు నువ్వు బాధపడాలి" అని చెప్పి, లక్ష్మిని పార్వతికి దాసిగానే చేసేడు. ఆ అదను చూచుకుని పార్వతి చేసే హయాములు తనకే కాలుమంటలు పెట్టినట్టయ్యేయి.

ఆ సెలవులకు సీతాయిబావమరిది - స్కూల్ ఫైనల్ చదువుకుంటున్న రామం వచ్చేడు. రాకరాక వచ్చేడని వెంకటలక్ష్మి మొదటి రెండురోజుల్లోనూ ఏవేవో కబుర్లు చెప్పుకోవడం, ఉదయం సాయంత్రం కాస్త ఫలహారాల్లోనూ సరిపుచ్చుకుంది. ఆరెండు

రోజుల్లోనూ లక్ష్మికి సగం బలం వచ్చినట్టే అయింది. దీనికి సీతాయి సంబరపడ్డాడు. ఆరోజు భోజనాలదగ్గర కూర్చున్నప్పుడే "బావా! ఈమె ఎవరు?" అని అడిగేడు.

ఉలిక్కిపడ్డాడు సీతాయి. ఇంతవరకూ అతను తనింటికి ఎప్పుడూ రాలేదు. పెళ్లిలో ఎప్పుడో చూసేడు అంతే... "ఆవిడ మా అ..." అన బోయాడో లేదో, నేయి వడ్డిస్తున్న పార్వతి అందుకున్నట్లుగానే "నేనా అమ్మా! మీల్లింట్లో వంటలక్కని" అంది.

పేగులు తోడేసిన ట్టయింది. సీతాయి కుమిలింపులో అక్కగారి మొఖం చూసేడు. ఆవిడకళ్ళు విజయసూచకంగానే కనపడ్డాయి. ఎందులో విజయమో అర్థంకాలేదు. ఎందుకు తనమీదా, లక్ష్మిమీదా కక్ష! తను ఏంచేసేడు? పూర్వజన్మంలోని పాపఫలమా? మాట్లాడలేకనే తల వంచుకున్నాడు.

"ఏం నాయనా! చేసినవన్నీ సరిగా వున్నాయా? నీ కేది ఇష్టమో అది చెప్పు. చేసి పెడతా!" అడగకుండానే కూర వేసి పార్వతి అంది.

రామం పూర్ణంగా సిగ్గుపడిపోయేడు. సీతాయికీ, లక్ష్మికీ గొంతుకలో వెలక్కాయ పడినట్లయింది. పార్వతిమనస్సు ఏమైనా చెడిందా అనిపించింది సీతాయికి. ఆ భోజనందగ్గర రామాన్ని సిగ్గుతో తలవంచుకునేట్లు చేసింది పార్వతి. ఇంత ఆదరం వున్న మనిషిలో ఈ వెలుగునీడలు ఏమిటో అర్థంకాలేదు.

రామం వున్న రోజులన్నిటిలోనూ అతని సపర్యలన్నీ పార్వతే చేసింది. చిన్నవాళ్లకు తీపి అంటే ఇష్టమని మైసూరుపాక్, జిలేబీ, గులాబ్ జామ్‌లు చేసింది. కాఫీ వడపోస్తే బాగోదని ఫిల్టరులో వేయించింది. ఆ శనివారంనాడు మంచిదని తలంటి నీళ్ళు పోయించింది. ఆరోజే సీతాయి ఆఫీసుకు వెళ్లుతుంటే "రాకరాక ఆ అబ్బాయి వచ్చేడు. క్రొత్త చొక్కా, లాగూ కుట్టించరా" అని చెప్పింది. ఈసలహా వింటున్నప్పుడు సీతాయి ఉల్టాసీదా అయ్యేడు. పార్వతికి మర్యాదలన్నీ తెలుసుండే ఇల్లా ఒక్కొక్కప్పుడు ఎందుకు ప్రవర్తిస్తుందని! ఆ రెండుమూడు రోజుల్లోనూ నాల్గయిదుసార్లు కుట్టువాడు బట్టలు ఇచ్చేడా అని తెచ్చేవరకూ నిలవనిచ్చింది కాదు.

ఆరోజు బట్టలు తొడిగించి, "ఏం నాయనా! నీపెళ్ళికి నన్ను పిలుస్తావా?", అని పరిహాసంకూడా ఆడింది. వెంకటలక్ష్మి ఇది వర్షానికిముందర ఈదురుగాలేమో అనుకుంది. ఓపెక్క సంతోషం, రెండవవైపు భయంతోనే మెసిలింది.

ఆ ఆదివారంనాడు రామం పెట్టె బేడా సర్దుకుని, బండి ఎక్కినప్పుడు, పార్వతి గోడకు జార్లపడి గుడ్లమ్మట నీళ్ళు కక్కుకుంది. అందులో ఆవయస్సుకు సంతతే కల్గివుంటే, రామంఅంత చెయ్యికందిన కొడుకు వుండేవాడుగదా అన్న బాధ ద్యోతకమయింది. పార్వతి కళ్ళు ఒత్తుకుని లోపలికి వెళ్లడం చూచిన దంపతులిరువురికి అచేతనంగానే అనునయం, జాలీ కలిగించి, నిజంగా పార్వతిజీవనం కిరాతనీయమే అయింది. అంతవరకూ పిల్లలు కలగనేలేదు. ఇప్పుడు ఈస్థితిలో, పిల్లలు వుంటే అన్న మమకారం పోగొట్టుకోలేదు. అది విజృంభిస్తూనే వుంటుంది.

ముప్పైఅయిదువత్సరాల్లో వున్న పార్వతి అటు దాంపత్యసుఖం, సంతతిక్షేమా లేకుండానే విధి క్రూరంగా విధించేడు. పైగా ఆ దాంపత్యంకూడా ఎసుడుదిరుదుగానే గడిచింది. అందులో సుఖం పడకుండానే, తను లోపల్లోపల ఆరాధించుకున్న ఉమాపతితోబాటు భర్తకూడా దూరమైపోయేడు.

ఇప్పుడింకో ఏకాకి. పరువుప్రతిష్ఠా భంగంచేసుకో లేక, తమ్ముని ఒడిలో తలదాచుకుంది. ఇన్ని దుఃఖాల ఫలితమే ఆ అకాలవిజృంభణలు అని సీతాయికీ, లక్ష్మికీకూడా తట్టింది. చెమ్మగిల్లిన కళ్ళతోనే ఇరువురూ లోపలికి వెళ్ళేరు. వంటింట్లోంచి వెక్కి వెక్కి ఏడ్వడం, దుఃఖం మూర్తీభవించి, పిథికి ఎదురుతిరిగిన ఆనాథగొంతు ఆవేదనా విన్పించింది. లక్ష్మిని దగ్గరపా అనునయంచేస్తూనే, ఉబుకుతున్న కన్నీళ్ళు పమిటలో ఇంకించేడు సీతాయి.

* * *

ఆ డిశెంబర్లో పార్వతిపూరినుంచి రైతులు వచ్చేరు. వాళ్ళందరిదగ్గరా పార్వతి ఇదివరలో శిస్తులు పుచ్చుకుంది. కాని ఈనాడు వాళ్ళు శిస్తులు పట్టుకు రాలేదు. చాడీలు చెప్పటకే వచ్చేరు. ఈ ఏడు చేనిమీద పంట కొయ్యనియ్యలేదట. "మాది అవిభక్త కుటుంబం. మొత్తంఅంతా మామకుని, అందులో మాఅన్నయ్యపాలుకు ఏమి వస్తుందో అది మేమే పంపిస్తాం" అని అటకాయించేరని చెప్పేరు.

తలుపుచాటునుండి పార్వతి అంతా విన్నది. సీతాయి ఈసంగతి ఎప్పుడో అప్పుడు జరుగుతుందని ఆశించేడు. తన ఆఫీసుకు అవూరి నుండీ వచ్చే పెద్ద మనుష్యులు చాటుగామాటుగా ఇంకా ఎన్నో చెప్పేరు. కాని పరిస్థితి తనకు స్వతంత్రం ఇవ్వలేనందునే మాట్లాడక ఊరుకోవలసివచ్చింది. తన బావగారి ఇత్తడి సామాను, ఆ మండువాలోగిలిలో వున్న వాటాలో యావత్తూకూడా, ఎవరికి దొరికినది వారు స్వాధీనం చేసుకొన్నారనికూడా విన్నాడు. పార్వతికి ఇప్పుడు తెలిసింది. ఆచెప్పడంలో రైతులు అన్నీకూడా చెప్పేరు.

పార్వతి ఇప్పటికైనా అసలువిషయం అవగాహనచేసుకొని సక్రమంగా ప్రవర్తిస్తుందని ఆశించేడు. ఏం చెపుతుందో అన్న ఆలోచనా కలిగింది.

"వెళ్ళండి వెంకన్నా. ఆ కరణంబావగారు ఎల్లా చేయిస్తే అల్లాగే చెయ్యండి" అంది శాంతంగా. రైతులూ, సీతాయీకూడా తెల్లబోయేరు, పార్వతమ్మ ఇల్లా అన్నందుకు.

"ఏమండీ అమ్మగారూ, నిక్షేపంలాంటి ఆస్తి. ఇల్లా ఈ వక్కలపాలు చెయ్యమన్నారా ! వారు ఒక్క సెంటు భూమికూడా దక్కకుండా చేస్తారు. అల్లా అంటే ఎల్లాగండీ !"

"వెంకన్నా, నేను మాఅత్తవారింటికి వచ్చినప్పుడు ఆస్తికోసం రాలేదు. నాఆస్తి అన్నది నాకేముంది? ఆయనే లేనప్పుడు, ఇంకా ఆ ఆస్తులూ భూమ్యా నాకెందుకూ?"

వెంకన్నకు సమాధానం తోచలేదు. సీతాయికి ఈ వేదాంతం అర్థం కాలేదు. ఏ కారణాలచేత, కనీసం తన పోషణకైనా చూచుకోకుండా, ఇల్లా జోరు గాలిలో దీపం పెట్టి, దేవుడా నీమహాత్యం అంటోందో తెలియటం లేదు. భర్త చనిపోయేటప్పుడు ఏమైనా వీలునామా వ్రాసేడా అంటే దాన్నిగురించి తను వినలేదు. ఆస్తికొరకు తగవు లేమీ పెట్టుకోను అని ఆయన పార్వతిచేత వాగ్దానం ఏమైనా చేయించుకొన్నాడేమో పరమాత్మునికే తెలియాలి అనుకుని ఊరుకున్నాడు.

మెట్లు దిగుతూనే "సీతారామయ్యగారూ! అమ్మగారికి మీరేనా చెప్పండి ! అంత వెర్రిబాగులుగా వూరుకుంటే ఎల్లాగండీ" అంటూనే వెంకన్న అడుగులు వేసేడు. ఈ ఆఖరువాక్యాలు పార్వతి వింది.

"నాకు ఒకళ్లు చెప్పనక్కర్లేదు. అంత అవసరం వస్తే నేనే చూచుకుంటాను." అంటూనే వంటింట్లోకి వెళ్లింది.

భర్తఆత్మశాంతికోసం, ఆయన గౌరవంకొరకు నీచడబ్బుకోసం కోర్టులు ఎక్కడం ఎందుకు అన్న భావనలో పార్వతి వెర్రిగా ఉండిపోయిందేమో అనిపించింది సీతాయికి.

ఆరాత్రి కూర్చుని ఉమాపతికి పెద్ద ఉత్తరం వ్రాసేడు. "పార్వతి మారింది. అందులో నన్ను ద్వేషించడంతోనే సరిపుచ్చుకుంటోంది. ఆమెభావి కోసం అయినా ఆస్తివిషయం ఆలోచించటం లేదు. కనీసం నువ్వైనా ఓసారి వచ్చి చెప్పితే వింటుందన్న ధైర్యం వుంది. బావా! తప్పకుండా రా! నీమాట జవదాటదు. కనీసం నాకోసం రాకపోయినా, పార్వతికోసం అయినా రా" అని అంతం చేసేడు.

పోస్టులో వేసినప్పుడు "ఒస్తే బావుండును. దేవా ! కనికరించు" అని మనస్సులో ప్రార్థించి మరీ వేసేడు.

* * *

అనుకోకుండానే ఆ మూడోరోజున ఉమాపతి వద్దనుండి ఉత్తరం వచ్చింది. ఎక్కువగా ఏవిషయం

వ్రాయకుండానే ఊళ్ళమ్మట తిరుగుతున్నాను. నువ్వు చెప్పినవిషయంలో ఇప్పుడు ఏమీ వ్రాయలేను. కొద్ది రోజుల్లో వస్తాను అనిమాత్రమే వ్రాసేడు. సీతాయికి ఆవుత్తరం కొంత అనునయం ఇచ్చినా, ఎప్పుడు వస్తాడో అన్న ఆత్రుత ఎక్కువైంది.

ఆరోజు కొంత శాంతితోనే ఇంటికి వచ్చేడు. రోజూ గుమ్మంమెట్లు ఎక్కేటప్పటికి ఏం విపరీతపు మాటలు వినవల్సివస్తుందో అనే ఏక్కేవాడు. ఈనోజూ ఆ బెదురుతోనే అడుగులు వేసేడు. ఎదురుగా పార్వతి వస్తూనే "ఒరే! సీతాయ్. ఇంకా నీకు తెలియదురా? లక్ష్మికి ఐదవమాసం. నాకు ఇంతవరకూ తెలియనే లేదు. రేపు వాళ్లమ్మకు ఉత్తరం వ్రాయి" అని సంబరపడి చెప్పేసింది.

అంత సంతోషంతో ఇంతవరకూ ఎప్పుడూ పార్వతినోటంబడి మాట వినివుండలేదు. లక్ష్మి ఇది వరకూ రహస్యంగా సిగ్గుపడుతూ, నుసుస్తూనే చెప్పింది. కాని దాన్ని ఇరువురిమధ్యనే దాచుకున్నారు. అదే ఓవేళ బయటపెట్టివుంటే పార్వతి అస్తమానం ఏదో మాట అంటుందేమో అని భయపడ్డాడు.

పార్వతే ఆవిషయం ఈవిధంగా తీసుకుంటుం దని ఎప్పుడూ అనుకోలేదు. హృదయం ఓసారి ఎగిరి పడింది. "అల్లాగా అక్కయ్యా! రేపు వ్రాస్తాలే... కాని..." వసిరేకు తనే తన అత్తగారికి ఈవిషయం ఎల్లా వ్రాయడం అన్న భావంతో. నవ్వింది పార్వతి, గ్రహించినట్టే. "నేను వ్రాసినట్టు వ్రాయరా" అని లోపలికి అడుగు మళ్ళిస్తూనే "పాపం, వెర్రిపిల్ల! ఇవ్వా ళంతా ఆ వాల్గుకుంచాల కంచులు విసిరింది. అలసి పోయింది. చెప్పితే చెయ్యనిస్తానురా? నీకు ఫ్లాస్కులో కాఫీ పోసివుంచేను" అని అంటూ వెళ్ళింది.

అందులోని మార్దవానికి సీతాయి హృదయానికి జోలపాట పాడినట్టే అయింది. ఆనందంగానే అడు గులువేసేడు. ఇన్నాళ్లూ మానసికంగా అనుభవించిన ఆవేదన ఒకుఎత్తు; ఇప్పుడు ఈ క్షణంనుండి మారిన మాతనజీవనం మరో ఎత్తు అనకొంటూనే కోటు విప్పి కాఫీ త్రాగేడు.

తనూ, లక్ష్మి కాపురానికి వచ్చిన రెండో వత్స రంనుంచీ సంతతికోరకు ఆశించేరు. ఆరు వత్సరాల వరకూ దేవుడు దయతలచనేలేదు. తన హృదయంలో కోర్కె జీవం పోస్తోందన్న వార్త తెలిసినప్పటినుంచీ తనకు అదృష్టపురోజులు తిరిగేయనుకుని సంబరపడ్డాడు. ఈరోజు దాన్నిలోపల్లోపలే దాచుకోనక్కరలేకుండా పాలు పంచుకోడానికి పార్వతికూడా చేరింది అనే సరికి తేలికపడింది.

ఆ మర్నాడు, ఉదయమే కాఫీ తెస్తూనే, "ఏరా ఉత్తరం వ్రాసేవా?" అని పార్వతి అడిగింది. అనగడమే కాదు. దగ్గర కూర్చుని, వ్రాయించి, కవర్లోపెట్టి, పోస్టుచేసేవరకూ కూడా వదిలిపెట్టలేదు. ఎప్పుడూ అంతవరకూ లేనిది, సీతాయినీ లక్ష్మినీ, ఒకే పంక్తిని కూర్చోపెట్టి ఒడ్డించింది. లక్ష్మి ఎంగిలికంచాలు తియ్యబోతూంటే "ఒద్దు, నేను తీస్తా, నువ్వు వాడిని ఆఫీసుకు పంపిద్దూ" అని వారించింది పార్వతి.

గదిలోకి సిగ్గుపడుతూవచ్చిన లక్ష్మిని దగ్గరగా తీసుకుంటూనే "లక్ష్మీ, పార్వతి మారింది. ఇదంతా నీవల్లే కాదూ" అన్నాడు. నునిసింది లక్ష్మి. సిగ్గుపడి పోయింది. బుగ్గలమీద చిటికవేసి కోటు తొడు క్కొని మెట్లు దిగేడు.

ఆరోజు మొదలుకొని దంపతులిరువురి దినచర్య ల్లోనూ మార్పు వచ్చింది. అసలు లక్ష్మిని ఒక్కపని చెయ్యనివ్వటం లేదు. ఇన్నాళ్లూ పార్వతి ఏదో ఒకటి అనకుండా చేయనిపని ఈ రోజుల్లో తనంతటతానే పూనుకొని చేస్తోంది. లక్ష్మిని భోజనం, కాఫీ సమ యానికి తీసుకోవడం తప్ప మరోపని చెయ్యనిచ్చేది కాదు. చేస్తే అలసిపోతుందన్న మాటే పట్టుకుని పార్వతి అస్తమానం చెప్పడం, తనే చెయ్యడంతోటే సరిపోయింది. చేస్తే అలసిపోతుంది, కూర్చుంటే అలసి పోతుంది అన్న భావనతోనే, పార్వతి లక్ష్మిని చూడ్డంతో తీరుబడే లేకపోయింది.

సీతాయిలోకూడా మార్పువచ్చింది. ఇదివరలో ఆఫీసుకు ఆలస్యంగా హాజరుమార్కు వెయ్యడంతప్పింది. ఆరోజుల్లో రోజూ బజారునుండి ఏదో తెమ్మని చెప్పే పురమాయింపులు పార్వతివల్లఎక్కువయ్యాయి. బలానికి

మందు ఇప్పించాలని డాక్టరువద్దకు ఓసారో రెండు దఫాలో తీసుకువెళ్ళింది.

పార్వతిలో ఈ మార్పుకు సీతాయికి ఒక్కటే కారణం కనిపించింది. అందులో ఆనాడు రాము వచ్చివెళ్ళడం, పార్వతి పడ్డ ఆవేదన - వీటి ఫలితమే ఈనాడు రూపొందిన మార్పుకు కారణం అనుకున్నాడు. తనజీవితంలో తనకు పిల్లలు ఎల్లాగా దైవం వ్రాసిపెట్టలేదు. ఏకోదరుడయిన తమ్మునికేనా సంతతి కల్గుతోంది. వాళ్ళ ఆటపాటల్లో కాలం గడుపుకో వచ్చు అన్న అనునయంతోనే, వెంకటలక్ష్మికి ఇంతగా మాతృస్థానం వహించిందని సంబరపడ్డాడు.

ఈగడుస్తున్న రోజులలో పార్వతిమీద భక్తి గౌరవాలు ఏర్పడ్డాయి అటు లక్ష్మికీ, ఇటు సీతాయికీ కూడా. అక్కడ చెంబుతీసి ఇక్కడ పెట్టనివ్వక పోవడం, తనకి ప్రతీక్షణంలోనూ ఏమఁగడలా చూడ్డం, అన్ని సపర్యలూ చేయడంతో పార్వతి అంటే, తన లేని అత్తగారిస్థలంలో అవతరించి, అన్నపూర్ణహస్తం చూపించుటకే వచ్చిందనుకొని, జరిగిన గడ్డుదినాలన్నీ తన ఎల్లాంటి మనిషో పరీక్షించుటకే అనుకుంది.

రోజూ భర్తకి చెప్పేది-ఇవ్వాళ ఇల్లా జరిగింది, అల్లా జరిగిందని. సీతాయి అనునయంగానే ఆనంద పడేవాడు త్వరలో పితృస్థానం వహించబోతున్నందుకు. వంశం నిలబెట్టుటకు సంతతి ఉదయిస్తోంది; గృహలక్ష్మి అనే ఆరాధనలోనే లక్ష్మిని పువ్వుల్లో పెట్టేవాడు. తమ్ముడు రోజూ ఏదో చాటుగా తెచ్చి, లక్ష్మికి పెట్టుతూవుండడం, వాళ్లు చిలకాగోరింకల్లా వుండడంతో పార్వతికి ఏదో నూతనజన్మ ఎత్తినట్టే వుండేది.

తన జీవితంలో కొన్నాళ్ళు భర్తతో సంతృప్తిగానే కాలం గడిపింది. అవన్నీ ఇప్పుడు స్మరణకు మాత్రమే. అవి జరిగిపోయేయి. వానిని పూర్ణవయస్సులో పూర్తిగా ఆరాధన చెయ్యడానికి దేవుడు ఆజ్ఞ ఇవ్వలేదు. కాని ఈనాడు తన జవసత్త్వాలు ఆనందం ఏకరక్తంలోంచి వచ్చిన దానికి ధారపోయడం కంటె,వాళ్లు ఆనందం గా, తనయెడ గౌరవంగా,భక్తితో,

భయంతో ఉండడంకంటె ఇంకేమీ లేదన్న భావన లోనే మెసలడం మొదలెట్టింది పార్వతి.

అప్పుడప్పుడు తన జీవితంలో తన్ను 'అమ్మా' అని నోరారగా పిలిచేవారు లేరు; వచ్చినా వాళ్ళు అప్పుడే వెళ్లిపోయేరు అనే తలంపు వచ్చినప్పుడు, దుఃఖం వచ్చేది. కాని లోపల్లోపల-దత్తత చేసుకుంటే కనీసం వాడైనా పిలుస్తాడన్న ఆవేదన కల్గేది. తను చచ్చిపోతే శ్రాద్ధం అయినా పెట్టేవాడు వుండవద్దా అనిపించేది.

ఓ వేళ దత్తతే నిర్ణయించుకుందామంటే, ఎవరు ఇస్తారు! తనకు దగ్గరబంధువుల్లో ఎవరూ ఇచ్చేవారు కూడా లేనే లేరు. ఇవ్వడానికి ఒప్పుకున్నా, తను అనగలేని పౌరుషం వెనక్కు లాగుతోంది. ఈ సమయంలో ఒక్క తన తమ్ముడి తరఫువారికంటె తక్కువ ముఖ్యులు లేరు. తన తమ్ముడికే రేపు పిల్లలు కలిగితే, వాడ్ని అడిగినా, తనమాట తీసివెయ్యడన్న ధైర్యం వుంది. ఆ తలంపే లక్ష్మి నిండు మనిషిఅని తెలిసినప్పటినుండీ పార్వతిలో ఎక్కువైంది.

ఈ ఆశతో అప్పుడప్పుడు తన వయస్సు సింహావలోకనం చేసుకున్నట్టే ఉండేది. లక్ష్మికంటె తను ఐదు ఆరు ఏండ్లు పెద్ద. ఆయన వున్నట్టయితే అప్పుడే తనకు పిల్లల ఆశ ఉడిగిపోయేదికాదు. కాని ఇప్పుడో! దుఃఖం వచ్చేది. చచ్చినవాళ్లు చావకుండా, బ్రతికున్నవాళ్లనుకూడా ఎంత క్రూరంగా శిక్షించి వదులుతారో అని తిట్టుకుంది. తనబ్రతుకే అల్లా అయింది.

ఆరోజు భోజనాలదగ్గర "ఒరే, సీతాయి! జనవరి నెల వస్తోంది. రైతులు ఒక్క పైసా శిస్తు ఇవ్వలేదు. వెంకన్న దొంగముండావాడు. వాళ్లకు ఓసారి ఉత్తరాలు వ్రాయిరా; డబ్బు నిక్కచ్చిగా వుం"దని అంది.

సహపంక్తిని కూర్చున్న సీతాయీ, లక్ష్మికూడా తెల్లబోయేరు. ఆ క్షణంలో, సీతాయికి, తన అక్క తెలివితేటలు, సమయాసమయాలు చర్చించి, నిర్ణయానికి రావడానికి, ఇవన్నీ అర్థం చేసుకోడానికి తను ఇంకో జన్మ ఎత్తాలేమో అనిపించింది. బావగారు పోయిన వెంటనే ఆస్తివిషయం ఎత్తి విరోధం తెచ్చుకోవడం

ఎందుకని శాంతించి ఇన్నాళ్లకు నిర్ణయానికి వచ్చింది కాబోలు అనుకుని ఆశ్చర్యపడ్డాను.

"రేపు పెద్దబావగారికి ఓఉత్తరం వ్రాయాలి. ఇన్నాళ్లనుండి వ్రాయిద్దామనుకున్నా, బాగుండదేమో అని వూరుకున్నా."

"అల్లాగే అక్కాయి" అని అనగలిగేడు.

"ఆ, మరిచేపోయా! లక్ష్మికి కట్టుకునేందుకు నేలికచీరలు, గ్లాస్కోలు, తెచ్చిపెట్టు రేపు. డబ్బు శీస్తు వొచ్చింతర్వాత ఇద్దాం" అని పురమాయించింది.

ఆ రాత్రి దంపతులిద్దరికీ నిద్రలేకనే పోయింది. పార్వతిని ఇద్దరూకూడా ఎంత తెలివితక్కువగా అర్థం చేసుకున్నారో అని, ఈనాటి చర్యలను మననం చేస్తూనే చెప్పుకున్నారు.

అన్నట్టుగా అమర్నాథు రైతులందరికీఉత్తరాలు వ్రాయించింది. వారంపదిరోజులు చూచి ఉత్తరాలు రాకపోతే పునఃరిజిష్టరీఉత్తరాలు కట్టించింది. బావగారికి అతిమర్యాదగానే, తన్ను పోషించడంలో ఆయనకు బాధ్యత వుందనీ, ఏకాకికి ఓమార్గం చూపించడంలో ఎప్పుడూ వెనక్కు తియ్యరనీ— ఆవరసలోనే వ్రాయించింది.

ఇది వ్రాసిన పదిరోజుల్లోపలే "అమ్మాయీ! అందరం కలసి ఏదో ఓనిర్ణయమార్గానికి రావడం మంచిది. ఎప్పుడూ మనవంశం కోర్టులకు ఎక్కడం తాతల దగ్గరనుండి లేదు. కొద్దిరోజులలో ఏకోవిధమైన భాగాలు చేసి తెలియపరుస్తాను" అని వ్రాస్తూనే, అంతవరకూ నీ ఖర్చులకు ఉంచుకోమన్నట్టు ఐదువందలు పంపేడు.

ఉత్తరం, డబ్బూ చూచేసరికి సీతాయికి తను ఎక్కడ వున్నాడో తెలియలేదు. అంతవరకూ ఈ వ్యవహారం ఫైసలు అవడానికి కోర్టుకు ఎక్కితేగాని తేలదన్న దృష్టిలోనే వున్నాడు. ఒక్క తన అక్కగారి వినయవిధేయతఉత్తరంతో, పెద్దబావగారు, ఇంత త్రుటికాలంలో తేలుస్తారని అనుకోలేదు.

తన భర్త స్వార్జితంగా సంపాదించిన భూమి రైతులు రిజిష్టరీఉత్తరాలు పుచ్చుకోకుండానే త్రిప్పివేసేరు. వెంటనే వచ్చి 'పెద్దబాబుగారు వెంటనే వెళ్లమన్నారండి' అని చెప్పి, శిస్తు అణాపైసల్తో జమ కట్టేరు.

డబ్బు చేతిలోకి వచ్చినంతనే లక్ష్మిని తీసుకుని పార్వతి బజారుకు వెళ్లి 'ఇంట్లో ఇది లేదు అది లేదు. అన్నీ వుండాలి' అని చెపుతూనే బండెడు సామాను కొనుక్కువచ్చింది. అందులో నేతికరికై దగ్గరనుండి ఇత్తడిసామాను పాత్రలవరకూ వున్నాయి. లక్ష్మికి బావుంటుందని, ఆరుద్రపురుగురంగుపట్టుచీరా, దానిమీదికి పచ్చటి జాకెట్టుగుడ్డా కొంది.

ఆఫీసునుండి సీతాయి వచ్చేసరికి సావిటినిండా పేర్చివున్న సరుకులు చూసి, ఏమనాలో తెలియలేక పోయింది. తల్లీ, తండ్రీ పోయినతర్వాత, తనకు నా అన్నవారు లేక, ఏకాకిని అయ్యేనుగదా అనుకుని వ్యథపడ్డ రోజులు ఉన్నాయి. ఈవాడు తన అక్కగారు తనకు ఏమిగనగా ఒకరున్నారు అని చూపించినందుకు భగవంతుణ్ణి అభినందించుకున్నాడు. తన కృతజ్ఞత పైకి ఏవిధంగా చూపాలో తెలియలేదు. కొన్నాళ్లు పొందిన ఆవేదన, దాన్ని పైకి పొక్కనివ్వకుండానే, లోపల్లోపలే అణిచి వూరుకోబెట్టింది.

కోటు విప్పి "అక్కా! ఇవ్వాళ ఉమాపతి బావ ఉత్తరం వ్రాశేడు. వారం పదిరోజుల్లో ఇక్కడకు వస్తాడుట. వంట్లో బాగాలేదట. ఇక్కడ మందు తింటాడుట" అన్నాడు.

క్షణంపాటు పార్వతి గోడకు జేర్లబడిపోయింది. సీతాయికి ఆశించిన సమాధానం రాకపోయింది. ఆ క్షణంలో పార్వతి అల్లాఅవుటకు కారణాలు ఊహించుదామన్నా తనకు అతీతంగానే ఉన్నాయి.

"మంచిదే!" అని చెప్పి లోపలికి వెళ్లిపోయింది. ఆశబ్దంలో ఎన్నో గోచరించేయి. ఉమాపతి రావడంలో పార్వతికి బాధ ఎక్కువేకాని, ఇంకొకవిధంగా శాంతి లేదు. ఒకానొక కాలంలో ఆతను తనభర్త అవుతాడని ఆశించి నిరాశ అయింది. కాని విధి క్రూరంగా ఆశలు మార్చింది. ఈ వైనవ్యంలో అతనే కళ్లెదురుగా తిరుగుతుంటే బాధ భరించుకోవడం

కష్టమే. ఎర్రటి పుండు మీద కారం చల్లినట్టే వుంటుంది.

తను, పోనీ, ఉమాపతికి రావద్దు అని వ్రాద్దామంటే, ధైర్యం చాలటంలేదు. 'దేశాటనంవల్ల చెడిన ఆరోగ్యం బాగుచేయించుకుందుకు వస్తున్నా. నీకు ఇప్పుడు బాధ కల్గిస్తున్నా. దాన్ని నువ్వు సహృదయంతోనే తీసుకుంటావని తలుస్తాను' అనే వ్రాసేడు. తను కాదు అని వ్రాయలేడు. పైగా తన ఉద్యోగం కొరకు ఎంతో సహాయం చేసేడు. అల్లాంటప్పుడు, తన విధి, అతన్ని సంతోషపరచడంకన్న ఇంకేమీ లేనట్టే కనబడింది.

లక్ష్మితో చెప్పేడు. ఏం చెయ్యమన్నావు అనికూడా అడిగేడు. ఆమె ఏం చెప్పలేక 'ఇరకున పడ్డాం' అని అంది.

ఓరోజు ఉమాపతి వచ్చి, ఈ పరిపడని సంగతులకు ఓమార్గం కలగజేస్తాడని ఎదురుచూచేడు. కాని ఈనాడు అతను రాకుండావుంటేనే బావుండును అన్న ఆశ ఎక్కువైంది. కాని ఒక్క ధైర్యం వుంది. మొదట్లో పార్వతి ఎల్లా వున్నా, ఇప్పుడు ఆమె లేకపోతే అన్న భావన అందరిలోనూ కలగజేసింది. రాముం ఆమె ఆతిథ్యం పొందిన రోజులు తక్కువైనా ప్రతీ ఉత్తరంలోనూ ఆమెకి వందనాలు చెప్పవలసిందని వ్రాస్తూనే వున్నాడు. విశాలహృదయంతో, కష్టం కల్గినా, పార్వతి ఉమాపతిని పరిపుచ్చుకోగలదన్న ధీమాయే, ఇదమిత్థం తేల్చకుండా సీతాయిని ఊరుకోబెట్టింది.

ఏదో ఓరోజున 'ఉమాపతి ఎప్పుడు వస్తా'డని పార్వతి అడుగుతుం దనుకున్నాడు. కాని ఉమాపతి ఉత్తరం వచ్చినప్పటినుంచి పార్వతిలో ఓవిధమైన మూగతనం కనిపించింది. ఏదో ఆలోచిస్తోందన్న భావన స్ఫురింపజేసింది. పైగా లక్ష్మి "వదినగారు నాలుగైదుసార్లు ఎందుకో గుడ్లమ్మట నీళ్ళు కుక్కుకున్నారు. ఎంత అడిగినా చెప్పేరు కారు" అని చెప్పింది.

ఆరోజు స్టేషనుకు వెళ్లేడు. ఆ రైలులో ఉమాపతిని దిగుతుండగా చూచేసరికి సీతాయికే అనుమానం కలిగింది. అతను ఉమాపతేనా? దగ్గరగా వెళ్లేడు.

"సీతాయ్!"

ఆ మారిన కంఠం, ఎముకల పోగుగా వున్న రూపూ చూడలేక, దుఃఖంలోనే కౌగలించుకున్నాడు... "బావా! ఎంతగా మారిపోయేవ్! ఇంత ఎక్కువగా వుందని ఒక్క వుత్తరం వ్రాయలేకపోయేవా? నేనేనా ఒచ్చి తీసుకువచ్చేవాడిని".

నవ్వేడు ఉమాపతి. "పారూ, లక్ష్మి కులాసాగా వున్నారా?"

తలూపేడు. భుజానికి ఆనుకుంటూనే బండి ఎక్కేరు. అలసిన లక్షణాలు ఉమాపతిలో కన్పించేయి. "సీతాయ్! ఉత్తరం వ్రాయలేదన్నావు కదూ? ఏమని వ్రాయను? స్వార్థంలేకుండా సేవచెయ్యడం తప్పేమో అనిపిస్తుంది. ఆనాటినుండి పల్లెటూళ్లలో తిరుగుతున్నా. ఓ బడికూడా పెట్టేను. కాని..." చెప్పలేక ఆయాసపడ్డాడు.

"తర్వాత చెప్పుదువుగానిలే బావా!"

ఇంటికి వెళ్లేసరికి పారూ గుమ్మంలో నుంచుని ఉంటుందని సీతాయి వూహించుకున్నాడు. కాని అది నీటిమీద వ్రాత అయింది. చెయ్యిపట్టుకుని లోపలికి నడిపించుకుంటూనే వెళ్లి సావిట్లో కూర్చోపెట్టేడు.

"లక్ష్మీ! వేగరంగా కాఫీ తీసుకురా!" అని ఆ ఖంగారులో పొలికేక వేసినట్టే వేసేడు. లక్ష్మి ఖంగారుపడింది. ఏం తొందర వచ్చిందో అని ఆదరాబాదరాగానే వసకట్టి తీసుకువచ్చి, కుర్చీలో ఉన్న మనిషి ఎవరో అనుకుని వెనక్కు తగ్గింది.

ఆ యాసం ఒదుల్చుకున్న పిమ్మట "ఏం చెల్లమ్మా! ఒంట్లో బావుందా?" అని ఉమాపతి అడిగేడు.

"అన్నయ్యా! నువ్వా?..." దగ్గరగా వచ్చింది. ఉమాపతి అంటే లక్ష్మికి ప్రాణం. ఏంకష్టం వచ్చినా ఉమాపతితో చెప్పనిదే ఆయన ఏమీ చెయ్యరనీ, అప్పుడప్పుడు వచ్చినపుడు చెప్పేసలహాలూ, సహాయాలూ కూడా విని వుండటకనుక, ఎంతో గౌరవం, వాత్సల్యం అతనిఎడ వుండిపోయేయి.

"ఇంతగా అయ్యేవరకూ ఉత్తరం అయినా వ్రాయకూడదా అన్నయ్యా! ఎలా వున్నావో అని వినడానికైనా నేం నోచుకోలేదా? ఎంత మాయదారి జ్వరం వచ్చింది! నిన్ను చూస్తుంటే గుండె తరుక్కుపోతోంది..." అంతకంటే ఏం చెప్పాలో కూడా తెలియలేదు. తొందరగా గదిలో మంచం, పరుపు వేయించి, "అన్నాయ్! కాస్సేపు విశ్రాంతిగా పండుకో" అని చెప్పి పంపించింది.

ఉమాపతి జీవితంలో ఏకాకి. తల్లీ, తండ్రీ కూడా చిన్నప్పుడే చనిపోతే, మేనమామలు పెంచేరు. ఆ కష్టాల్లోనే తెలివితేటలవల్ల పైకి వచ్చి, పత్రికా ప్రపంచంలో కాస్తో కూస్తో పేరు తెచ్చుకున్నాడు. ౧౯౪౨ తో పూర్తిగా రాజకీయాలలో దిగి, 'ఉమాపతిగారు' అంటే 'ఓహో! వారా!' అనిపించుకునే వరకూ గౌరవం సంపాదించేడు. ఈనాడు తనకు తోబుట్టువలె లక్ష్మి పూనుకుని, సపర్యలు చేయడానికీ ఆదరణగా చల్లనిచూపు చూపించుటకూ అది ఉపయుక్తమవటం చూచి ఆర్ద్రపడిపోయేడు. కాని అంతవరకూ, పారూ కనిపించనేలేదు. కనిపిస్తుందని అనుకున్నాడు. కాని రానేలేదు. హృదయంలో ఆనాడు, చిన్నతనంలో ఏర్పడ్డ భావన ఎన్ని విరుద్ధపరిస్థితులు వచ్చినా చెరగగొట్టుకోలేని నిలకడ వచ్చింది. ఆ భావనే హృదయాన్ని ఝుంఝూమారుతాలతో నింపుతోంది.

బహుశః పునః తను పారూను చూడ్డం ఇదే మొదలు. అల్లాంటప్పుడు మారిన స్థితిలో సిగ్గుపడిందేమో, న్యూనతపడుతోందేమో అనుకుని ఊరుకోబెట్టుకున్నా, అవి ఊరుకోటంలేదు.

ఆశతో జీవితంలోని వ్యథల్ని, కష్టాల్ని, దుఃఖాన్ని, ఒంటరితనాన్ని దూరంగా త్రోసుకున్నాడు. ఇన్నేళ్లల్లోనూ తనలోనే మండిపోనిచ్చిన సమయాలసారం అంతా, అనుభవపు మూర్తీభవించిన ప్రగతి అంతాకూడా ఇప్పుడు కట్టలు తెంపుతోంది. పారూను చూడాలన్న ఆవేదన ఉద్రిక్తత అయి శాంతిని చెడగొడుతోంది.

అటు సీతాయి ఉమాపతిని పడుకోబెట్టి వంటింట్లో వున్న అక్కగారిదగ్గరకు వెళ్లి "అక్కాయి! ఉమాపతి బావ వచ్చేడు. కాని ఇప్పుడు అతన్ని చూస్తుంటే గుండె చెరువైపోతోంది" అన్నాడు.

అంతవరకూ ఏదో హడావిడి జరుగుతోందని వింటున్నా ఏముఖం పెట్టుకుని వీధిలోకి వెళ్లి ఆహ్వానం ఇవ్వగలనన్న ఉద్దేశ్యంలోనే కూర్చుండిపోయింది. ఇప్పుడు తమ్ముడే ఆవిధంగా చెప్పడం వింటూంటే ఏంఅనాలో కూడా తెలియక మాట్లాడకనే ఊరుకుంది. సమాధానం ఆశించిన సీతాయికి ఇది వ్యంగ్యమే అయింది.

ఆ సాయంకాలపు సంధ్యచీకట్లవరకూ పార్వతి మనస్సు వికలమైందన్నట్లే మూగగా, బాధగానే వుండిపోయింది. మధ్యాహ్నం డాక్టరు రావడం, ఏవోఏవో మందులు చెప్పడం, సీతాయి వెళ్లడం, లక్ష్మి జావ కాచి ఇవ్వడం—ఇవన్నీ చెవులూ, కళ్లూ వప్పగించి చూచింది, వింది. కాని ఓవిధమైన మనస్సులోని పిరికితనం ధైర్యంగా బావని చూడాలన్నా చూడనివ్వటంలేదు. మనస్సు, ఆత్మ, శరీరం ఆక్రోదిస్తున్నాయని తెలుసు. కాని తనకు ఈ పిరికితనం అంతు విధిస్తోంది.

భోజనాల దగ్గర సీతాయి "బావని మలేరియా జ్వరం పీక్కుతినేసింది. మందుతినక శరీరాన్ని బలిపెట్టేడు. జాగ్రత్తగా చాకిరీ చేస్తే త్వరలో కోలుకోవచ్చుని డాక్టరు చెప్పేడు" అన్నాడు.

అప్పుడుకూడా పార్వతి వింది. కాని మాట్లాడనేలేదు. లక్ష్మికీ, సీతాయికీ పార్వతివుద్దేశ్యం ఏమిటో తెలియక, పరాగ్గానే భోజనం చేసి పైవెళ్లేరు.

అకుతుంపర కూర్చోగానే పార్వతికి దుఃఖం వచ్చింది. ఈనాటి విపరీతజీవితంలోని ఏకాకిత్వం, సంఘం నియమించిన ప్రణాళికల్లోని అంకుశాలు ఎదురు తిరిగేయి. అవి ఎంతో క్రూరంగా నంచుని, ఇక నే గీచిన గీత దాటనని......అన్నట్లే నవ్వుకున్నట్టు చూస్తే ఏడుపే వచ్చింది.

చిన్నప్పటను ఉమాపతి తనవాడే అనుకుని మురిసిపోయింది. ఒక్క క్షణంఅయినా విడిచిపెట్టి వుండేది కాదు రోజూ ఒకళ్లనొకళ్లు చూడకుండా మాట్లాడకుండా ఉండలేకపోయేవారు. దాంతోనే వయస్సుకూడా పెరిగి, భావాల్ని, ఆశల్ని, కోర్కెల్ని కూడా విచ్చుకోనిచ్చింది. ఆ యవ్వనంలో ఒక సంధ్య వేళ ఉమాపతి తోటలో దగ్గరగా చేరి "పారూ! నన్ను పెళ్లాడుతావా!" అని అడిగేడు. తనే సిగ్గులో మాట్లాడలేక గదద అన్చి, కువకువమంటే, మొఖం పైకి ఎత్తి, మృదువుగానే ముద్దుపెట్టుకున్నాడు. తక్కిన రోజుల్లో సిగ్గుతోనే మాట్లాడేది. ఇద్దరూకూడా పెండ్లి నిశ్చయం చేస్తారని తెలిసేసరికి స్వర్గంలో ఇళ్లు కట్టుకునే మెదలేరు.

ఆ దగ్గరగా వున్న పదునాలుగు వత్సరాల్లోని సంగతులూ ఎదురుగా వచ్చేయి...ఆనాటి బావే ఈ నాడు తనింటికి, తను ఏమైనా ఆదరణ, చల్లని చూపు చూపించి, ఈ నాటి ఎముకలపోగుకు అమృతం చిలికిస్తానేమో అని ఆశతో, ఆవేదనతో వస్తే, తనే, క్రూరంగా దూరంచేసి, త్రోసిపుచ్చి గుండెల్లో గునపం గ్రుచ్చినానన్న తలంపు కూర్చోనిచ్చింది కాదు.

ఒక్క ముద్దయినా నోట్లో పెట్టుకోకుండానే లేచింది. తలుపు వేసి, త్వరగానే అడుగులు వైచి, గది గుమ్మంలోంచే చూసింది. తనేమైనా ఇంకోవ్యక్తిని చూస్తున్నానేమో అనుకుంది. ఎముకలన్నీ ఆ హరికేన్ దీపంవెల్తురులో లెక్కపెట్టవచ్చునన్నట్టే గాలికి ఊగుతున్నాయి. పాలిపోయిన మొఖంలో నీరసం, ఆయాసం, కంటికింద నలుపూ తన్ను జాలిగా, దేహీ అంటున్నట్టే పలికేయి.

దగ్గరగా వెళ్లింది. "బావా!" నోట్లోని మాట దుఃఖంలో రుద్ధంఅయి పైకి రాలేదు. పిలుద్దామని హృదయం అత్రుణంలో చించుకున్నా, కన్నీళ్లు ఆగలేదు. నెమ్మదిగానే చెయ్యి నుదురుమీద పెట్టింది. పడ్డ కన్నీటిచుక్కకు ఉలిక్కిపడి లేస్తూనే "పారూ! నువ్వా?" అన్నాడు. బొటబొటకారుతున్న నీళ్లతోనే "బావా!" అని ఏడ్చింది.

"పారూ! నేను నీదగ్గరకే వచ్చేను..."

"బావా! పార్వతి చచ్చిపోయిందనుకునే ఇన్నాళ్లూ శరీరాన్ని ఇల్లా కాల్చుకున్నావా? నేను లేనకే, చచ్చిపోయేననే భావించేవా?"

"లేదు, పారూ!" ఏమీ చెప్పలేని నీరసంతో కళ్లు మూసుకున్నాడు. కాగిన నుదురుమీద ఉడుకులాంగుడ్డ వేసి, విసనకర్రతో చల్లగా విసిరింది...

ఉమాపతి నిద్రపోయేడు. అంతవరకూ కన్నార్పకుండానే అతన్ని చూచి దుఃఖపడింది. ఏడ్చింది. దానికి అంతంలేదు. 'తన బావ తనదగ్గరికే వచ్చేడు' అని చాలాసార్లు అనుకుంది. అందులో శాంతిపొందినట్టే హృదయం తేలికపడుతోంది. తను చాకిరీ చేసి, తనబావని కాపాడాలి. తనకంటే ఇంకెవ్వరున్నారు బావకి...అన్న విక్షిన్న ఆలోచనల్తో చాపమీద నిద్రపోయింది పార్వతి.

* * *

అదిమొదలు పార్వతికి జీవితంలో ఓ నూతన్న ధ్యాయం ప్రారంభించినట్లే వుంది. ఉదయంమొదలు సాయంత్రంవరకూ తీరుబడే లేకుండా వుంది. కాఫీ త్రాగించడం, ఒళ్లు తుడవడం, మందు త్రాగించడం, జావ కాచడం ఇల్లాంటి పనుల్తోకాక, అస్తమానూ అతనెల్లావున్నాడో, నిద్రపోతున్నాడా మెలకువగా వున్నాడా, జ్వరం వస్తున్నట్టు వుందా అని గదిలోకి వెళ్లడం రావడంతో కాలం సరిపోయేది కాదు. వంట చెయ్యడంకూడా, ఆ అన్నం మెతుకులు కాసిన్ని ఉడకవేసి, వ్యంజనంక్రింద ఊరగాయతోనే సరిపుచ్చేది.

మొదటి మూడురోజులూ సీతాయీ, లక్ష్మికూడా "బీమారు అయివచ్చేడు. కొత్త సదుపాయం చూడకపోతే బాగుండదని పార్వతి చూస్తోం"దని అనుకున్నారు. కాని ఒక్కొక్క రోజు గడవడంతో ఈ సపర్యలూ సదుపాయాలూ విపరీతంగా మరీ పిచ్చిలోకి దిగేసరికి కిగ్గుకూడా కలిగింది. అంత ఒళ్లుమరచి చాకిరీ చెయ్యడంలోని గూఢార్థం వింతగానే స్ఫురించింది. అయినా ఉమాపతిమొఖం చూచీ, పార్వతికోటికి దడిసీ ఇద్దరూకూడా ఏమీ అనలేకపోయేరు. పార్వతి

చర్యల్ని మొట్టమొదటినుంచి సింహావలోకనం చేసుకుంటే, అమావాస్య పౌర్ణమికళలు ఉన్నట్టే తట్టింది. ఒకనాడు విందు, రెండోరోజు మందు! అల్లాగే ఇది కూడా ఏదో విపరీతానికో, పరోన్ముఖానికో దారి అనుకునే ఊరుకున్నారు.

ఆరోజు భోజనాలు చేసి కూర్చున్నప్పుడు, ఎక్కడ వింటో పార్వతి, సోదిదాన్ని పిల్చింది. చెప్పించుకునేవరకూ లక్ష్మిని ఒదిలిపెట్టింది కాదు. దగ్గరగా కూర్చోపెట్టి 'ఆడపిల్లా, మగపిల్లాడా?' అని తనే అడిగేటే లక్ష్మికి సిగ్గు ముంచేసింది. ఆ సాయింత్రమే, సీతాయి ఇంటిగుమ్మంమెట్లు ఎక్కుతుండగానే "ఒరేయ్! నాకు మేనల్లుడే పుడతాడురా!" అని పాలికేకలాగే అని సంబరపడింది. సీతాయి, అక్క ఆవిధంగా అనడం సిగ్గు కలిగించినా, లోపల్లోపల చాలా సంతోషించేడు. ఆకబురూ ఈకబురూ చెపుతూనే "మన వూరి మస్తానమ్మకు లక్ష్మిచేత పూజ చేయిస్తానన్నానురా! ఓ ఆదివారం వెళ్లాలి. చల్లగా పురుడు రావాలని మొక్కుకున్నానురా!" అంది.

అటు ఉమాపతికూడా గాలి, నీరుల మార్పువల్లనేమి, మందుల ఫలితంగానేమి, అన్నిటికన్నా ముఖ్యంగా పార్వతి చేసే సపర్యలవల్లనేమి కాస్త లేచి తిరగడం, ఒక్కపూట అన్నం తినడంవరకూ వచ్చేడు. కొంచెంకొంచెంగా పట్టే రక్తంవల్ల బుగ్గలు తెలుపు వదల్చుకొన్నాయి. రాత్రిళ్లూ, సెలవుదినాలల్లోనూ అందరూ కూర్చుని ఈకబురూ, ఆకబురూ చెప్పుకుని కాలం గడిపేవారు.

ఉమాపతి తనంతట తాను లేచితిరగడం, నీరసించిన నోటిమాటలూ శక్తి కోలుకోవడంతో పార్వతికి ఏవేవో ఆశలు మొలకలెత్తేయి.

ప్రపంచకంలో, ఎన్నో విషయాలు వింది. 'పునర్వివాహం ఎందుకు చేసుకోకూడదమ్మా? తను అడిగితే ఉమాపతి జవదాటుతాడా?' ఇల్లాంటి ప్రశ్నలు, దానికి సమాధానాలు మధురంగానే కలిగేవి. కాని ఇప్పటి సన్నివేశంలో, ఆ హృదయంలో తనకు ఏదిన్నైన స్థలంవున్నదో అన్న భావన దిగతీస్తోంది.

ఒక్కటి ధైర్యం వుంది. వయస్సు ముదిరిందన్న పేరేకాని, తన శరీరంలో మార్పు, రూపంలో కురూపత్వం రాలేదు. అద్దం ఎన్నోసార్లు చూచుకునేది. జడ ముడిచి, పువ్వులు తురుముకోవాలి; తన బావకి ఒక్కసారి తన అందం చూపిస్తే, తన్ను ఒద్దనలేడు, త్రోసిపుచ్చలేడు అన్న ధైర్యం వచ్చేది. కాని ఇప్పుడు తన తమ్ముడూ మరదళ్ల ఎదుట అపని చెయ్యలేదు. వాళ్లూ ఎంత ఆప్తులైనా, తను ఎంత చాకిరీచేసి ఎంతడబ్బు ఇచ్చినా, సంఘంలోని వారే! లక్ష్మి రేపో ఎల్లుండో పిల్లాణ్ణి కంటుంది. 'తన కొడుకు' అని చెప్పుకుని విర్రవీగుతుంది. సంతతి కావాలని తనూ ఉవ్విళ్లూరింది అప్పుడు. కాని కొద్దికాలం ఆ జీవనాన్ని పోషించేరుచి చూపించి దూరం చేసేడు. కాని కోర్కె చావలేదు.

ఇప్పుడు, తన కోర్కె ఫలిస్తే, ఉమాపతి తన్ను వివాహమాడితే, తనకూ సంతతి కల్గుతుంది. తనూ పోషిస్తుంది. తనూ లాలిస్తుంది.

• ఆ భావనల్లోనే, తనకంటే లక్ష్మికి ముందుగా ఎందుకు కల్గాలి అన్న ఈర్ష్య, ద్వేషం క్రమేణా ఆక్రమించుకున్నాయి. ఇప్పుడు లక్ష్మిని చూస్తేనే కోపం వస్తోంది. తనకంటే ముందుగా ఆమె మాతృత్వం వహించకూడదు. అది తను చూడలేదు.

ఈ మార్పుల్లోని భావనే లక్ష్మిరోజూ చూపడం ప్రారంభించింది. విస్తళ్లలో వడ్డిస్తూనే "జవసత్తువలు ఉడిగిపోతున్నాయి ఈ చాకిరీతో. ఎన్నాళ్లు ఈ అమ్మలక్కల్లా కూర్చోపెడం" అని సణిగింది. శూలంలా తగిలింది ఆ ముక్క. ఇన్నాళ్లూ ఏ అలుకుదూ లేకుండానే జరిగింది. కాని ఈనాడు మళ్లా పుండు రేగింది. సీతాయి ఈరోజుల్లో ఏదో ఎదురుచూచేడు. అది రానే వచ్చింది. ఇల్లాంటి విషయాలు ఆరోజుల్లో తనులుతూనే వున్నాయి. కాని అంతం ఎప్పుడో అర్థం కాలేదు.

ఉమాపతికూడా అప్పుడప్పుడు పార్వతి అనే వాక్కులు విని కష్టం పెట్టుకున్నాడు. తను వచ్చినప్పటినుంచి పార్వతి మారిం దనుకున్నాడు. కాని అది

విరుద్ధపరిస్థితుల్లోకి దారితీస్తుందేమో అని భయంపేకుతోంది. ఏదో ఒకరోజున ఆ ఉప్పెన ఒస్తుందని అంతరాత్మ చెప్పుకున్నట్టే అనుభవించేను.

ఆ సాయంకాలం అనుకోకుండానే పార్వతి పెద్దబావగారు విజయరామయ్య వచ్చేరు. ముఖాముఖీగా ఆ స్థితివిషయం, తను పంపకంలో అవలంబించిన పద్ధతీ చెప్పి, దస్తావేజుమీదాయిదాల మీద సంతకం తీసుకుని వెళ్లిపోయేడు. ఆయ నాగుమ్మం దాటగానే "సీతాయి! ఇప్పుడు నీకు కళ్లు చల్లగా వున్నట్టుంది. మీఆవిడకి నగలు చేయించవచ్చులే!" అంది పార్వతి.

ఒణికిపోయేడు. వినపడీవినపడనట్టుగా చెవికి సోకిన ఆమాటలు ఉమాపతిని నిరుత్తరుణ్ణిగానే చేసింది. కోపంలో 'పార్వతీ!' అని ఒక్క వెర్రికేక పెడదామనుకున్నాడు. కాని తన బలహీనతలో లోపల్లోపలే కుములుతున్నాడు. పార్వతి ఇల్లా కత్తిమీదసాటంగా అవలంబిస్తున్న మార్గం మార్చడం ఎల్లాగ అన్నదే సమస్య అయింది.

అటు సీతాయీ, లక్ష్మీకూడా ఏడ్చేరు.— బాధలో...

* * *

ఆ ఆదివారంనాడు ఆపేక్షతోనే లక్ష్మిని మస్తానమ్మదగ్గరకు తీసుకువెళ్లింది. దారిలో ఒస్తూ ఎరుకలదాన్ని ఓసారి తనింటికి రావలసిందనీ, అమ్మాయి ఒంట్లో బాగాలేదనీ, ఓసారి చూడాలనీ చెప్పింది. ఇంటికి రావడంతోనే దిగతుడుపు తీసి ఆయాసంగా వుందేమో అని పడుకోమంది.

ఇన్నాళ్లూ మారిన తత్వంలోంచి ఈనాటి ఆపేక్ష ఆలోచన కలిగించింది లక్ష్మికి. ఆ సాయంత్రం ఎరుకలది రావడం, ఇద్దరూ ఏదో గుసగుసలాడడం జరిగిందని తను వింది. కాని తన్ను చూడకుండానే ఎరుకలది ఎందుకు వెళ్లిందో అర్థం కాలేదు. పైగా అనుమానం కూడా కలిగింది. అయినా తను ఆ అనుమానంలో చెడును ఎక్కువగా భావించుకోలేకపోయింది.

వంట త్వరత్వరగా చేసి, మంచందగ్గరకే తెచ్చిపెట్టింది. పడుకోపోయేటప్పుడు పాలు తీసుకువచ్చి ఇచ్చింది...కాని అంత ప్రేమతో చూచిన ఒదినలో తను తప్పు ఎంచుకోవడం మూర్ఖత్వం అనుకునే నిద్రపోయింది.

ఆనాటిరాత్రి పదిఘంటలూ కొట్టడం వింది పార్వతి. తనకు ఏదో నూత్నశక్తులు వచ్చినట్టే వుంది. లేచింది. చాటుగా దాచుకున్న అద్దంముందర కూర్చుని తల దువ్వుకుంది. పువ్వులు ముడుచుకుంది. అంతవరకూ కొన్ని నెలలనుండీ పెట్టుకోని తిలకం పెట్టుకుంది. దాచుకున్న ఆరుద్రపురుగురంగుచీరా, పచ్చటిబుట్టచేతులజాకెట్టూ తీసింది...సీతాయీ, లక్ష్మీ పండుకున్నారో లేదో అని చెవియొగ్గి వింది.

మైకంలోనే నెమ్మదిగా గుమ్మం దాటింది. ఒత్తిగిలి పండుకున్న మంచంమీద సన్నటి వెల్తురు పడుతుంటే, అందులో ఆ చిన్నప్పటిబావే కన్పించేడు. తనే మారిందేమో! దగ్గరగా వెళ్తూనే బుగ్గమీద చెయ్యి వేసింది.

ఉలిక్కిపడి లేచేడు ఉమాపతి. తను ఏమైనా కలకంటున్నాడేమో అని కళ్లు నులుపుకుని పునః చూచేడు. ఆశ్చర్యపడుతూ "పారూ! నువ్వే..."

"అవును బావా! బాగాలేనూ...?"

ఏం చెప్పాలో ఉమాపతికి తట్టలేదు.

"బావా! నీకోసం వచ్చేను. ఇప్పుడు నీకంటే నాకు ఇంకెవ్వరున్నారు? ఆనాడు తోటలో అన్నావ్. అప్పుడు నీదాన్ని కాలేకపోయేను. ఇప్పుడు నీకోసం వచ్చేను...మనిద్దరం ఎక్కడికైనా దూరంగా వెళ్లిపోదాం. ఈనాడు నీచేతుల్లో నన్ను పెట్టి నాజీవితం అంతా ధారపోస్తా. రావూ బావా!"

ఉద్రిక్తఅయిన పార్వతిని తను ఏవిధంగా, పరిస్థితులను సరిచేసి మాపెట్టాలో అర్థంకాక తికమకపడ్డాడు. "పారూ!..." ఆగేడు.

"ఏం బావా! ఒస్తావనవ్...ఈరాత్రే వెళ్లిపోదాం."

"నువ్వే మరుగుతున్నావో ఆలోచించేవా? వెళ్ళిపోతామనకో... నా పేరు.... సంఘం.... సీతాయి, లక్ష్మి వీళ్ళేమనుకుంటారో ఆలోచించావా? నాకోసం త్యాగం చేస్తానన్నావ్! చెయ్యి...ఇన్నాళ్లూ నన్ను నీమనస్సులోనే ప్రేమించేవ్! ఇప్పుడూ ప్రేమించు. రేపు లేచి దూరంగా వెళ్లిపోతామనుకో. అప్పుడు కాలం జరిగిజరిగి, మనం ఒకళ్లకొకళ్లకు బాగా పరిచయం, చనువు అవడంతో ఏఆశతో వెళ్లుతామో అది చవకఅయిపోయి, ఇప్పటి మహత్తరత ఉండదు పారూ!"

"అయితే, రావా బావా?"

"శరీరవాంఛలకొరకు, పారూ, నీతీ, నియమం, ఆరాధన చెడగొట్టకు...దూరంగా ఉండడంలోనే గొప్పతనం ఉంది పారూ!"

సగం చచ్చింది. కథలు వ్రాసేవారి పిచ్చి వేదాంతంలా తట్టింది. అయినా తను ఎంత ఆశపెట్టుకుని వచ్చిందో, అంత నిరాశ పొందింది. తనవాడను కున్న ఉమాపతి క్షణంలో దూర మైపోయేడు. ఇంకేం మిగిలింది?

"ఇన్నాళ్లూ చేసిన చాకిరీకి కృతజ్ఞత ఇదేనా?"

"అల్లా అనకు పారూ! హృదయపూర్వకంగా..." చేయెత్తేడు........ బొటబొటా కన్నీళ్లు కారేయి పార్వతికి...

గదిగుమ్మం దాటింది..."అక్కాయ్! నీకోసం చూస్తున్నా" ఖంగారులో అన్న సీతాయి పారూ వేషం చూచి నిర్విణ్ణు డయ్యేడు.

కొద్దిగంటలక్రితం తనుచేసిన క్రూరమైన ప్రతీకారం భావనల్లోని ఆశలుపతనం చేస్తే లక్ష్మికి చేసింది. ముఖం చూపించలేకనే...లోపలికి వెళ్లింది.

"బావా! డాక్టర్ని పిలవాలి. లక్ష్మి అమితంగా బాధపడుతోంది. ..." సీతాయికేక వింది. వాళ్లు ఖంగారుపడ్డం చూచింది. తన గదిలో తలుపులు బిగించుకునే, డాక్టరు జోళ్ల చప్పుడు, వాళ్ల ఆరాటము శాంతించడం వింది...గంటలు జరిగేయి. కంటిమీద కునుకే రాలేదు.

ఉదయంఅవడంతో తను ముఖం ఎల్లా చూపిస్తుంది. ఉమాపతిమీద ద్వేషం, కోపం, ఇప్పుడు భయంకూడా కలిగింది. సీతాయినీ లక్ష్మినీ పలకరించుటకు హక్కే లేదు...ఏం చెయ్యాలి......మొట్ట మొదటి నుండి తన జీవితం పతనమే అయింది. ఈనాడు అది పూర్తిగా, నా అన్నవారు లేకుండా, ఏకాకిని చేసేయి. తను బ్రతకాలి...ఇక్కడ కాదు...ఎక్కడో?

చీకటి వుండగానే దాసీదానిచే బండి పిలిపించింది. ఉన్న కొద్దిబట్టలూ, బావగారిచ్చిన డబ్బూ మూటకట్టుకుంది. అందులోనే తన బ్రతుకు వుంది...కన్నీరు తుడుచుకొని, మూట చంకను పెట్టుకుంది. బండిలో కూర్చుని, 'పోనీ' అంది. ఎక్కడికో, ఏంచెయ్యడానికో...తనవాళ్లను చూడలేకనే...ఏడుస్తూనే...ఏకాకిగానే...స్వర్గంనుండి అవరోహణఅయిన మానవిలాగే...నిపాది.



# మాయావాదము

## 3. పరమాణువాదసారము

●

శ్రీ వేలూరి శివరామశాస్త్రి

మన మేదేని స్థూలమును నొక కార్యమును విభజించుచుపోవుచో నిక విభజించుటకు వీలులేని మిగుల చిన్నదగు నొక నలుసుకడ కేగి యాగిపోదుము. కార్యద్రవ్యముల నన్నిటి నీరీతిగా నలుసులు చేసి విభజించుచువిభజించుచు పోవపోవ నిక విభజించుటకు వీలులేని నలుసులే పరమాణువులు. ఈ పరమాణువులు నిత్యములు. వీనికి అంశములు, అనగా భాగములు, లేక అవయవములు ఉండవు.

అంశము కలదియు, విభజింప వీలగునదియు నగు ద్రవ్య మనిత్యము. ద్వ్యణుకాదు లనిత్యములు. అవయవముల యన్యోన్యసమ్మేళనమువలన చేర్పడు వస్తువునకు వినాశము తప్పదు. ఏలనగా కొం డవయవముల కలయికచే గలిగిన వస్తువులెప్పుడో యొకప్పుడు కలయిక విడిపోనే విడిపోవును. అది కతుకే కదా. పిమ్మట నా కార్యద్రవ్యము నశింపనే నశించును. అవయవముల కలయిక కార్యద్రవ్యమున కసమవాయికారణము. ఆ యసమవాయికారణము నశించుచో కార్యద్రవ్యము గూడ వెంటనే నశించును. కావున స్థూలముగా గనబడు పృథివ్యప్తేజో వాయురూపమగు నీ ప్రపంచ మేదో యొక సమయమున అతిసూక్ష్మములును, అదృశ్యములు నగు పరమాణుపుంజములుగా ప్రిదిలిపోవుట తప్పదు. ఏలన, పరమాణుపుంజముల సమ్మేళనమువలన గదా స్థూలమగు నీ బాహ్యప్రపంచసృష్టి!

'సూక్ష్మములగు నీ పరమాణువులకును శాఖా నాసులవలె లోలోపల లెక్కలేని అవయవము లుండవచ్చును. అవి అత్యంతసూక్ష్మములు గావున మన కనులకు గనబడకపోవచ్చును. వీనిని మనము స్థూలద్రవ్యములవలె విభజింపలేకపోవచ్చును; మరియు ఆ యవయవములకుగూడ అవయవము లుండవచ్చును. వానికిని మరల నవయవములుండవచ్చును. వేరుపరచి చూపరాక పోయినను ఈ యవయవధార అనంతము కావచ్చును అని అంగీకరించినయెడల బాధ యేమి?' అని యడిగినచో ఆరంభవాదులగు వైశేషికు లిటులు చెప్పుదురు.

### ఉండ - కొండ

అవయవధార అనంత మనియు, పరమాణువు సావయవ మనియు చెప్పుచో అనవస్థ ఏర్పడుటయే కాక యీ ప్రపంచమున 'ఇది పెద్దది, ఇది చిన్నది' అను భేదము లేకుండపోవలసివచ్చును. లోకమునం దుండ చిన్న దనియు, కొండ పెద్ద దనియు అందరును వ్యవహరింతురు; అందరును ఒప్పుకొందురు. ఉండకును కొండకును గల భేద మెవ రెరుగనిది! ఉండ యవయవధార యనంత మగునేని దానిని తునియలు తునియలునుగా జేసికొనుచుపోవుదము. ఏ తునియకడను విరామమే యుండదని అనుకొందము. అపు డుండ యవయవము లనంతము లని తేలును. ఈదశనే కొండ యవయవములును, అవిశ్రాంతములగు వాని యవయవములును అనంతములని తేలును. ఒక చిన్న ఉండకును అనంతము లగు నవయవములు! ఒక పెద్దకొండకును అనంతము లగు నవయవములు! ఇం దేదియు తక్కువ తిన్నది లేదు. ఒక చిన్న మట్టియుండయవయవముల మొత్తమునకును, ఒక పెద్దకొండఅవయవముల మొత్తమునకును ఎక్కువతక్కువలు లేవు. ఇటులు లేనిచో

పరిమాణవైషమ్య మెటులు సిద్ధించును? ఉండ చిన్న దనియు, కొండ పెద్ద దనియు మన మెటులు వ్యవహరింపగలము? ఉండకును కొండకును పరిమాణగత మగు వైషమ్యము సిద్ధించుటకు ఉండ కుపాదానకారణ మయిన పరమాణువుల సంఖ్య అల్పము కావున ఉండ పరిమాణము చిన్న దనియు, కొండ కవయవము లయిన పరమాణువుల సంఖ్య ఉండపరమాణువుల సంఖ్య కంటె చాల నధికములనియు నొప్పుకొనితీరవలయును. ఇటు లొప్పుటవలన ఎక్కువ పరమాణువుల కలయికకు ఫలమయిన కొండపరిమాణము ఉండపరిమాణముకంటె చాల పెక్కువ యని చెప్పుటకు వలనుపడును. కావున కార్యద్రవ్యములను విభజించుచుపోయి నచో నిరవయవమును, నిత్యము నగు ఒక విభాగము కడ మన మాగిపోవుదు మని అంగీకరించితీరవలెను. కానిచో డీప్రపంచమున 'ఇది చిన్నది, ఇది పెద్దది' అను వ్యవహారము అడపాడ లేకుండ బోవలసివచ్చును. కావున పరమాణువులు నిరవయవము లనియు, నిత్యము లనియు ఒప్పుకొనితీరవలెను.

పృథివ్యప్తేజో వాయురూపములగు స్థూలభూతములకు సమవాయికారణముగా అనంతములును, నిత్యములును, అదృశ్యములును అగు పరమాణువులు కలవు. పరమేశ్వరుని యిచ్ఛచేతను, భోగానుకూలమగు జీవుని అదృష్టప్రభావముచేతను ఈ పరమాణువులలో సృష్టికి పూర్వము కదలిక, లేక క్రియ కలుగును. ఈ క్రియచే పరమాణువులకు పరస్పరము సంయోగము కలుగును. దాన త్ర్యణుకాదిక్రమమున స్థూలతరమును, స్థూలతమమును అగు నీ ప్రపంచమంతయు రూపెత్తును. అగ్నికి ఊర్ధ్వజ్వలనమును, వాయువునకు తిర్యగ్గమనమును, మనః పరమాణువులకు ఆద్యక్రియయు అదృష్టప్రేరితములు.

మరియు నల్లని కుండ పెంకులగును. చిల్లపెంకు లగును. చతురణుకము లగును. త్ర్యణుకము లగును. ద్వ్యణుకము లగును. అవియు నశించి పరమాణువు లగును. పాకమువలన గలిగిన వాని పూర్వరూపాదులు తొలగును. పిదప మరియొక పాకమువలన ఎఱ్ఱదనము మొదలగు రంగులు కలుగును. పిమ్మట అదృష్టసహాకృతు డగు నాత్మని సంయోగముచే దానక్రియ ఉత్పత్తిల్లును. దానిచే నది పూర్వదేశమునుండి వేరుపడును. ఈ విభాగముచే నది మరియొక పరమాణువుతో కలియును. ఇటులు క్రొత్త ద్వ్యణుకము ఉత్పన్నమగును. ఇవి త్ర్యణుకములుగను, చతురణుకములుగను, కపాలములుగను అయి తుదకు మరల కుండ యగును. కారణగుణములు కార్యమున ననువర్తించునుగావున పరమాణువునకు గలిగిన ఎఱ్ఱదనము మొదలగు విశేషములు కుండకును గలుగును. వైశేషికమతమున నిది పీలుపాకవాదప్రక్రియ. ఆరంభవాదులు సృష్టివిషయమున జెప్పు మాటలలో నివి ముఖ్యములు. ఇవి యెంత సంగతములో నిక నాలోచింతము.

'రెండు పరమాణువులు సంయుక్తము లగునెడల, అనగా ఒండొండ కలియునెడల ఒక ద్వ్యణుక మేర్పడును. మూడు ద్వ్యణుకములు కలియునెడల ఒక త్రసరేణు వేర్పడును.' అని కదా పరమాణురహస్యము. పరమాణువునకు అంశములు లేవుకదా. అంశము లనగా అవయవములుకదా. పరమాణువులు నిరవయవములే యగునెడల రెండు పరమాణువు లెటులు సంయుక్తము లగును?

## సంయోగము

ద్రవ్యములకు అంశములు, అనగా అవయవములు ఉండవలయును. ఆ యవయవములలో నొక యవయవము నందుగాని, పెక్కు అవయవములయందుగాని సంయోగ మను సంబంధ ముత్పన్నమగును. సంయోగసంబంధమున కిది స్వభావము. రాము డనువాడు సూర్యున కభిముఖముగా నిలిచియున్నా డని అనుకొందము. అపుడు సోముడు రాముని కెదురుగా వచ్చి సంయుక్తు డాయెనని అనుకొందము. అపుడు రాముని ముఖోదరాదులతో సోముని ముఖోదరాదులకు సంయోగము కలుగును. అట్టి యపుడు రాముని వెన్నునకును, సోముని వెన్నునకును ఎట్టి సంయోగమును కలుగదు. ఎంతటి ప్రేయసీ ప్రియతరుల యాలింగనమునందును ఇటులు పొసగదని అందరకును తెలియును. ఒక వస్తువుతో మరియొక వస్తువునకు సంయోగము కలిగెనని ఎవరేని అనినపుడు ఆ రెండు

వస్తువులయు అవయవములు కొన్ని కలిసె ననిమాత్రమే మన మర్థము చేసికొందుము. ఏ రెండు వస్తువులయు అవయవము లన్నియు సంయుక్తము లగుట అసంభవము. ఏలనగా, అన్ని అవయవములకును అన్ని విధములను ఏ రెండు వస్తువులకయినను సంయోగము కలుగునెడల ఆ రెండు వస్తువులును ఒకటియయిపోవును. వేరు వేరు వస్తువులకు సర్వావయవసంయోగ మెవరికిని అనుభూతము కాదు. సంయోగస్వభావ మిట్టిదేయేని నిరవయవము లగు వస్తువులకు పరస్పరసంయోగము సంభవింప దను సిద్ధాంతము తేలును. కావున రెండు పరమాణువులకు సంయోగసంబంధ మసంభవము.

పరమాణువు లిక సావయవము లని యందురేని ద్రవ్యము లన్నిటియు నవయవధార అవిచ్ఛిన్నము, ననంతము నని ఒప్పుకొనవలసివచ్చును. అటు లొప్పుకొనినయెడల మిరియమునకును మేరువునకును పరిమాణ మొకటియే కావలసివచ్చును. ఈ రెండు దోషములలో నొక దోషమును పరిహరింప బోవుచో వేరొక దోషము పరమాణువాదుల నెత్తిమీద పడకతప్పదు*.

మరియు వైశేషికులు పరమాణువులకు రూపరసగంధస్పర్శము లంగీకరించుచున్నారు. లోకము నందు రూపాదులు కల కుండయు, కోకయు మొదలగున వెల్లయు ననిత్యములుగా గనబడుచున్నవి. ఈ కార్యములనుబట్టి వీని కారణములును తప్పక అనిత్యములు కావలయును. వైశేషికులు లోకమున గానబడు రీతినిబట్టియే పరమాణువులకు రూపాదుల నూహించుచున్నారు. మనకు కానిపించు రీతినిబట్టి ఊహించు వస్తువున మన సిద్ధాంతమున కనుకూలములగు విశేషముల నారోపించుట యుక్తికి విరుద్ధంబగు వాదము కాదా ?

మరియు నీ యారంభవాదులు సృష్టికి మొదట పరమాణువులలో అదృష్టవశమున ఆద్యక్రియ కలుగు నని యందురు. ఈ క్రియ పరమాణువులయం దుండు నదృష్టమువలననా, లేక ఆత్మయందుండు నదృష్టము వలననా కలుగును ? జీవులు చేసికొనిన పుణ్యపాపముల వలన కలుగునదికదా అదృష్టము. కావున నది పరమాణువుల నంటిపెట్టుకొనియుండదు. ఒకవేళ ఉండునని యందురా, పరమాణువు లెల్లయపుడును సృష్టి చేయుచునే యుండవలయును. ప్రలయమునకిక ప్రసక్తి యుండరాదు. పోనీ, ఆత్మయందుండునని యందురా, అది పరమాణువులయం దెటులు క్రియను గలిగించును ? ఇటు లనగా క అదృష్టములో గూడిన యాత్మతో గల సంబంధముచే పరమాణువులయందు క్రియ కలుగునని యందురా, అపుడును ఆ యదృష్టము నిత్యమును, సన్నిహితమును అగుటచేసి ఎల్లయపుడును సృష్టి కలుగుచునే యుండవలయునుగాని ప్రలయ మను మాట పొసగరాదు. కావున పరమాణువులు జగత్కారణమనుట పాడికాదు. ఇన్ని దోషములతో గూడికొనిన యీ పరమాణువాదమును నమ్మికొని సృష్టితత్త్వము నెవడు తెలిసికొనగలడు ? ఈ కారణముచేతనే యీ ప్రపంచము మాయ కాక మరి యేమి యని మాయావాదులు ప్రశ్నింతురు.

## పరిణామవాదసారము

జగతికి మూలకారణము ప్రకృతి. ప్రకృతి త్రిగుణాత్మకము. మరియు సుఖదుఃఖమోహాత్మకము. ప్రకృతికంటె వేరుగా పురుషుడు కలడు. పురుషుడనగా జీవాత్మ. సృష్టికి పూర్వ మీప్రకృతియు పురుషుడును ఒకరితో మరియొకరి కిసుమంతయు సంబంధము లేక యుందురు. పురుషుడు నిర్లిప్తుడు.

సృష్టికి పూర్వక్షణమున సమభావాపన్నమును, సుఖదుఃఖమోహాత్మకమును, త్రిగుణాత్మకమును అగు ప్రకృతియందు వైషమ్యము కలుగును. వైషమ్యమనగా

---

* గ్రీసు దేశమున క్రీ. పూ. ౫, ౬ శతాబ్దుల నడుమనున్న ల్యూసిపస్ డిమాక్రిటస్ అను దార్శనికులును, మొనమొన్నటివరకు ఉన్న పాశ్చాత్యవైజ్ఞానికులును కణాదునివలెనే పరమాణు వభేద్యమనియు, నిత్యమనియు నమ్మిరి. కాని నేటి వైజ్ఞానికులు పరమాణువును పగులగొట్టుచున్నారు. పరమాణువు భిన్నమై శక్తిగా మారుచున్నదని నిరూపించుచున్నారు. కావున పరమాణు వొక శక్తికేంద్రము. ఇక పరమాణువు అభేద్య మనియు, జడ మనియు నమ్మ బనిలేదు.

త్రిగుణములలో నొక గుణము మిగిలిన రెండు గుణములను అడచియుంచి తాను ప్రధానముగా పనికి పూనుకొనుట. అపుడు గుణత్రయమందలి సామ్యము లోపించును. ఈ గుణత్రయములో క్రియాశీలమగు రజోగుణము ప్రబలమై తమస్సత్త్వముల నభిభవించి తన పని తాను చేసికొన నాయత్తమగును. ఇటు లభివ్యక్తమగు రాజసశక్తియే అవ్యక్తముగా నున్న మహత్తత్త్వము మొదలగు ప్రపంచమునంతయు క్రమక్రమముగా నభివ్యక్తము చేయును. ఈ మహత్తత్త్వమునుండి అహంతత్త్వమును, దానినుండి క్రమముగా అంతరములగు నింద్రియాదులును బాహ్యము లగు తన్మాత్రలును స్థూలభూతములును అభివ్యక్తము లగును. ఇటు లభివ్యక్తమయిన ప్రపంచముతో అవివేకవశమున చిదాత్ముడు తన్ను ప్రపంచాత్మునిగా దలచి ప్రపంచధర్మము లగు సుఖమును దుఃఖమును తనయం దారోపించుకొనును. ఈ యారోపము కలవ జీవాత్మ సంసరించి సంసారి యని యనిపించుకొనును. నిర్లిప్తుడగు పురుషునకు ప్రపంచముతో నైక్యబుద్ధి లుప్తమయిపోయినపుడు ప్రపంచధర్మము లగు సుఖదుఃఖములు అంటవు. ఈరీతిగా సుఖదుఃఖములు పొడపొట్టు లేకుండ నశించినపుడు పురుషు డాత్యంతిక దుఃఖనివృత్తి బడయును. ఇది పరిణామవాదుల సిద్ధాంతసారము. ఇది ఎంత సంగతమో యిక విచారింతము.

సృష్టికి పూర్వము సమభావాపన్నము లగు గుణత్రయములో నొక గుణము ప్రబలమై తక్కిన రెండు గుణములను తొక్కిపెట్టి తాను స్వతంత్రముగా క్రియాశీల మగుట యెటులు? దీనికి పరిణామవాదు లేమి బదులు చెప్పెదురు? గుణములు మూడును సమముగా నున్నయపు డది యవ్యక్తావస్థ, లేక ప్రలయము. ఆ యవ్యక్తావస్థలో ఏ కార్యమును వ్యక్తముగా నుండదు. కావున ఆగంతుకమగు కార్య మొకటి యీ గుణవైషమ్యమును కలిగించు నని యను టెటుల సంగతము? పుట్టబోవు ప్రాణులచే సుఖముగాని, దుఃఖముగాని అనుభవింపజేయుటకు ప్రకృతి స్వయముగా నే పూనుకొని యీ గుణవైషమ్యమును కలిగించునని యందురా? ప్రకృతి జడముకదా. దానికి చేతనాశక్తి లేదుకదా. జడ మొకదానిచే సుఖదుఃఖము లనుభవింపజేయుటకు స్వయముగా పూనుకొను ననుట ఎటులు సంభవము? ఇటులు ప్రవర్తించుటయే ప్రకృతికి స్వభావ మని యందురా? ప్రవృత్తియే ప్రకృతికి స్వభావమేని సృష్టికి సరిగా వెనుకటి నిముసముననే ఆ ప్రవృత్తి యెటులు కలిగెను? దానికి వెనుకటి నిముసమునను నిముసములను ఏల కలుగకపోయెను? దేనికేది స్వభావమో అది దానిని విడిచియుండదుకదా. నిప్పునకు వేడిమి స్వభావము. నిప్పులో వేడిమి లేదని ఏ నిముసమునందేనియు మీ రనగలరా? అటులే ప్రవృత్తియే ప్రకృతికి స్వభావ మయినయెడల అన్ని సమయములయందును ప్రకృతిలో ప్రవృత్తి యుండనే యుండును. ప్రకృతిలో సృష్టి కనుకూలము కాని సమయమని ఒకటి కేటాయించుటకు వీలు లేదు. కావున సృష్టి కనుకూలమగు ప్రవృత్తి ప్రకృతికి స్వభావమేని ప్రకృతి యెల్లపుడును సృష్టి చేయుచునే యుండవలయును. మరియు గుణములు సమభావాపన్నము లగు ననుటయే పొసగదు. ఈరీతిగా జడమునకు చేతనధర్మము నారోపించి నిలువబడలచికొనిన పరిణామవాదము ఎంత సేపని నిలువగలదు?

మహదాదికార్యములగు వెన్నెల మల్లి కల్లి మొదలగునవి సుఖదుఃఖమోహాత్మకము లని పరిణామవాదు లందురు. ఇది చెల్లదు. ఏలనగా, సుఖాదులు మానసప్రత్యయముచే తెలియదగినవి. మరియు మనోమాత్రధర్మములు. వెన్నెల మల్లి కల్లి మొదలగునవియో కన్ను మేను మొదలగువాని ప్రత్యయముచే దెలియనగినవి. సుఖాదు లాంతరధర్మములు. వెన్నెల మొదలగునవియో బాహ్యధర్మములు. మరియు వెన్నెల మొదలగు నివి సుఖాదిస్వరూపములే యగునేని సుఖము, వెన్నెల యీ రెంటి యనుభూతియు ఒక అంతరింద్రియముచేతనో, లేక బాహ్యేంద్రియముచేతనో తెలియవలసియుండును. కాని అటులు తెలియుటలేదు.

ఇక వెన్నెల మొదలగునవి సుఖాదిరూపములే యగునేని వసంతమునందువలె హేమంతమునందును వెన్నెల సుఖకరము కాదేల? ప్రేయసీపరిష్వక్తునకువలె విరహికిని ఏల సుఖకరము కాదు? ఆరోగ్యము, కలవానితోపాటు జ్వరితునకును ఏల సుఖకరము

కాదు ? మరియు ముల్లు నీకు కంటకము. అది నీ కాహారమును గాదు. ఒట్టియ కది సంబరము. దాని నది లొట్టలు వేసికొనుచు అరగించును. కల్లు ఒకానొకపుడు రోగార్తున కమృతము. నీకు విషము. కావున వెన్నెల మొదలగు మహదాదికార్యములు కాలవిశేషాదులబట్టి సుఖాదిహేతువులే కాని సుఖాదిస్వరూపములు కావు.

విషయములు సుఖాదిరూపములు కానిచో నవి సుఖాదులకు హేతువులు కాజాలవు కావున విషయములు సుఖాదులకు హేతువగుటవలననే సుఖాదిస్వరూపము లని అనుమింతు మని యందురా ? అటు లనదగదు. ఏలన 'ఏది దేనికి హేతువో అది దాని స్వరూపము' అని వ్యాప్తి లేదు. వెన్నెల మొదలగునవి ఇచ్ఛకుగాని, ద్వేషమునకుగాని హేతు వగు టెపుడో యొకానొకపు డగుటచేసి అనియత మని అందురోటు? కాలవిశేషాదులబట్టి సుఖమునకుగాని, దుఃఖమునకుగాని హేతు వగుటయు అనియతమే కదా. కావున మహదాదికార్యములు సుఖాదిస్వరూపము లను మాటయు పొల్లు. ఇట్టి పొల్లును బెట్టుకొని జగద్బీజము నెటులు నురుచగలము ?

మాయావాదు లిట్టి యుక్తులచే ఆది సృష్టి ఎటు లాయెనో దాని నెవరును నిర్ణయింపజాలరని నిరూపించిరి. ఈ ప్రపంచపు కార్యకారణసంబంధము విచారింపగల శక్తియు మానవునకు లేదని చెప్పుటలో అది అసత్యము కాకపోగా సత్యమును ఒప్పుకొనినటు లగును.

స్వప్నావస్థలో ఎన్నియో కారణము లెన్నియో కార్యములు చూతుము. స్వప్నభంగ మగుపిదప ఆ కారణములుగాని, ఆ కార్యములుగాని కల్ల లని తెలిసికొందుము. జాగ్రదవస్థయందును మన 'ఇది కారణము, ఇది కార్యము' అని తత్త్వనిర్ధారణము చేయుదుము. కాని కాలాంతరమున మన యీ తత్త్వనిర్ధారణము తప్పయిపోవు టెన్నిమారులు మన అజకు వచ్చునో దానికి లెక్క చేయగలమా ?

మనము శైశవమున కొన్ని విషయములను సుఖకారణముగా నెన్నుకొందుము. పిచ్చుకగూండ్ల గట్టి నిదే యింట నివసింపము. క్రొత్తవస్తువుల జూచినదే తడవుగా తలిదండ్రుల గదలనీయము. కుక్కపిల్లలతో సహభోజన మొనరింతుము. బురద పూసికొందుము. ఇట్టి వన్నియు మన కపుడు నిరతిశయసుఖకారకములు. యౌవనము వచ్చియు రాకమునుపే శైశవవిషయము లన్నియు దుఃఖకారణములని నిర్ణయించుకొందుము. అట్టి పనులు చేయము, చేయనీయము. అప్పటి ప్రవృత్తి వేరు. అది శుద్ధకామప్రవృత్తి. నీవు కోరిన స్త్రీ నీకు దేవత. లేక నీవు వరించిన పురుషుడు నీకు దేవత. నీ వా దేవత లేనిదే బ్రతుకజాలవు. ఆ దేవత నీ కపుడు సుఖస్వరూపము. వార్ధకము వచ్చియు రాకమునుపే తల పండీపండకమునుపే బాల్యయౌవనములందు సుఖకారణమని అనుకొనిన ఆ వస్తువులనే మనము మరల దుఃఖకారణము లని నిర్వచించుకొందుము. నామపారాయణ మారంభింతుము.

మరియొకటి. నీకు సుఖకరమయిన వస్తువు నాకు సుఖకరము కాకపోగా దుఃఖకరమే కావచ్చును. అదియే మరల జ్ఞానికి సుఖకరమును, దుఃఖకరమును కాకపోవచ్చును. విచిత్ర మగు నిట్టి ప్రపంచమును జూచి దీనిని స్థిరమని దీనిని సత్తని ఎవడు చెప్పగలడు ? మరియు ఇది మాయ కాదు, ఇంద్రజాలము కాదు అని ఎవడు బోధింపగలడు ?

[పరిశిష్టము]



‘ఛత్రవిక్రేత’

త్రివర్ణచిత్రమునకు నకలు. చిత్రకారుడు: శ్రీ పి. శ్రీనివాసులు.



# స్వాధీన

[కథానిక]

శ్రీ వేలూరి సహజానందం

రైలు శరవేగంతో పరుగులెత్తుతోంది. చీకట్లో నిప్పురవ్వ లటూ ఇటూ భగ్గుభగ్గున, మిణుకు మిణుకుమంటూ పడుతున్నయ్—తోకచుక్కల్లాగా. పెట్టె సమ్మర్దంగా లేదు.

కిటికీవద్ద కూర్చొని అతను పరుగెత్తుతున్న కొండల కేసీ, చెట్లకేసీ చూస్తున్నాడు. చల్లని గాలి హాయిగా వీస్తోంది. పెట్టెలో అవతలవైపున ఓ యువకుడూ యువతీ చిరునవ్వులతో కులాసాగా కబుర్లు చెప్పు కుంటున్నారు. వాళ్ల నవ్వులు పెద్దగా వినబడి, అటు చూసి, మళ్ళీ వెంటనే ఆకాశంవైపు ముఖం తిప్పు కున్నాడు.

పైస్టేషన్‌లో ఆ జంట దిగిపోయారు. ఎవరో ఒకళ్లిద్దరు కొత్తప్రయాణీకులు పెట్టెలోకి వచ్చారు. కదిలి, మళ్ళీ పరుగెడుతున్న రైలుచప్పుడులో అతని కా యువతీయువకుల నవ్వులూ, మాటలు ప్రతిధ్వని స్తున్నయ్. ముఖంపై విషాదం మబ్బులా కమ్మింది.

ఆకాశం చీకటి వెరుపైంది. ఆ అనంతమైన చీకటి—దిగంతలాల్లో ఎక్కడో సుదూరంగా ఒక మెరుపు తళుక్కుమంది. తటిత్తున సాక్షాత్కరించిన మనోభీష్టం మళ్ళీ అంధకారంలో కలిసిపోయింది. దీర్ఘ నిశ్వాస మొకటి అతనిలోంచి వెలువడి, ముఖాన్ని మరింత నిర్జీవం చేసింది.

రెండు స్టేషన్లు దాటాక ఒక చిన్న పల్లెటూరి స్టేషన్ వచ్చింది. హడావిడిగా తలుపు తెరచుకొని ఒక యువతి ప్రవేశించింది. పెట్టె, పక్కచుట్ట గబగబా లోపల పడేసి, కుర్రాడు తలుపు వేశాడు. ప్లాటుఫారంమీద నుంచొని ఒక ముసలాయన "వెళ్ళంగానే అతని కెలా ఉందీ ఉత్తరం వ్రాయండి... ఒరే అబ్బాయ్...జా..." అని ఇంకా ఏమిటాఅంటున్నాడు.

కదులుతున్న రైలుచప్పుడులో అతని మాటలు అస్పష్టమైనయ్...చీకట్లో అతృప్తుని ముఖం అదృశ్య మైంది.

ఆమెముఖం క్రమేపి విషాదంతో పాలిపోవటం కిటికీవద్ద కూర్చొన్న అతను చూశాడు. వనకబడిపోయిన స్టేషన్ వైపునుంచి ఆమె ఇంకా ముఖం తిప్పలేదు. కాసేపయాక ఆమె మెల్లగా ప్రయాణీకులకేసి చూసింది. తైలం తగ్గుతున్న జ్యోతుల్లా వున్న ఆమె కళ్ళను చూసి, అతను మళ్లీ ఆకాశంవైపు తిరిగి, చెట్లకేసీ, దిబ్బలకేసీ చూస్తున్నాడు.

అతని కళ్ళలో రాధప్రతిమ అశ్రుపూజ నందు కుంటోంది. అతని హృద్వేగంలో రైలు ధ్వానపులా ఉంది. గతదినాలన్నీ రైలుచక్రాలై, తనపై బరువుగా దొర్లుకపోతున్నయ్.

మరునాడు తాను దిగే వూరు రాధఉన్న ఊరే. నాలుగేళ్లయింది చూసి రాధను. మళ్ళీ ఇన్నాళ్లకు ఎక్కడెక్కడో తిరిగి, ఆమె ఉన్న చోటికే వస్తున్నాడు.

రైలులో ఎదురైన యువకదంపతుల్లాగా తానూ రాధతో కలిసి కేరింతాలాడుతూ జీవితయాత్ర చేసేవాడు.

కాని యాత్రికుల బాటలు చీలిపోయినయ్. దుఃఖార్తు రాలైన ఎదుటి ప్రయాణీకురాలిలా తమ హృదయాలూ సుఖదుఃఖాల్లో సమంగా స్పందించేవి. కాని భగ్నమైంది తన హృదయం.

ఆ దంపతుల చిరునవ్వులు, మాటలు, సంతోషంతో, ఉల్లాసంతో మెరిసిన వారి ముఖాలు హఠాత్తుగా వ్యాధిగ్రస్తుడైన భర్తకోసం క్షోభపడు తున్న ఆ యువతి కళ్లూ కళ్లలో మెదలగానే, గాయ పడిన పాదంపై ఎవరో కాలితో తొక్కినట్టయింది.

తెల్లవారేముందు అతనికి కొంచెం మగత పట్టింది. ప్రయాణీకుల సందడికి మెలకువ వచ్చింది. స్వాప్నిక భ్రాంతి తొలగగానే, చేతులు మళ్ళీ సంకెళ్లలో నొక్కుకున్నయ్.

పక్క స్టేషన్లో యువతీ, కుర్రాడూ దిగారు. రైలుదగ్గరకు ఎదురుగా వచ్చిన చుట్టాలు, "తగ్గిపోయింది...జ్వరం...అదుర్దా ఏమీ లేదన్నారు... డాక్టర్లు" అని చెప్పగానే, ఆమెముఖం తటిత్తువ మెరిసింది. ఆకళ్లు ఆనాసంతో, హేలతో నీళ్లునిండేయ్. అశ్రువుల్లో ఆశ సూర్యుని తొలికిరణాల్లా తళుక్కు మంది.

మళ్ళీ ఫూంకరిస్తూ రైలు కదిలిపోయింది. అతని మనస్సులో ఆశాజ్యోతి ఒక్కసారి భగ్గుమంది. దైవికంగా రాధ ఉన్న ఊళ్లోనేగదా తన ఉద్యోగమైంది. తమ మైత్రి, బాల్యస్మృతులు మళ్ళీ తమను ఏకంచేయ గలవు. గతం కేవలమాత్రం కాజాలదు. అలా అయితే దాన్నెప్పుడో తాను దహనం చేయగలిగేవాడే. గతం జీవప్రవంతి. ఆ మహాప్రవాహం మిథ్యాను మరుభూముల్లో ఇంకిపోయినా, మళ్లీ దాని ఉత్తుంగతరంగాలే తనను, రాధను ఆనందసముద్రానికి చేరుస్తయ్. తాను రాధనెలా మరచిపోగలడు? ఇది తన శక్తికి, కాంక్షకు మించినది. రాధ లేని తాను కన్నులేని కబోదిలా ఇన్నేళ్లూ తిరిగాడు.

స్టేషన్ సమీపిస్తోంది. దూరం దగ్గరవుతున్నకొద్దీ అతనిమనో వేగం అధికమవుతోంది. ఏ రహస్యనిశిరాత్రో తాను రాధహృదయద్వారంవద్ద నిలబడి తన ఏకైక ప్రార్థనను విన్పిస్తాడు.

తన జీవితంలో మళ్ళీ ఉషస్సు ఉదయిస్తుంది. లేదా... అతని గుండె జలదరించింది. మనస్సుయొక్క ఊహావిహంగాల విసురుకు లజ్జచెందాడు. భీతి కల్గింది. నైరాశ్యపు కారడవుల్లో చిక్కుకుపోయిన తాను మళ్లీ గగనకుసుమాలకై చేతులు చాస్తున్నాడు.

రాధ బాల్యపురాధ కాదు. ఇల్లాలు. తా నిదివరకు చెట్టుకొమ్మపై కూర్చోపెట్టి, కిందకు పడేశాడు. కోపంలో జడుగుబద్దతో కొట్టాడు. కాని ఇప్పుడు తన చేతిలోంచి దూసుకువెళ్ళి రాధకు తగిలే దెబ్బ వజ్రాఘాతమై, తా నొక పచ్చని కాపురానికి నిప్పంటించిన వాడవుతాడు. ఆలోచనల తీవ్రకాఠిన్యతకు, ఉచ్చుతాళ్లలా ఉరితీసే ఫలితాలకు నిట్టూర్చి, సామానులు సర్దుకో నారంభించాడు.

౨

ఇన్నాళ్లకు ఇప్పుడు స్నేహితురాలిని చూసేసరికి అతని ముఖం ఒక్కసారిగా సంతోషంతో ప్రఫుల్లమైంది. జైలులోని ఖైదీ ఆప్తులను చూసి ఆనందపరవశమైనట్టు. రాధకని గదిలోంచి బయలుదేరినప్పుడు అంతో్ళనాపిచారాలు అతని కాళ్లకు బంధాలైనయ్.

ఒకే ఊరివాడు, బాల్యమిత్రుడు అనుకోకుండా అగపడగానే రాధముఖం కలకలలాడింది.

"ఎప్పుడు వచ్చావు?" అని అడిగింది.

"ఇవ్వాళే...ఈ ఊర్లో ఉద్యోగమైంది... నిన్ను చూసిపోదామని వచ్చాను."

"మేం గుర్తున్నామన్నమాట"

అతని మనస్సు క్షణమాత్రం చివుక్కుమంది. రాధను తాను మరచిఉండగలిగితే బాగానే ఉండేది. కాని అది తన కసాధ్యమైంది. రాధ తన హృదయస్పందం; తన ఊపిరి. తన మనఃపథమంతా రాధ పదచిహ్నాలతో పునీతమైంది.

"ఎక్కడ దిగావు?"

"హోటలులో దిగాను.... రెండురోజుల్లో ఎక్కడైనా గది చూసుకోవాలి."

"హోటలూ వద్దూ...గదీ వద్దు... మా ఇల్లు బాగా పెద్దది కాకపోయినా, సరిపోతుంది. నువ్వొక గదిలో ఉండవచ్చు... ఈ హోటలుభోజనాలు చేసే ఇన్నాళ్లూ ఇలా తయారు అయావు." అని రాధ సంజ చీకట్లో ఎలెక్ట్రిక్ దీపం వేసింది.

ఈ నాలుగేళ్ల తర్వాత రాధ యౌవనంతో ఉజ్వలంగా ఉంది. వయస్సుతో సమ్మోహనంగా ఉన్న ఆమెరూపం అతని కళ్లను మిరుమిట్లుగొల్పింది. ఈ యౌవనం తా నెరుగడు. ఆ విశాలనేత్రాల్లోకి చూసి నప్పుడు, అతని హృదయం ఉప్పొంగింది. అవి తన చిరకాలమిత్రులు. కాని ఇప్పు డక్కడ బాల్యపు అమాయకం పోయి, సౌందర్యమే కన్నెత్తి చూస్తున్నట్టుంది. ఆహ్లాదంతో వివశు డయాడు.

"మీవారు ఊర్లో ఉన్నారా?"

"ఆ...ఆఫీసునుంచి వచ్చే వేళ అయింది. మరి నువ్వు సామాను తీసుకురావాలి. హోటలులో భోజనం పెట్టరు."

"బాగా ఉండదు"

"వా రేమీ అనుకోరు...నిన్ను బొట్టూ కాటుకా పెట్టి ఆయనే పిలుస్తారులే...సరేనా?"

"ఏదో గది దొరికేదాకా మీఇంట్లో ఉంటాను. కాని, భోజనం—"

"నే నేం కొత్తదాన్నా—?" అని మెల్లగా రాధ అంది. అతను జవా బివ్వలేదు.

ఆమె కొత్తా తనకు? కాదు...తన ప్రాణం. తనతో గంతులేసి, ఆటపాటలాడి, పెరిగి పెద్దదైంది. కాని, ఈరాధ... తన కపరిచితి! ఈ శరీరాన్ని తాను తాకలేదు. ఈ మనస్సుయొక్క ఆటుపోట్లు తా నెరుగడు.

"చిన్నతనంలో నా మాట ఎప్పుడూ వినేవాడివి కావు. ఇప్పుడుకూడా అలాగే." అని ఆగింది రాధ.

తన్ను మరచిపోలేదు రాధ. తనపై మక్కువ తగ్గలేదు.

రాధ ఊరికబుర్లేవేవో అడిగింది. తన ఉద్యోగ ప్రయత్నాలూ, ఇంటిగొడవలూ ఏకరువుపెట్టాడు.

"ఈ నాలుగేళ్ళూ నీకు కనబడకుండా తిరుగుతున్నా, నాకళ్ల కెప్పుడూ నువ్వు కనబడుతూనే ఉన్నావు— నక్షత్రంలా." అన్నా డతను.

అతని కళ్లలో హర్షం ప్రతిబింబించటం ఆమె చూసింది.

"ఏదో భావకవి వవుతున్నట్టున్నావు" అంది.

అతను లజ్జతో చూశాడు.

ఇంతలో భర్త వచ్చాడు. భార్యవైపు చుట్టాన్ని గుర్తించి, పలకరించాడు. రాధపెళ్లినాటి పరిచయం జ్ఞాపకంచేసుకొని ఉభయులూ మెల్లగా అవీ ఇవీ లోకాభిరామాయణం చెప్పుకున్నారు.

రాత్రి భోజనాలదగ్గర తన్ని తమ ఇంట్లో ఉండమని ఆహ్వానించాడు. రాధ నిర్వ్యాహకత్వం చూసి అతను ఆశ్చర్యపోయాడు.

3

ఇప్పు డతను వాళ్లింట్లోనే ఉంటున్నాడు.

రాత్రి ఆలస్యంగా వచ్చాడు. ప్రశ్నార్థకంగా చూసిన రాధతో "సినిమాకు వెళ్లాను...చాలా బాగా ఉంది." అని అన్నాడు.

అన్నం వడ్డిస్తూ రాధ అడిగింది.

"అంత బాగా ఉంటే నన్ను తీసుకు వెళ్లలేదేం?"

"నిన్నా?"

"ఏం"

"వస్తావో...రావో..."

"ఎందుకు రాను?"

"నాతో రావద్దూ—నే నిప్పుడు పరాయివాడి నయ్యె." అని సంకోచం వెలిబుచ్చుతూ జవా బిచ్చాడు.

కాసేపుండి రాధ అంది:

"వారు మామూలుగా సినిమాలకు వెళ్లరు. నే వెళ్తానంటే వద్దనరు."

అతని ముఖంలో తటిత్తున మెరసిన భావా

లామె గ్రహించింది. పరాయివాడి నన్న అతని మాటలకు నొచ్చుకుంది.

"ఇక్కడ మనలో పరాయివా ళ్లెవరు—మోహన్? నువ్వు లేపా అలా మాట్లాడటం—" అని రాధ ఆగి, మళ్ళీ అరంభించింది:

"ఇన్నాళ్ళకు మళ్లీ కలుసుకోవటం సంభవించిందని నే నెంతో ఆనందంగా ఉన్నాను. మన చిన్నతనం—ఆ బడి—మిగతావాళ్ల పలకబలపాలు దాచి, పంతులుగారి దెబ్బలు తినటం... గుళ్ళో పప్పు బెల్లాలకు ముందు తయారు కావటం, చెరువు గట్లమీద మడివాళ్లను మైలపడేయటం...ఇప్పుడు నీకీ ఊరిలో ఉద్యోగమవటం, మా ఇంట్లో ఉండటం—నిజంగా నాకు పండగగా ఉంది. నీకు దండం పెట్టుతాను. నువ్వలా మాట్లాడకు."

వంటింట్లో హఠాత్తుగా అడుగుపెట్టిన భర్తను చూసి మోహన్ ముఖం వివర్ణమైంది. ఈ యువక బంధువుముఖమై ఖని శివరావు చూసి, "ఏమో రాధ ఏదో ఉపన్యాస మిచ్చేస్తోందే... సినిమా ఎలా ఉంది?" అని, కాసేపుంకి వెళ్లిపోయాడు.

రాధ తన బాల్యాన్ని గుర్తుతెస్తుంటే మోహన్ మనస్సు చలించింది. దాంపత్యపు అవరోధాన్ని దాటి స్నేహితురాలు తన పవిత్రహృదయాన్ని తాకింది. ఏళ్ల తరబడి, ప్రచ్ఛన్నంగా, నిగ్రహనేపథ్యంలో అణగిమణగివుంటున్న మోహన్ స్వప్నాలన్నీ ఒక్కుమ్మడిగా మానసికాకాశంలో ఇంద్రధనుస్సై మెరసినయ్. ఇంతలో శివరావు కనబడగానే అతని ఊహాపతంగం పుటుక్కున తెగినట్టయింది. అంతే కాదు. రాధమాటలు అతను విన్నాడేమో!... ఈ అనుమానం కలగగానే మోహన్ రాధవైపు చూశాడు.

భర్త మెట్లెక్కి డాబాపైకి వస్తున్న అడుగుల అలికిడి వినబడుతోంది.

"రాధా!" అన్నాడు మోహన్.

"నాకు తెలుసు...నీ ఆందోళన...కంగారు" అన్నట్టు చిరునవ్వు నవ్వింది రాధ. ఆ నిబ్బరం అతని కర్థం కాలేదు. మోహన్ ముఖంలో కనబడిన బెదురుచూసి, "నన్ను గదిలో పెట్టి తాళం వేసి, మా వాళ్లను పూరా నాదూ తప్పించినప్పుడూ..." అని అంది రాధ.

కొంతసేపయాక కంపితస్వరంతో మోహన్—

"రా ధా...నన్ను మరచిపోయివుంటా వనుకున్నాను...మన బాల్యం నీకాలికి తగిలిన గులకరాయిగా మటుకు గుర్తుందేమో ననుకున్నాను. కాని ఇప్పుడు నీతో మాట్లాడుతుంటే, మీ ఇంట్లో ఉంటుంటే..." అని అతను ఊరుకున్నాడు.

"అవును...అప్పుడు చిన్నపిల్లలం— అప్పుడు బొమ్మరిల్లాటలు" అంది రాధ.

బాల్యమిత్రుని మాటలు తుమ్మెదలై ఆమె హృదయంలో ఝంకారం చేసినయ్.

౪

అతని కారాత్రి నిద్రపట్టలేదు. ఎడారిలా ఇసుకపారిన మన స్సిప్పుడు మనోహరమైన ఉద్యానవనమై, వసంతపు కోకిలల కలకలారావములతో ప్రతిధ్వనిస్తోంది. నైరాశ్యపు సంకెలలు సువాసనాభరితమైన పూలమాల లైనయ్.

రాధ తనపై చూపిస్తున్న ఆదరాభిమానాలు, మక్కువ, చనువు ఆమె నేపథ్యానికి తెరలెత్తుతున్నయ్యా? ఆమెహృదయమందిరంలో తన విగ్రహం విచ్ఛిన్నమై శిథిలం కాలేదూ? ఆమె ప్రతీమాటా, ముఖభంగిమా ఆ విగ్రహంముందు దీపారాధనగా ఉంది తనకు.

నిశిరాత్రి దాటింది. డాబామీద దంపతులు పడుకున్నారు. కాని మోహన్‌కు నిద్రపట్టటంలేదు. కిటికీలోంచి చీకటిలోకి చూస్తున్నాడు. ఏదో అలికిడి... రాధ...? అతను మెల్లగా పక్కకు తిరిగి ద్వారంవైపు చూశాడు. నిశ్శబ్దంగా ఉంది. అలికిడి ఏదో...భ్రమ. అతని మనస్సు వ్యాకులితమైంది.

రాధపెళ్లిలో తానూ ఊరేగింపుల్లో, పెళ్లి పందిరికిందా, చుట్టపక్కాలతోనూ సంతోషంగా తిరిగాడు. అప్పటికి తనకు పద్నాలుగు పదిహేనేళ్లు. మధ్యమధ్య ఎదో అసంతృప్తి...అర్థంకాని నిర్లిప్తత.

మళ్ళీ బాజాబజంత్రీలు... సరససల్లాపాలు ఊరేగింపులు.. సరదాగా గడచిపోయింది.

కాని క్రమేపీ రోజులు గడచినకొద్దీ బాల్యస్మృతి స్మృతిమాత్రంగానే నిలిచిపోలేదు. వయస్సుతోపాటు మైత్రీస్మరణ వృద్ధిచెందింది. బాల్యంలో సిద్ధించిన బంధం తెగిపోదనీ- తెగిపోలేదనీ తెలుసుకున్నాడు. ఆ బంధం పాణిబంధం కాకపోయినా, తనకు ప్రాణబంధమైంది. హృదయం స్నేహితురాలి స్మృతితో స్పందించింది. అహర్నిశలూ అంతరాత్మ విధియొక్క దుర్యోగానికి యజ్ఞపశువై వ్యథితమైంది.

రాధ తనది కాకుండాపోయినప్పుడు, తన హృదయం ఘోషించిందేమో. కాని తనకు తెలియదు. అప్పటి బాల్యానుభవాలు, స్వప్నాలు తన నెప్పటికీ నీడలై వేటాడి వెంటాడుతాయని తెలియదు.

పరాయిదైన రాధ ఎప్పటికీ తనకు పరాయిదే. తనకూ రాధకూ మధ్య అడ్డుగా నిలిచిన భర్తను చూసి ద్వేషం కలిగింది. ఈ అపరిచితుడు, అజ్ఞాతవ్యక్తి రాధకు సర్వాధికారి! రాధహృదయసామ్రాజ్యానికి సామ్రాట్టు!! ఇప్పుడు రాధఆనందం, తృప్తీ, ఉల్లాసం అన్నిటికీ అతనే తేనెపట్టు!

తాను! చిరపరిచితుడు... చిన్ననాటి చెలికాడు... రాధహృదయసామ్రాజ్యంలో తీరని కోరికల చినుకులలో నిలబడిన బికారి!

ఒకప్పుడు సర్వస్వం తనదే. కాని ఈనాడు తనకు శూన్యం!

ఓడిపోతున్న సుత్రంలా నిష్ఫలమనో వేగంతో మరింత నిస్పృహచెంది, కృశించాడు.

అత్తింటినుంచి పుట్టింటికి పండగలకు, పబ్బాలకు రాధ వచ్చినప్పుడు, తాను పలకరించి, కబుర్లు చెప్పేవాడు.

కాని రాధ ఇంకా అమాయకురాలు... కన్య శరీరంలో బాలమనస్సు. తనను దహిస్తున్న దుఃఖాగ్ని ఆమెకు సోకలేదు. పైగా మొగుడిగురించి, అత్తవారి వైపువాళ్ల గురించి ఎంతో అభిమానం!

తన అంతర్వేదన గురించి ఒకసారి చెప్పాలనుకున్నాడు. కంఠంలోంచి మాట వెలువడలేదు. గడచిన రేయి మళ్లీ రాదు. స్నేహితురాలి అమాయకసంతోష సముద్రంలో తన భగ్నహృదయానికి తెరచాప నెత్తలేకపోయాడు. చక్కని ఉద్యానవనంలా ఉన్న రాధ మనస్సులో తన అంతర్గతదుఃఖం బోనులోంచి బైటపడిన బెబ్బులిలా హాహాకారాలు చేస్తుంది.

ఇలా అంతర్వేదనతో కృశిస్తుండగా, అనుకోకుండా ఇదేవూరిలో ఉద్యోగమవటం, రాధ తన్ను బాల్యంలోవలె ఆత్మీయునిగా ఎంచటం అతనికి ఆశ్చర్యంగా, మహదానందంగా ఉంది.

గడియారం నాలుగు కొట్టింది. ఇంకా నిద్ర రావటంలేదు. ఆకాశంలో నల్లని మబ్బులు కదిలిపోతున్నట్టు, అతని మనస్సులో మసకమసకగా ఆలోచనలు చెలరేగుతున్నయ్.

౫

మరునాడు రాధ అడిగింది:

"మరి పెళ్లి ఎప్పుడు మోహన్?"

"ఎప్పుడో... అప్పుడు."

"ఏం పాపం...ఇంకా పన్నెండేళ్ళ బాలకుమారుడివేనా?"

"అంతా రాధలాగానే ఉండరు. నే నేం బాలకుమారుడి నని అనలేదే!"

"చాలులే" అంది రాధ.

భర్తవైపుసంబంధం ఏదో ఉందనీ, పిల్ల బాగా ఉంటుందనీ చెప్పింది. కాని అతను మనస్సుకు పట్టించుకోవటంలేదు.

కొంచెం సేపయాక అన్నాడు మోహన్:

"నీపెళ్లి అప్పుడే నాకూ మావాళ్లు ఎందుకు పెళ్లి చెయ్యలేదో."

అతని స్వరంలో ఉద్రేకం, విరక్తి వ్యక్తమవుతున్నయ్. అతని ముఖం వివర్ణంకావటం చూసింది రాధ.

"చేస్తే ?" అని అంది.

"చేస్తే! ఏముంది! హాయిగా ఉండేది." అని అతనింకా ఏమీ మాట్లాడకుండా అక్కడనుంచి లేచిపోయాడు. అతని ముఖం, మాట, ప్రవర్తన హఠాత్తుగా మారిపోవటం చూసి ఆమె విస్తుపోయింది.

అతనికీ అప్పుడే పెళ్ళయితే ! మిత్రుని మాటలు ప్రతిధ్వనించి, ఆమెకళ్లు కలవరపడినయ్.

ఆమెకు ఒక్కసారిగా మళ్లీ తన బాల్యపు రోజులు గుర్తువచ్చినయ్. చిన్ననాటి చెలికాని కళ్లలో దైన్యం ఆమెహృదయాన్ని కలచివేసింది. మోహన్ బొమ్మలపెళ్లిళ్లు మరచిపోలేదు అనుకొంది.

౬

సాయంకాలం మోహన్ ఇంకా ఇంటికి రాలేదు. చీకటిపడ్డది. ఏమీ తోచక, శివరావు మోహన్ గదిలోకి వెళ్లాడు—ఏదైనా పుస్తకం తెచ్చు

ఉంచామని. గోడఅలమరలోంచి ఒకటి రెండు పుస్తకాలు తీశాడు. అవి అతనికి నచ్చలేదు. ఇంకేదో పుస్తకంతీసి, పేజీలు తిరగేశాడు. కాలిమీద ఏదో జారిపడ్డట్టు అయింది. అతను కాలు విదిలించాడు:— ఏదైనా చినిగిన కాగితంముక్కేమో అని. దీపంవెల్తురులో ఫోటో ఒకటి తళుక్కుమంది. వంగి, ఆ చిన్న ఫోటోను పైకెత్తాడు. తక్కున అతని రెండుకళ్లూ బొమ్మపై పడ్డయ్.

పదిపన్నెండేళ్ల బాలిక...... చెప్పించుకోలేని నవ్వు...విశాలనేత్రాలు...అతని మనస్సు కళవళపడ్డది. ద్వారంముందునుంచి రాధ వెళ్తోంది. "రాధా" అని పిలిచాడు. గుమ్మందగ్గర ఆగి, "ఏమిటి పుస్తకాలేవో చూస్తున్నారు? మోహన్ సినిమాకు వెళ్లాడేమో?" అంది రాధ.

"ఏంలేదు...సరేలే" అన్నాడు. అతనింక ఎక్కువ మాట్లాడలేకపోయాడు. కాని ఆపాదమస్తకం కంపించాడు. ఆఫోటో మళ్లీ పుస్తకంలో పెట్టాడు.

ఇంటికప్పులో నల్లతాచొకటి చరచర పాకిపోతున్నట్టు తోచింది అతనికి.

సినిమాకు వెళ్లివచ్చిన మోహన్‌కు అన్నంపెట్టి, సినిమాకబుర్లు అడుగుతోంది రాధ. ఉభయుల మాటలూ డాబాపై పరున్న శివరావుకు మోహన్ గదిలోంచి వినబడుతున్నయ్.

ఆరాత్రి డాబామీదకు భార్య వచ్చాక, కొంతసేపటికి శివరావు మెల్లగా అన్నాడు:

"అతనెక్కడైనా గది చూసుకుంటున్నాడా?"

రాధ చకితురాలైంది. భర్త ఇలా అడుగుతాడని ఆమె ఎప్పుడూ ఊహించలేదు.

"మనింట్లో ఉంటున్నాడుగా?" అంది.

"ఎన్నాళ్లుంటాడు...పరాయిఇంట్లో!"

రాధ ఇక మాట్లాడలేదు.

భర్తమాటల్లో దూరంగా పిడుగులమోత వినబడ్డది. తనముందు నక్షత్రాలతో, చంద్రబింబంతో మనోహరంగా ఉన్న ఆకాశంలో తుఫానుల మదపు వేనుగులు చొరబడి భీషణంగా ఘీంకరిస్తున్నయ్. ఆమెగుండె దడదడ కొట్టుకుంది. తన బాల్యమిత్రుడు తన దాంపత్యానికి......!

భర్తకళ్లల్లోంచి క్షణమాత్రంగా దూసుకువచ్చిన చూపు నోటికందిచ్చిన విషంలా ఉంది రాధకు.

ఆరాత్రంతా సంక్షోభంతోనే మేల్కొనిఉంది. భర్తకు తన అశ్రుపూరితనయనాలను చూపించాలనీ, అతని కళ్లలోనలుసును తీసేయాలనీ అనుకుంది. కాని ఆమెకు ధైర్యోత్సాహాలు నశించినయ్. సుఖంగా గడచిపోతున్న రోజు లొక్కసారి రథచక్రాలై గుండెలో దూరుకుపోతున్నట్టుంది.

నిర్మలంగా వెలుగుతున్న దీపం హఠాత్తుగా గాలివిసురుకు అల్లల్లాడింది. వీచింది పిల్లగాలే అయినా, పెనుగాలి హోరురొద ఆమెఎదలో ప్రతిధ్వనించి, దీపం మిణుకుమిణుకు మనసాగింది.

మరునాటి పొద్దున రాధతో మోహన్ ఏదో మాట్లాడుతుండగా, భర్త అదాకే వెళ్లాడు. రాధగుండె చివుక్కుమంది.

ఆరాత్రి రాధముఖంలో మార్పు చూసి శివరావు అడిగాడు—"అలా ఉన్నావేం?" అని.

"ఏం లేదు...ఒంట్లో బాగా లేదు," అంది.

భర్త మామూలుగానే మాట్లాడాడు. ముఖంలో కూడా మార్పేమీ లేదు. కాని రాధకు రాత్రిప్రసంగంలో వినబడిన పెనుగాలి ఇంకా మనస్సులో హోరుమంటూనే ఉంది.

౭

మోహన్ సాయంకాలం షికారుకు పోతుండగా రాధ ఆపింది. స్నేహితురాలి ముఖం నిర్జీవంగా ఉంది. అతనేవో ఆఫీసు కబుర్లు చెప్తున్నాడు. మధ్యమధ్య రాధ "మరి..." అని ఆగిపోయేది.

"ఏం రాధా? అలా ఉన్నావు? ముఖం అంతా..."

స్నేహితుని ప్రశ్న సంకటితో ఆపి, "ఏమీ లేదు..." అన్నది.

తన్ను షికారుకు వెళ్లనీయకుండా, అలా నిర్జీవప్రతిమలా ఎందుకు కూర్చొనివుందో అతనికర్థంకాక, "ఇంటిదగ్గరనుంచి ఏమైనా ఉత్తరం వచ్చిందా? అంతా కులాసా?" అని అడిగాడు.

"ఎబ్బే...ఏం లేదు," అంది.

"నీముఖం ఎప్పుడైనా ఇలా ఉందా?"

"నువ్వు కనికని ఇదివరకే చెప్పావుగా..."

"ఏదో మాట్లాడబోయి ఆగావు?" అన్నాడు.

ఆమె జవాబు చెప్పలేదు. తన పెదవుల్లోంచి భర్తఆదేశం వినబడగానే అతనేమనుకుంటాడు? వెనకనుంచి ఎవ్వరో కత్తితో పొడిచినట్టయి, దైన్యంతో ఘూర్ణిల్లుతాడు. ఆమెపెదవులు కదిలినయ్. కాని మాటలు వెలువడలేదు. తన్ను వంచకురాలుగా ఎంచి క్షోభపడడూ!

అతన్ని దహించివేసే పరాభవాగ్ని, ముందు తన చుట్టూ కొరుచిచ్చులా జ్వాలాచక్రమై ప్రజ్వలిస్తోంది.

అసలు తా నతన్ని ఇంటిలో ఉండమని ఎందు కంది?

రెండురోజులయాక శివరావు అదీఇదీ మాట్లాడి, "అతనికి గది కుదిరిందా?" అని అడిగాడు.

"ఇంకా నేను చెప్పందే" అంది రాధ.

"చెప్పు మరి...ఇప్పటినుంచీ ప్రయత్నిస్తేగాని దొరకదు."

౫

మర్నాడు శివరావును కంపెనీ పెద్దఆఫీసుకు రమ్మని ఉత్తరం వచ్చింది. అత నార్రాత్రే బయల్దేరి వెళ్తూ భార్య నడిగాడు:

"వంట్లో బాగుండకపోతే డాక్టరుకు చూపించుకో" అని.

"ఏమక్కర్లేదు...మీరు వెంటనే వచ్చెయ్యండి.. పట్నంగదా అని అక్కడ పదిరోజు లుండక."

భర్త వెళ్ళిపోయాడు.

౬

గదికిటికీలోంచి చంద్రకిరణాలు పడుతున్నయ్. మోహన్ డ్రాయరుమీద అద్దం పక్కకు తీశాడు. సూటిగా చంద్రకిరణాలు పడుతున్న ఫోటో అతని అపాదమస్తకాన్ని హర్షంతో, ఉద్రేకంతో నింపింది. ఫొటోను చూసి పరవశు డయాడు. సజీవప్రాణే ఇక్కడ ఉంది.

రాత్రి పడుకోటానికి డాబాపైకి పోతూ, గదిలో ఇంకా కూర్చొనివున్న మిత్రుడిని చూసి, "ఏమిటి ఆలోచిస్తున్నావ్?" అంది రాధ.

"ఏమీ లేదు" అంటూ అద్దాన్ని ఫోటో కెదురుగా పెట్టి, స్విచ్ వేసి, మోహన్ మెల్లగా డాబాపైకి వెళ్లాడు.

తమ వూరు, తమ బాల్యంగురించి కబుర్లు చెప్పుకుంటున్నారు. రాధ తనముందు కూర్చొని ఇలా స్మృతిమాధుర్యంతో హృదయాన్ని నింపుకుంటే, అత నుల్లాసంతో ఉప్పొంగిపోయాడు.

మధ్యమధ్య రాధ ఏదో చెప్పాలన్నట్టు ఆమె కళ్లల్లో గోచరించేది. పెదవులు మెదిలేవి.

అత నడిగాడు:

"ఏం రాధా! ఏదో మాట్లాడాలనుకొని, మళ్లీ మూగగా ఉంటున్నావు?"

ఆమె ఏం జవా బివ్వలేదు.

"నేనేమైనా నీ మనస్సుకు నొప్పి కలిగించానా? నేనేమన్నా అన్నానా?"

ఆమెహృదయం స్పందించింది.

"ఛా...నువ్వు నన్ను అనటమేమిటి?"

రాధమనస్సు దుఃఖంతో దుర్బలమైంది. ఈ పండువెన్నెల్లో, చల్లనిగాలిలో, బాల్యదినాల మధుర స్మృతులమధ్య భర్తఆదేశం తాను వినిపించలేక పోయింది. అవమానాభిమానాలు ఆమెకర్తవ్యాని కడ్డు తగులుతున్నయ్.

మనస్సును కుదుటపరచుకొని, కాసే పయాక సంతోషంతో ఆమె కబుర్లుచెప్పతోంది. చంద్రుని మీదనుంచి చిన్న మబ్బు ఒకటి కదిలిపోగా, అతని ముఖం వికలంకావటం ఆమె చూడలేదు.

అత నేదో కథ చెప్తున్నాడు. రాధకళ్లు నిద్రతో బరువెక్కటం చూసి, "ఇక పడుకో" అని చెప్పి, మెట్లు దిగి వెళ్లిపోయాడు.

గదిలో ప్రవేశించాడు. చీకట్లో చంద్రకిరణాల అస్పష్టకాంతి స్నేహితురాలిపై పడుతోంది. అతని వేళ్లకు తగిలి, ఫోటో కిందపడ్డది. వంగి ఆ ఫోటోను పైకెత్తగానే అతనిగుండె జలదరించింది. యౌవనంలో ఉన్న రాధను చీకట్లో స్పృశించి చకితుడైనట్టుంది. డ్రాయరుమీద ఎదురుగుండా ఫోటోను పెట్టాడు. బాలరాధయొక్క విశాలనేత్రాల్లో రాధయౌవనం స్ఫురించి, అతని హృదయంలో ఝుంఝూమారుతం వీచింది. ఎన్ని నాళ్లు...ఎన్ని ఏళ్లు తన కీ రేయి జాగరణ...

నిద్రాణమైన నిశీథంలో అతను జాగ్రుతుడై ఉన్నాడు. అంతరాత్మయొక్క ప్రార్థనామందిరంలో కోరికలన్నీ శేగంటలై మోగి, మారుమోగుతున్నయ్.

అతనికి నిద్రపట్టలేదు.

తా నీవూరు వస్తున్నప్పుడు అనుకున్నాడు. ఏ రహస్యనిశిరాత్రో రాధహృదయద్వారంవద్ద నిలబడి తన ఏకైకప్రార్థన వినిపించాలని.

రాధకు, తనకు మధ్య ఈఇల్లు, మెట్లు యజమాని దుర్విధి లేవనెత్తిన కోటగోడలు. దుర్విధియొక్క ప్రసన్నతకై ఎంతకాల మీ ప్రతీక్ష? అతని హృదయంలో ఉద్రేకపారవశ్యాలు జలప్రవాహములమధ్య మేఘమిద్దెలను మట్టంచేసే తుపానుహోరుతో ఉద్ధృతమైన సముద్రతరంగాలవలె ఘోష చేస్తున్నయ్.

గదితలుపులు దగ్గరకు వేసి, మెల్లగా మెట్లెక్కి డాబాపైకి వెళ్లాడు. హృద్వేగంతో కంపిస్తూ, డాబాపై నుంచున్నాడు.

ఆకాశం చంద్రకాంతితో తెల్లని పాలసముద్రంలా ఉంది. కోటానుకోట్ల నక్షత్రాలు వెన్నెల పువ్వుల్లా ఉన్నయ్. కిందనుంచి పూల సువాసన చల్లగాలిలో వ్యాపిస్తోంది.

అతని హృదయం ఆందోళనతో, ఆవేశంతో తడబడుతోంది.

విభావరి వేసిన వెన్నెలపందిరికింద, దేవతల మానాశీర్వాదాలమధ్య భగ్నహృదయుడైన ప్రేమికుడు ఉల్లాసంతో, వాంఛామధువుతో పరవశుడై ఉన్మత్తుడయాడు.

చల్లని పిల్లగాలులకు రాధముంగురులు నుదుటిపై అటూఇటూ కదులుతున్నయ్. గాఢనిద్రలో వుంది రాధ. చంద్రబింబానికి ప్రతిబింబంగా వుంది ఆమెముఖం. నల్లని మబ్బులా జుట్టు దిండుపై వ్యాపించింది.

మనస్సు సాద్రిక్తపరుస్తున్న రహస్యనిశిరాత్రిలో, బాల్యస్నేహితురాలి సాన్నిధ్యంలో, భూమ్యాకాశాలు అతనికి పాదాక్రాంతమైనట్టుంది. ఇన్నేళ్ల నరకయాతనతో అంధకారంయొక్క అంచున నిలబడి ప్రతీక్షిస్తున్న తన నేత్రాంచలాలు ఉషస్సుతో వెలుగు నిండి, హర్షపూరితమైనయ్.

చంద్రబింబంపై పెద్దమబ్బు అడ్డువచ్చింది. రాధ ముఖంపై చీకటినీడ పడ్డది.

తన కంపితహస్తం రాధముఖాన్ని తాకగానే, మోహన్‌గుండె జలదరించింది. తన చేతులు ఆమెచేతులకు తగలగానే నరాల్లో తోకతొక్కిన తాచుపాములు పడగలెత్తి, బుసకొట్టినై. అత్యంతావేశం, కళ్లెం తెగి, పరవళ్లు తొక్కుతున్న పందెపుగుర్రంలా ఉంది. అతని కళ్లలో చీకటి చుట్టలు చుట్టుకుంటున్నట్టుంది.

హఠాత్తుగా ఉలిక్కిపడి లేచింది రాధ. మోహన్ తన జుట్టును ముఖంమీంచి పక్కకు తీస్తున్నాడు. అతని ముఖం పండువెన్నెల్లో కారుమబ్బులా ఉంది. ఆ కళ్లు మోహన్‌కళ్లు కావు... తోడేలుకళ్లు...అతను కళ్లెత్తి తనకేసి చూడగా, వాటిలోంచి మెరుపులు నిప్పుతీగలై మెరిసినట్టయింది.

హంతకుడా కళ్లలో నల్లని ముసుగేసుకొని, తనయెదుట నిలబడ్డట్టుంది.

"మో...హన్...?" అనిమటుకు తడబడుతూ ఉద్రేకంతో అంది.

గులాబిపువ్వును తుంపబోగా, ముల్లు గుండెకు గుచ్చుకొని, నెత్తురు చిందినట్టయింది అతనికి. తల వాలింది.

భయభ్రాంతులతో కళవళపడుతున్నయ్ రాధ కళ్లు. తలెత్తి స్నేహితురాలిని చూశాడు. భీతితో ఆమె ముఖం పోలికలేకుండా పోయింది. చిన్ననాటి చెలికాడైన తన్ను చూసి, విషపుపురుగును చూసినట్టు కంపిస్తోంది. అతని హృదయం దహించుకుపోయింది. తన స్పర్శ వెచ్చెలికి వజ్రాఘాతమైంది. ఝంఝామారుతంలో రెపరెపలాడుతున్న దీపంలా ఉంది రాధ.

అశ్రుపూరితమైన రాధనేత్రాలు చూడగానే అతనికి స్వాస్థ్యం తప్పింది. గొంతుక ఏదో సవరించుకున్నాడు. కాని మాట పెగలలేదు. తొట్రుపడి చాప చట్టున కూలబోయి, ఎలాగో తెప్పరిల్లుకొని, వాలిన తలతో మెట్లు దిగుతున్నాడు.

జేలలో పారుకుపోయిన రాధకు 'ఘొమ్మని' శబ్దం వినిపించింది. బరువుగా, ఏనుగుపాదాల్లా అడుగులు వేసుకుంటూ పిట్టగోడ కానుకొని చూసింది.

కింద చీకటిలోంచి మెల్లగా మెట్లపైనుంచి లేచి, గోడకు కొట్టుకొని మోహన్ తాగినవానిలా ఇంట్లోకి వెళ్తున్నాడు.

రాధకు జ్వాలలమధ్య నుంచున్నట్టుంది.

తలుపుల చప్పుడయింది... రోడ్డుమీద ఒక నల్లని నీడై కదిలిపోతున్నాడు బాల్యమిత్రుడు. రాధ కంఠం దుఃఖావేశాలతో బిగుసుకుపోయింది. ఏదో నాటకంలో భయంకరఘట్టంమధ్య హఠాత్తుగా తెరలు దింపినట్టుంది. ఎవ్వడో గూనివాడు, భయంకరవికారాకారంతో ఆ కారుచీకట్లో మబ్బులా కదిలిపోతున్నట్టు తోచింది రాధకు. తూలుతూ మంచంలో కూలబడ్డది. భర్త తలపుకు రాగానే, మరణశయ్యమీద ఉన్నట్టుంది.

౧౦

ఊరినుంచి వచ్చి భర్త అడిగాడు—

"గది దొరికిందా అతనికి ?"

రాధ వినబడనట్టు ఊరుకుంది.

"క్రొత్తగదిలో ప్రవేశించాడా ?" అని మళ్లీ అడిగాడు.

"ఉద్యోగానికి రాజీనామా నిచ్చాట్ట." అంది రాధ.

"అదేమిటి ? మళ్లీ ఈరోజుల్లో ఉద్యోగం ?"

కాసేపు మౌనంగా ఉండి రాధ అంది—

"మన ఊరినుంచికూడా వెళ్లిపోయాడు."

అతని గుండె చివుక్కుమంది.

# ఆంధ్రశిల్ప దర్పణము

## కార్లీ-నాసిక్-కన్హరీగుహలలోని శిల్పవిశేషములు

●

శ్రీ ఆమంచర్ల గోపాలరావు

(గతసంచిక తరువాయి)

బొంబాయిపూనాప్రాంతములకు మధ్యన కార్లీగుహ ఉన్నది. ఇది ఒక చైత్యగుహ. అనగా దేవాలయములు, చర్చీలవలె ఇది ఒక ఆరాధన స్థలము. ఈ గుహానిర్మాణకాలమును తెల్పు శాసనము లిందు లేవు. అయినను శైలి, తదితరఅంశముల ననుసరించి, క్రీస్తుకు దాదాపు ఏబదిసంవత్సరములకు పూర్వము ఈ గుహానిర్మాణమని పండితులు నిర్ణయించిరి. ఆకాలమున ఆప్రదేశమంతయు ఆంధ్రశాతకర్ణి రాజుల ఏలుబడిన ఉన్నట్లు చరిత్రాంశము. ఇంతే కాక ఈ గుహయందు స్తంభపోధికలందు ఏర్పడిన శిల్పములు సంపూర్ణ ఆంధ్రశైలిని అనుసరించినవి. ఈ గుహ నిస్సందేహముగ ఆంధ్రకళాభాగమే కాని వేరు కాదు.

శిల్పమున సాంచీతోరణములందువలెనే వాస్తువందు ఆంధ్రశిల్పులు కార్లీగుహానిర్మాణమందు నూతన రూపములకును, నవ్యభావములకును దారితీసిరి. సాంచీ తోరణశిల్పములవలె, కార్లీగుహయందు వాస్తులావణ్యగతులు ఆంధ్రశిల్పకరములనుంచి పొందినది. ఈ మహా చైత్యగుహను గూర్చి, ఫెర్గూసనుమహాశయుడు వచించిన కొన్ని వాక్యములను ఇచట ఉదాహరింపదగును. "ఈ చైత్యగుహ ఇటువంటి గుహ లన్నిటికంటె అందమున అతిశయించినది. మనము ఎరిగినంతవరకు, హిందూ దేశమందలి చైత్యగుహలన్నిటికంటె అతివిశాలమయి, ఈ గుహ పూర్ణస్వరూపమును కలిగియున్నది. అంతకు పూర్వము నిర్మాణమయిన సర్వవాస్తులోపములు ఈ గుహయందు సవరణఅయినవి. నట్టింటి (*Nave*) స్తంభములు ఒకవైపునకు వాలక, నిటారుగా ఏర్పడియున్నవి. గుహాపురోభాగమం దేర్పడిన అంగణకుడ్యము శిల్పములచే అలంకృతమయినది. ఈ కుడ్యము ఈ స్థానము నలంకరించుట ఇదే ప్రథమము. అయినప్పటికిని, ఏ యితరచైత్యమందలి అంగణకుడ్యమునకును తీసిపోని ఉత్కృష్టరూపమున ఈ కుడ్య మేర్పడియున్నది."

ఘనీభవించిన సంప్రదాయములనుంచి బయల్పడుటకయి, స్వేచ్ఛానువర్తిన ఆంధ్రశిల్పులు చేసిన ప్రబలప్రయత్నములు వాస్తువందుకూడ ఆనాడు కలవని ఈ చైత్యగుహ ప్రబలదృష్టాంతము. వాస్తువునకు లావణ్యాంగములు పొదుపుటయేకాక, స్తంభమునకు ఒక నూతనస్థిరరూపమును కల్పించి, అనేక స్తంభనవ్యరూపములకు ఒకపంథా ఏర్పరచి, మన దేశమందు సర్వవాస్తుపరివృద్ధికొరకు, ఈ గుహయందు ఆంధ్రశిల్పులు ఒక పెద్ద త్రోవను ఏర్పరచిరి.

ఈగుహానిర్మాణక్రమము ప్రాచీనక్రైస్తవచర్చీలను పోలియున్నదని పాశ్చాత్యవక్తల నిర్వచనము. కాని క్రీస్తుకుపూర్వమే నిర్మితమయిన ఈ చైత్యగుహ క్రీస్తుకు కొన్నిశతాబ్దముల అనంతరము నిర్మాణమందిన చర్చీలను పోలియున్నదను వచనము చాల వింతగాను, హాస్యాస్పదముగాను తోపకతప్పదు. నిజముగా తొలి పాశ్చాత్యులు ప్రాచీనచర్చీలను బౌద్ధచైత్యనిర్మాణక్రమమును అనుసరించి నిర్మించిన మాట వాస్తవము. అనేకక్రైస్తవసంప్రదాయములు బౌద్ధసంప్రదాయములను అనుసరించినవని పాశ్చాత్యవక్తలే నిర్వచించిరి. అదేరీతిన చర్చీల నిర్మాణక్రమముసయితము బౌద్ధచైత్య సంప్రదాయమును అనుసరించినది.

కార్లీ చైత్యగుహ అంతర్భాగము దాదాపు, ౧౨౪ అడుగుల పొడవయి, ౪౬ అడుగుల వెడల్పున, ౪౫ అడుగుల ఎత్తున నిర్మితమయినది. నట్టిభాగము (నట్టి జరుగుభాగము. నట్టి అనగా బౌద్ధమతచార్యము *Nave*) దాదాపు ౨౬ అడుగుల వెడల్పయి, అర్ధ చంద్రాకారప్రచ్ఛాదనమును కలిగియున్నది. ఈ నట్టి భాగమునకు ఇరువయిపుల పదిఅడుగుల వెడల్పున పార్శ్వభాగములు ఏర్పడిఉన్నవి. నట్టింటికి ఇరువయి పుల ఒక్కొక్క-శ్రేణిస్తంభములు కలవు. ఈ స్తంభ శ్రేణులు ఒక్కొక్కటి ౧౫ స్తంభములు కలిగి, నట్టిం టిని, పార్శ్వభాగములను వేరుపరచుచున్నవి. నట్టింటి చివర ఒకరాతి స్తూపము మలిచియున్నది. ఈ స్తూప మునకు వెనకభాగమందు కొలదిమూరమున కుడ్యము వర్తులాకారమున ఏర్పడిఉన్నది. ఈకుడ్యమునకును, స్తూపమునకును మధ్యగా ఒక అర్ధచంద్రాకారశ్రేణి యందు ఏడు అష్టకోణస్తంభములు ప్రచ్ఛాదనమును ధరించుచు నిలచియున్నవి. ఈ స్తంభములు నట్టి అష్ట కోణకంబములు. నట్టింటికప్పును ఆనాడు అలంకరిం చిన కలపవాసములు ఇంకను నిలచిఉన్నవి. ఈకప్పు సరిగా నట్టింటికి ప్రక్కలందు వరుసగా నిలచియున్న స్తంభములపై నుంచి లేదు. కొంతవర కిది నూటిగా పైకి పోయి, తరువాత వంపు తిరిగి, ఎత్తును ఇనుమడించు కొనురీతిన నిర్మితమయినది.

ఆనాటికి ఈపద్ధతిన రాతికట్టుకట్టడములందు వాస్తుక్రమము ఏర్పడలేదని, ఈ వాస్తురూపము ఆనాడు దేశమున పరిపాటిఅయిఉన్న కలపనిర్మాణక్రమమును అనుసరించి శిల్పులు ఈగుహను మలిచిరని ఫెర్గూసన్ మహాశయుడు అనెను. నిజముగకూడ అటులనే అయి ఉండవచ్చును. ఏలనన అనాదినుంచి మన దేశశిల్పులు నూతనవాస్తురూపములను పరీక్షించుటకు, ప్రథమమున రాతియందు తొలిచిచూచు అలవాటు ఉండెడిదని, ఈ నాటికిని నిలచియున్న అనేక రాతిగుహలవలన తెలియు చున్నది. మన దేశశిల్పులకీఅలవాటు నిజముగ, పల్ల వులు మహాబలిపురమందు రథములు మలచినంతవరకు, అనగా క్రీస్తుశతర్వాత ఆరుఏడుశతాబ్దములవరకు ఉండెడిదని ఆరథములు, తర్వాతతద్వాస్తురూపములను అనుసరించి వృద్ధిచెందిన ద్రావిడవాస్తుప్రదర్శనము లయిన మహాలయములే తార్కాణము. ఈ కార్లీగుహ కూడ ఈరీతినే నూతనవాస్తురూపములను సందర్శిం చుటకు ఆంధ్రశిల్పులు ఆనాడు మలిచి రనుటకు సం దేహములేదు.

కార్లీ చైత్యమునకు వెనుకభాగమం దేర్పడిన పూజావస్తువయిన స్తూపస్థానముననే తరువాత కొన్ని శతాబ్దములకు నిర్మించిన చర్చిలందు క్రైస్తవులు తమ



బౌద్ధప్రాకారము రీతి.

ఆరాధనస్థలము (*Alter*) నేర్పరచిరి. కార్లీచైత్యమందు స్తూపపీఠము వర్తులమయి, పైఅంచునమాత్రము బౌద్ధ ప్రాకారమురీతిన అలంకారయుతముగా మలిచి యున్నది. ఈస్తూపశిరస్సుపయిన ఆనాడు నిలిపిన కొయ్యఛత్రము, కొంత శిథిలమయినను, ఈనాటివరకును నిలిచియే యున్నది. ఈ ఛత్రప్రచ్ఛాదనము క్రిందిముఖ మును పద్మమువలె అతిఇంపుగా ఆనాటి శిల్పులు మలిచినట్లు స్పష్టముగా తెలియుచున్నది.

సముముగా స్తూపమునకు ఎదురున చైత్య సింహద్వారము ఏర్పడియున్నది. ఈ సింహద్వారము నకు ఇరుప్రక్కల రెండు ఉపద్వారములు, సరిగా చైత్యపార్శ్వభాగములకు ఎదురుగా నిలిచిఉన్నవి. ఈ ద్వారము లన్నిటికి పైన ఒక పెద్ద గవాక్షము కలదు. ఈ గవాక్షముయొక్క వాస్తురూపము చైత్య స్తూపపు రూపురేఖ ననుసరించియుండును. అందుచేత వాస్తువిమర్శకులందరు దీనిని చైత్యరూపగవాక్షమని ఈనాడు అనుట పరిపాటి అయినది. చైత్యమునకు వెలుతురు ఈ గవాక్షముగుండ ప్రసరించును. ఈ వెలుగు చైత్యగర్భమందున్న స్తూపముపైనమాత్రమే పడి చైత్య

పార్శ్వమునం దున్న గోడలుసయితము నీడనపడి, సరిగా కానరాక, ఉపాసకునికి పూజావస్తువయిన స్తూపముపైన ఒక గురిని ఏర్పరుచగలదు. చైత్యభావ మును సరిగా గుర్తెరిగి, తదనుసారితముగా నిర్మాణ



చైత్యరూపగవాక్షరూపము.

మందిన ఉత్కృష్టవాస్తురూపము ఈ చైత్యము అను టకు ఏ సందేహమూ లేదు. ఆనాడు శిల్పులు ఈ గవాక్ష మును ఒక కలుపచట్టముతో అలంకరించిరి. ఈ చట్ట భాగము శిథిలమయినను నేడు కానవచ్చును. కాని ఈ చట్టము పలుమార్లు మార్చియుండిరని పండితాభి ప్రాయము.

ఈ గవాక్షముక్రింద ద్వారములకు మధ్యన ఏర్పడియున్న అంగణపశ్చిముఖమునే బుద్ధరూపశిల్ప ములు కలవు. ఈ శిల్పములు మహాయానగతి ననుకరించుటచేత, చైత్యనిర్మాణమయినతర్వాత దాదాపు రెండువందల సంవత్సరములకు రచనలయినవని పండి తాభిప్రాయము. ఈ శిల్పములక్రింద, క్రీస్తుకు తర్వాత నూటఏబదిసంవత్సరములకు ఏలిన ఆంధ్రరాజు పుల మావికి చెందిన శాసనము కలదు. నిజముగా ఈ శిల్ప ములు అంతే గమనింపదగనివయినను, ఇవికూడ ఆంధ్ర శిల్పములే నని ఎరుగవలెను.

ఈ చైత్యగుహకు ముందు ఏర్పడిన అంగణము ౫౦ అడుగుల వెడల్పయి, చైత్యగుహకన్న పెద్దదిగా కానుపించును. ఈ అంగణము ౧౫ అడుగుల లోతున మలిచియున్నది. అంగణమునకు ముందుభాగమును రెండు అష్టకోణస్తంభములు అలంకరించును. ఇవి చాల ఘన మయినవి. ఈ స్తంభములపైని అడ్డపట్టిక చాల పెద్ద ల్పయినది. ఇది చాల శిథిలమయి, ఒక పెద్దబండవలె నేడు కాన్పించును. ఈ పట్టికపయిన, మరల ఒక శ్రేణిగ నాలుగు చిన్న స్తంభములను నిలిపి, ఈ స్తంభ ములపై అంగణప్రచ్ఛాదనమును నిలిపిరి. చైత్యరూప



చైత్యరూపము.

గవాక్షముగుండా చైత్యములోనికి ప్రసరించు వెలుగు ఈ పై స్తంభములమధ్యనుంచి వెళ్లవలసియున్నది. ఈ గుహాంగణమందు కలుపచే నిర్మితమయిన ఒక ఉప ప్రచ్ఛాదనము మధ్యగా ఉండెడిదని తెలియుచున్నది. అంగణముఖమంతయు నాడు కలుపతో అలంకరించి యుండిరను సూచనలు నేడు స్పష్టముగ కాన వచ్చును.

ఈ గుహకు ఎదురుగా ఎడమవైపున షోడశకోణ ముల ధ్వజస్తంభ మొకటి కలదు. ఇది అశోక స్తంభ మును పోలియున్నది. ఈ స్తంభశిరోభాగమున నాలుగు సింహములు మలిచియున్నవి. కుడివైపున ఒక చిన్న దేవీమందిరము కలదు. ఈ మందిరమున ఇప్పటికూడ పూజలు జరుగుచున్నవి. ప్రస్తుతము దేవి యున్న స్థాన మున రెండవ ధ్వజస్తంభ మొకటి ఉండియుండవలెనని పండితుల ఊహ. ఎందుకన, అనేకఇతరచోట్లను, ఎల్లోరాకైలాసగుహయందుసయితము, ఇరువైపుల ధ్వజస్తంభములు కానవచ్చును. ధ్వజస్తంభశిరోభాగ మున ఉన్న సింహములు ఒక పెద్ద ధర్మచక్రమును ధరించుచుండి ఉండవలెననికూడ పండితుల ఊహయే.

కార్లీగుహయందు ఆంధ్రశిల్పుల ప్రకృష్ట నవ్యవాస్తుగతులు తప్పక గమనింపదగినవి. అంగణ కుడ్యస్థానవిర్ణయమే ఒక నూతనవాస్తుగతి యని ఫెర్గూ

సనుమహోళయు దన్న వాక్యమును ఇంతకు ముందే ఉదాహరించడమయినది. అంతకుపూర్వము నిర్మాణమందిన చైత్యగుహాలందు, అంగణమున వరాండా కానము. చైత్యరూపగవాక్షముక్రిందనో, లేక చైత్యరూపతోరణముక్రిందనో, సింహద్వారము, చైత్యముఖకుడ్యమునందే ఏర్పడి, చైత్యమంతయు ఏక భాగముగనే కనుపించును. కాని గృహాంగణమునకు ముందు భాగమున వరాండా ఒకటి ఏర్పరచుట అతిముఖ్యమయిన ఆంధ్రవాస్తువిశేషము. ఈ వరాండాభావము ఆతిథ్యము. కార్లీగుహకు పూర్వము నిర్మితములయిన బేడ్సా, భాజ, నాసిక మొదలయిన గుహాలందు ఈ వాస్తువిశేషము కానము. ఆతిథ్యమనునది ఆంధ్రుని ప్రధానగుణము. నేటికిని, ఏ ఆంధ్రగ్రామమునకయినను, నడిరాత్రిసయితము ప్రయాణము నొనర్చు పథికుడు, విశ్రాంతికొరకు యోచింపనక్కరలేదు. ఏ వరాండాయందైనను అరుగులమీద నతడు శయనింపవచ్చును. ఈ దివ్యవాస్తుభావము అనాదినుంచి నిజముగ ఆంధ్రప్రత్యేకత అనియే చెప్పవలయును. ఈ వాస్తురూపము ఇతర ప్రాంతములకు సామాన్యము కాదు. ప్రథమమున పవిత్రస్థలమయిన చైత్యగృహమున కుండవలసిన రక్షణభావమునుసయితము గుర్తించి, కార్లీగుహాలయమున ఈ వరాండావాస్తురూపమునుసయితము ఆంధ్రశిల్పియే కల్పించెను.

కార్లీగుహాయందు విదితమయిన వాస్తుప్రదర్శనము చైత్యాంతర్భాగమున స్తంభములందు కానవగును. ఈ స్తంభరూపములందు సయితము ఆంధ్రశిల్పులు ఒక ప్రత్యేకసృష్టి యొనర్చిరి. ఈ గుహాయందు ముప్పది పూర్ణస్తంభములు కలవు. సింహద్వారముకడ నిలిచియున్న మొదటి నాలుగు స్తంభములు కొలదిగా భేదించినవి. వీటి శిరస్సులపయిన ఒక చిన్న ఉపప్రచ్ఛాదనము ఏర్పడియున్నది. ఈ ఉపప్రచ్ఛాదనము మహాగవాక్షముగుండ ప్రసరించు వెలుగు చైత్యమంతయు ప్రసరింపనీయక సరిగా చైత్యస్తూపము మీదనే వాలునట్లు చేయగలిగియున్నది. ఈ ప్రచ్ఛాదనముపయిన ఆనాడు నట్టి జరుగుసమయమున తగురీతిన గీతవాద్యములు ప్రయోగించుచుండెడివారు.

కార్లీగుహాచైత్యము నిర్మించుటకు పూర్వము నిర్మితమయిన గుహాలన్నిటియందును స్తంభములు పట్టి చతురస్రములుగా, ఏటవాలుగా ఏర్పరచిరి. దీనికి కారణము, ఆ గుహాల వాస్తుక్రమమంతయు, ఆనాడు శిల్ప మెరిగిన హర్మ్యశ్రీవాస్తువు ననుసరించినది. హర్మ్యశ్రీము ఆనాడు కొయ్యచట్టములతోను, ఇటుకలతోను నిర్మించెడివారు. కొయ్యచట్టములపైన ఆధారపడిన అర్ధవలయప్రచ్ఛాదనములు నిలుపుటకు, మోటించిన ఏటవాలు కంబములు అవసరమయినవి. కాని సంపూర్ణశిలామయమయిన చైత్యగుహాలందు ఈ ఏటవాలు స్తంభములకు అవసరము లేదు. అందుచేత గుహాలందు ఏటవాలు స్తంభములు ఇమడక, అతివికృతముగా కూడ గోచరించును. స్వేచ్ఛావర్తులయిన ఆంధ్రశిల్పులు, ఈ అంశమును రాతిగుహాలను నిర్మించుటకు గడగినంతనే గుర్తించిరి. రాతిశిల్పములందు శిలానుసారిరూపములందే వాస్తు నేర్పడవలయును. ఇది వాస్తువునందు ఒక ప్రధానలయవిశేషము. నిటారు స్తంభములను, ప్రథమమున, ఆంధ్రశిల్పులు కార్లీగుహాయందు మలిచి, శిలావాస్తువునందు ఒక ప్రధానలయాంశమును ప్రదర్శించిరి.

ఇంతేకాక, ఈ స్తంభరూపము శిలావాస్తువునకు అవసరమగు పుష్టి కలిగి, నవ్యవాస్తురూపములకు ఒక దారి కల్పించినది. అంతకుపూర్వము మలిచిన గుహాలందు ఏటవాలు స్తంభము లన్నియు పట్టి చతురస్రములు. ఈ స్తంభములకు శిరస్సు, పీఠము మొదలయిన రూపభాగములు ఏర్పరచుట అసాధ్యము. అందుచేత, ఆరీతిన కలప వాస్తుక్రమములను అనుసరించిన గుహాలందు కాని, ఇతరహర్మ్యశ్రీములందు కాని పూర్ణస్వరూప స్తంభములను నిర్మించుటకు వీలు లేకపోయినది. అయినప్పటికిని మన దేశమందు ఆదినుంచి ఈ స్తంభవాస్తురూపములకొరకు శిల్పులు చాల కృషి ఒనర్చిన మాట నిజము. ప్రథమమున విడిగా నిర్మించిన అశోకస్తంభములందు శిరస్సు పూర్ణముగ ఏర్పరచి ఒక రూపము ఏర్పరచిరి. తర్వాత భారతప్రాకారశిల్పములందును, సాంచీతోరణశిల్పములందును ఈ స్తంభరూపములు కానవచ్చును. వీటన్నిటికి శిరోభాగము



కార్లీ గుహాయందలి నిర్మాణక్రమము.

చక్కగానే అమరియున్నది. పీఠాధిష్ఠానభాగములు కానరావు. ఇవన్నియు, కలపవాస్తురూపానుసారితములే అయినందున, శిలావాస్తుక్రమమందు ఏర్పడగల అన్ని అంగములు ఆ స్తంభరూపములందు ఏర్పడలేదు. కాని కటకుక్కగుహలలో, అనంతగుహయందు శిల్పిఅంతర్యమున రూపొందిన స్తంభరూపము గోడన మలిచిరి. ఈ గుహాశిల్పములు బహుశ భారతస్తూపప్రాకారశిల్పములకు కొలదికాలము పూర్వమే అయియుండవచ్చును. ఇచట విదితమయిన స్తంభరూపము సంపూర్ణమయినది. ఒక త్రిఫలకపీఠముపయిన కుంభము నుంచి, కుంభములో నుంచి నిటారుగా ఒక చతురశ్రకంబమును నిలిపి, దానిపయిన ఒక పద్మము నుంచి, పద్మముమీద ఒక పేటికను నిలిపి, శిలావాస్తువునకు తగిన స్వరూపమున, స్తంభరూపమును సూచించిరి. కుంభజనితమయి వెలువడు ఈకంబము పూర్తిగా చిత్రపద్మములచే నలంకృతమయినది. ఈ కంబముపై నున్న పద్మపురేకులు ఒకవరుసక్రిందకు వాలి, రెండవవరుసపైకి వికసించుచున్నవి. దీనిపైన నిలిపిన పేటికముఖము మృగచిత్రములచే నలంకృతము. ఈ రూపమును రాతి స్తంభమునకు అవసరమయిన భాగములుగా క్రిందనుంచి వరుసన పీఠము, అధిష్ఠానము, అశ్యము, కుంభము, గ్రీవము, ఫాలకము, బోధికలుగా అన్వయించి, ప్రథమమున పూర్ణస్తంభరూపమును కార్లీగుహయందు ఆంధ్ర శిల్పులు నిర్మించిరి.

నిశ్చయముగా పూర్ణశిలావాస్తువునకు కార్లీగుహ ప్రథమసోపానము. అందుచేత ఇది ఆంధ్రశిల్పమునందే కాక, సర్వహైందవశిల్పమునందుసయితము ఒక ప్రబలస్థానము వహించినది. ఈగుహానిర్మాణానంతరము మన దేశమందు నిర్మితములయిన చైత్యములకును, కొన్ని శతాబ్దములఅనంతరము పాశ్చాత్యదేశములందు నిర్మితములయిన చర్చిలకుసయితము ఆదర్శకవాస్తురూపక్రమములను ప్రదర్శించిన ఈ మహాశిల్పసౌధమును నిర్మించిన ప్రాచీనఆంధ్రశిల్పులు బ్రహ్మతుల్యు లనకతప్పదు.

ఈ మహాచైత్యగుహచుట్టును భిక్షుకగృహములు కలవు. ఇవన్నియుకూడ ఆ కొండన మలిచినవే. వీటియందు శిల్పములు కొన్ని మాత్రము తరువాత చాల

కాలమునకుకూడ రచన లందినవి ఉన్నవి. అయినను వీటియందు గమనింపదగిన విశేషము లేవియును లేవు.

*   *   *   *

నాసిక్ గుహలు నాసిక్కునగరమునకు అయిదు మైళ్ల దూరమున త్రిరశ్మి యను మూడు రాతికొండల యందు ఒక కొండపైన ఉన్నవి. ఈ గుహలందు అను పదు అనేకశాసనముల ననుసరించి, ఇచటి తొలి గుహలు క్రీస్తుపూర్వము దాదాపు ౧౬౦, లేక ౧౩౦ సంవత్సరములనాడు నిర్మితమయిఉండవచ్చునని పండితాభిప్రాయము. శాతవాహనవంశజుడయిన కృష్ణ రాజు ఇచటి ప్రథమవిహారమును నిర్మించినట్లు తెలియు చున్నది.

ఈగుహలు మొత్తముమీద పదునేడు. ఇవన్నియు నిర్మాణమగునప్పటికి క్రీస్తుతర్వాత దాదాపు ఆరు, ఏడుశతాబ్దములు గడచినవి. అందుచేత ఈ ప్రాంతమున ఆంధ్రసామ్రాజ్య మంతరించినతర్వాత, క్షహరాతుల కాలమందు నిర్మితములయిన గుహలు సయితము ఈ వర్గ మందు కలవు.

ఈ గుహలందు ఒకటిమాత్రమే చైత్యగుహ. తక్కిన గుహ లన్నియు విహారగుహ లనియే చెప్పవల యును. విహార మనగా బౌద్ధసన్యాసుల నివాసగృహము. విహారమందు భిక్షుకులు విడిగా ధ్యాన మొనర్చుటకు వేరువేరు గదు లేర్పడి, వారందరు కూడి ధర్మచర్చ లొనరించుటకు ఒకశాలసయితముండును. విహారము నకు, చైత్యమునకు గల భేద మేమన, చైత్యము పట్టి ఆరాధనస్థలము. అందున నివాసమునకు ఏర్పాటు ఉండదు. భిక్షుకగృహముకూడ విహారమునుంచి భేదిం చును. భిక్షుకగృహమందు పరివ్రాజకవర్గము ధర్మచర్చ లొనరించుటకు శాల ఏర్పాటు ఉండదు. పరివ్రాజక సమూహజీవనము భిక్షుకగృహభావము కాదు.

నాసికుగుహలందు కొన్ని గుహల నిర్మాణము పూర్తి కాలేదు. ఇచటి చైత్యగుహ అతిప్రాచీనమయి నది. సాంచీతోరణశిల్పములకు పూర్వమే ఈ గుహ నిర్మాణమయినది. క్రీస్తుపూర్వము దాదాపు ౧౬౦ సంవత్సరములనాడు మొదలయి, పాతికసంవత్సరముల లోగా ఈ గుహను ములిచిరని పండితఫెర్గ్యూసనుగారి అభిప్రాయము. ఈగుహయందలి శాసనములవలన గుహా ముఖమందలి బౌద్ధప్రాకారరూపాలంకారశిల్పము, ద్వారబంధముప్రక్క నిలచియున్న యక్షరూపము నాదసిరి శిల్పినిర్మితములనియు, ఈ చైత్యగృహమును మహాహకిరి మనుమరాలు భట్టపాలిక పూర్తిచేయించె ననియు తెలియుచున్నది. దీనికంటె దాదాపు పది సంవత్సరములకు పూర్వమే నిర్మితమయిన విహారము శాతవాహనవంశజుడయిన కృష్ణరాజనిర్మితము.

చైత్యద్వారబంధము ప్రక్కన నాదసిరి శిల్పి రచించిన యక్షరూపము, శైలి ననుసరించియేమి, వసనాభరణముల ననుసరించియేమి, సంపూర్ణముగ ప్రాచీ నాంధ్రము. ఇంతేకాక చైత్యముఖమందు మహాగవాక్ష మున కిరువైపుల పడగలెత్తియున్న నాగసర్పరూపములు మలచి అలంకరించుచున్నవి. ఈ నాగసర్పాలంకారము ప్రాచీనఆంధ్రశిల్పమునకే ప్రత్యేకమయినది. ప్రబల విషమును ధరించి, సర్వనాశన హేతువయిన నాగసర్ప మందు అందమును చూచి ఆనందించుటకు భయమును బాసి, యోగిసమానుడయిన ఉత్తమకళాకర్తయే కావలయును. నిశ్చయముగ ప్రాచీనాంధ్రకళా కర్త అట్టి మహాయోగి. తత్కారణముననే నాటి సర్వశిల్పు లను అతడు మించెను. ఇతడు నిజసౌందర్యపిపాస కుడు. రంజనయే ప్రధానమయిన పుష్పమందును, బీభత్సము వతిగా ధరించు మహాసమరమందును, సర్వ నాశన మొనరించు నాగసర్పమందును, అతడు అంద మును సమానముగ వీక్షించి ప్రకటించెను. శ్రీ, లేక సిరి అను శబ్దము నామాంకరమున నాటి ఆంధ్రశాతవాహ నులకు ప్రత్యేకమయినది. అందుచేత నాసికుగుహల యందు ఆంధ్రసామ్రాజ్యమునాట ఆంధ్రశిల్పినిర్మిత మనుటకు ఏసందేహము అవసరము లేదు. ఈగుహలందు రూపశిల్పవిశేషములు అంత లేకున్నను, గమనింపదగిన వాస్తుశిల్పపాఠములు కొన్ని కలవు. నాటి ఆంధ్ర శిల్పులు నాసికుగుహలందు సయితము శిల్పపాఠకులయి, గురుశిక్షమునుంచి ఏమాత్రము తొలగలేదు.

నాసికచైత్యగుహాముఖము అతిప్రాచీనరీతిని, కలపనిర్మాణక్రమమును అనుసరించినప్పటికిని, అతి సుందరమయి, మహాద్భుతముగ ఉన్నది. క్రిందిభాగము కొంతవరకుమాత్రము రాతితో నిర్మించి, పైభాగమందు అవసరమయిన అంశములనుమాత్రము ఘనమయిన కలప దూలములచే నిర్మించి, మిగిలిన భాగమంతయు వెదురుఅల్లినవిధముగ ఆ నాటి వాస్తురూపమును తెలియజేయుచు, ఈ గుహాముఖము అత్యద్భుతముగ మలిచియున్నది. ఈ చైత్యగుహకు ఒకటే ద్వారము. ఈ ద్వారబంధము, అలంకారవిశేష మేమియు లేక, సామాన్యముగ అతిప్రాచీనరీతి నే ఉన్నది. దీనిపైన చైత్యరూపగవాక్షమురీతిని ఒక మూరును మలిచిరి. మూరుక్రింద ద్వారబంధఊర్ధ్వ పట్టికకుపైన ఉన్న కుడ్యమును రెండుభాగములోన ర్చిరి. ఇందు క్రిందిభాగము అర్ధచంద్రాకారము. దీనిని అల్లిన తడికవలె అలంకారయుతముగ మలిచిరి. మిగిలిన పైభాగమందు జంతురూపములు మలిచియున్నవి. ద్వారబంధమునకు ఎడమవైపున నాదశ్రీ మలిచిన యక్షరూపము కానవగును. ఈ యక్షరూపమున మస్యన ఎత్తయిన ముడికలిగిన ప్రాచీనఆంధ్రశిలపాగ స్పష్టముగ కానవచ్చును.

సరిగా ద్వారముపైన చైత్యగృహమునకు అవసరమగు వెలుగుకొరకు ఒక పెద్ద చైత్యరూపగవాక్షము కలదు. ఈ గవాక్షముక్రింది అడ్డపట్టికముఖము అలంకారయుతముగా శార్ధప్రాకారరీతిని మలిచియున్నది. ఈ మహాగవాక్షగ్రీవమున కిరువైపుల పైన చెప్పిన నాగ సర్పరూపములు కలవు. ఇంతేకాక, మహాగవాక్షము నకు ఇరువైపుల, గవాక్షశిఖరము చేరునంతవరకు, గుహాముఖమంతయు, శార్ధప్రాకారరూపములు, స్తంభ రూపములు, గవాక్షరూపములు, వెదురుఅల్లికరూప ముతో మిళితమొనర్చి, అతిసొంపున మలిచియున్నవి. ఇందు మలిచిన స్తంభరూపములు, బోధికభాగమున మృగరూపములు కలిగి, భారతస్తూపప్రాకారమందలి స్తంభరూపములను, అశోక స్తంభరూపములను స్మృతికి తెచ్చునవి అయియున్నవి. మహాగవాక్షమునకు అనాడు నిర్మించిన కలపఅలంకారమంతయు శిథిలమయి పోయినది.

ఈగుహా అంతర్భాగమయిన చైత్యగృహము దాదాపు ౩౯ అడుగుల పొడవయి, ౨౨ అడుగుల వెడల్పున నిర్మితమయి, చివరన ౨౩ అడుగుల ఎత్తయిన స్తూపమును కలిగిఉన్నది. నట్టి జరుగు సమయమున గీత వాద్యములకయి, ఒక చిన్న ఉపప్రచ్ఛాదనమును మహా గవాక్షపీఠమునకు సరిగా ఏర్పరచిరి. ఇది నిలుచుట కయి రెండు స్తంభములను ఆశిల్పులు మలిచిరి. ఈ స్తంభద్వయముకాక, మరి మూడు స్తంభములు ఈ చైత్యగృహమందు కలవు. ఈ స్తంభములందు గమనింప వలసిన విశేష మేమన, కార్లీ స్తంభములందువలె, క్రింది భాగమందు పీఠము, అధిష్ఠానము ఏర్పడి, పైభాగ మంతయు అష్టకోణాకారమున ఉన్నది. కాని ఈ స్తంభములకు శిరోభాగము మాత్రము లేదు. స్తంభరూప నిర్ణయముకొరకు ఆంధ్రశిల్పులు ఈగుహానిర్మాణకాలము నాటినుండియు, అనగా కార్లీగుహానిర్మాణమునకు పూర్వము దాదాపు ఒక శతాబ్దమునుంచి కృషి సల్పు చున్నట్లు తెల్లమగుచున్నది. ఈగుహ మలచినతర్వాత, దాదా పొక శతాబ్దమునకే, శిలా స్తంభరూపము కార్లీ గుహయందు, ఆంధ్రశిల్పికరములనుండియే ఒక సంపూర్ణత గైకొన్నది. నిజము!

కళాభావమున ఇక నాసికగుహాలందు చూడదగినవి మూడుమాత్రమే అని చెప్పవచ్చును. ఈగుహాలందలి రూపశిల్పములు, గుహాలు మలిచినఅనంతరము, చాల కాలమునకు అప్పుడప్పుడు చేర్చినవి. వీటియందు గమనింపదగిన శిల్పవిశేషము లేవియు లేవు. అందుచేత ఈ గుహాలందు ఆంధ్రశిల్పగతి వాస్తువునందే పరికింపదగును.

ఈ మూడు నహపాన, యజ్ఞశ్రీ, గౌతమీపుత్రగుహాలు. ఇవన్నియు విహారగుహాలే. ఈ గుహాలందున్న శాసనముల ననుసరించి వీటికి ఈ పేర్లు ఏర్పడినవి. క్రీస్తుకు తర్వాత దాదాపు నూరు సంవత్సరములకు నహపానగుహ, ౧౩౦ సంవత్సరములకు గౌతమపుత్రగుహ, ౧౫౦ సంవత్సరములకు యజ్ఞశ్రీగుహ వరుసగా నిర్మితమయినవి.

ఈగుహాలందలి శాసనములవలన, ఆనాడు నాసిక ప్రదేశమంతయు ధాన్యకటకఆంధ్రరాజుల ఏలుబడిలో నుండి, నాసికనందు వాస మేర్పరచుకొన్న ఆంధ్ర రాజప్రతినిధులచే పాలింపబడుచుండె నని తెలియు చున్నది.

నహపానుని గుహయందు ఆంధ్రరాజప్రతినిధి అయిన నహపానుని కుటుంబమునకు సంబంధించిన ఆరుశాసనములు కలవు. ఈగుహానిర్మాణక్రమము కార్లీ చైత్యగుహానిర్మాణమును అనుసరించినది. ఇది విహార గుహఅయినను, ఆనాటికి దాదాపు నూరు నూటఏబది సంవత్సరములకు పూర్వమే నిర్ణయమయి, సంప్రదాయ పరమయిన చైత్యక్రమమును అనుకరించుట, వాటి ఆంధ్రశిల్పి సహజఅంతర్యస్వేచ్ఛానువర్తిని ప్రకటించును. ఈ విహారగుహసయితము ఒక వాస్తుపరీక్షయే అని మనము తప్పక ఊహించవచ్చును. ఈగుహ దాదాపు ౪౦ అడుగుల పొడవు, అంతే వెడల్పు కలిగి చతుర స్రముగ ఏర్పడినది. దీనియందు, వెనుకకుడ్యమునకు ఆరు, ప్రక్కకుడ్యములకు అయిదు చొప్పున పదునారు విడిగదులు మలిచియున్నవి. ఈగుహాయందు ఆరు స్తంభములు కలవు. ఇవన్నియు కార్లీ స్తంభములవలెనే పూర్ణరూపమును కలిగియున్నవి. ఈ స్తంభములకు క్రింది భాగములయిన పీఠము, అధిష్ఠానము కార్లీయందువలెనే మలిచిరి. గ్రీవముసయితము పేటికయం దుంచిన ఘటము రీతి కార్లీయందువలెనే మలిచియున్నది. కాని శిరోభాగ మయిన బోధికయందుమాత్రము ఒకింత భేదము కాన్పించును. కార్లీ స్తంభముల బోధికలపైనుంచి ప్రచ్ఛాదనము మొదలిడిన ట్లుండును. అచట బోధికసయితము స్తంభభాగమని స్పష్టముగా తోచును. కాని ఇచట ప్రచ్ఛాదనము భరించు దూలపు ట్టిక బోధికగుండా ప్రసరించును. అందుచేత బోధికభాగముగ మలిచిన వృషభరూపములు స్తంభభాగములుగా కన్పడక, స్తంభముపయిన దూలముప్రక్కన విశ్రమించు విడిరూప ములుగా కన్పించును. ఈగుహయందు వెనుకభాగమును పూర్వము అలంకరించుచున్న స్తూపమును ఎవరో శైవశిల్పులు శైవరూపముగ మార్చిరి. ఇదేరీతిన ఈగుహకు అంగణభాగమందుసయితము కుడ్యముఖ మందు ఇరువైపుల ఈశైవరూపములే కాన్పించును.

ప్రాచీనశిల్పములను విరూపమొనరించి, తమ మతానుసారితరూప మొసంగు అవాదిగుణము మన దేశ మందు అనేకదివ్యప్రాచీనశిల్పములు కోలుపోవుటకు ఒక ముఖ్యకారణ మయినది. ఈరీతిన తొలిరూపమును మార్చిన శిల్పములందు, ఏలయకాని, జీవముకాని, శోభ కాని మిగులక, ఆశిల్పపు విలువ పూర్తిగ మాసిపోవును. నిశ్చయముగ ఈ ప్రబలహైందవదుర్గుణకారణముననే భట్టిప్రోలు, గుడివాడప్రాంతములందు నేటికి ఉండ వలసిన అనేకప్రాచీనదివ్యశిల్పములు రూపుమాసిపోయి నవి. నేడుసయితము ఒక శ్రేణిజనులందు ఈదుర్గుణము మాసిపోలేదు. అచ్చటచ్చట ప్రాచీనబౌద్ధజైనశిల్పములు దొరికినంతనే, ఇచ్చవచ్చినరీతి తమ ఇష్టదేవతారూప మున వాని నలంకరించి పూజలు సాగించుట జరుగు చునేయున్నది. మన దేశమందున్న ఈ దుర్గుణమును మాపుటకయి విజ్ఞానులు ఎంతయినను పాటుపడవలసి ఉన్నది.

గౌతమీపుత్రగుహ నహపానుని గుహకన్న కొంచెము పెద్దదయిన విహారము. ఇది నహపానుని గుహతర్వాత దాదాపు ముప్పదిసంవత్సరములకు మలిచిరి. ఈగుహసయితము ౧౬ విడిగదులు కలిగి, చాల వరకు నహపానుని గుహను పోలియున్నది. కాని గుహ నిర్మాణము కార్లీగుహకన్న ఎక్కువ కన్హేరీచైత్య మును పోలినది. ఈగుహ సింహద్వారమును అలంకరించిన శిల్పములు కొలది మెరుగుగా ఉన్నవి. ఈశిల్ప ములశైలి కొంతవరకు సాంచీతోరణశిల్పశైలిని స్మృతికి తెచ్చునదయియున్నది. ద్వారబంధమునకు ఇరువైపుల గోడన అనుస్తంభములు (*Pilasters*) మలిచియున్నవి. అనుస్తంభము లనగా గోడలోనికి పొదిపి, సగముమాత్రమే బయట ఉన్నట్లు అగుపడు స్తంభములు. ఈ అనుస్తంభముల అరుభాగము లొనర్చి ఈభాగములందు ఒక చిత్రమయిన కథను చిత్రించిరి. ఈకథ ఒక స్త్రీని, ఇద్దరు పురుషులను గూర్చినది. కథ చివరిభాగమందు ఆ ఇద్దరియందు ఒక పురుషుడు స్త్రీని ఎత్తుక పారిపోవును. ద్వారబంధముపైన బోధిమంద

స్తూపము, చక్రము మలిచియున్నవి. ఈ ద్వారబంధమునకు ఇరువైపుల ద్వారపాలకులు కానవత్తురు. ఈ ద్వారపాలకులు పూలగుత్తులను పట్టుకొని నిలిచి ఉందురు. ఈ ద్వారపాలకుల రూపములందు మానప్రమాణములు సరిగా ఏర్పడక, ఈశిల్పములు అందముగా కన్పించవు. ఈ ద్వారపాలకుల వసనాభరణములు, తలకట్టు అన్నియు, సర్వప్రాచీనాంధ్రశిల్పములందువలెనే ఏర్పడి, కార్లీ, కన్హారీగుహాశిల్పములందువలెను, అజంతాపదవగుహాయందలి వర్ణచిత్రములందువలెను ఉన్నవి. ప్రాచీనాంధ్రశిల్పులందు ఉత్తమశ్రేణికి చెందిన మహాశిల్పులేకాక, సామాన్యఅధమశ్రేణులకు చెందిన శిల్పులు సయితముండిరనుటకు ఈ శిల్పములు ఒక తార్కాణము.

ఈ గుహాంగణమున ఉన్న వరాండాకు ఆరు స్తంభములు కలవు. ఈ స్తంభశ్రేణికి ఇరువైపుల గోడల నానుకొని రెండు అనుస్తంభములు కలవు. ఈ అనుస్తంభములు శిల్పములచే అతివిరివిగా నలంకృతమయినవి. ఈ వరాండా స్తంభములు నేలనుంచి మొదలిడక ఒక చిన్న అంచుగోడపై నుంచి లేచినవి. అందుచేత స్తంభపుక్రిందిభాగములైన పీఠాధిష్ఠానములు వీటియందు లోపించినవి. ఈ స్తంభముల గ్రీవములు నహపానగుహా స్తంభగ్రీవములను ఒకింత మించినవి. ఈగ్రీవములందు ఘటమును పరివేష్టించిన పేటికకోణములందు కుబ్జరూపములు మలిచియున్నవి. ఈకుబ్జులు స్తంభములకు అతిశయించిన అందమును ఇవ్వక, అతుకులవలె కన్పడి, కల్పన నీరసించిన రీతి కాన్పించును. ఈ స్తంభబోధికలందు వృషభములు, హయములు, స్ఫింక్సులు (*Sphinxes* - అనగా మానవస్త్రీముఖము కలిగిన జంతురూపములు) మొదలయినవి కలవు. నహపానుని గుహాస్తంభములవలెనే బోధికయందు నాలుగు మృగరూపములను మలిచి, ప్రచ్ఛాదనమును ధరించు అడ్డదూలములను బోధికలగుండా ప్రసరింపజేసిరి. ఈ అడ్డదూలపు పట్టికపైన గూడు కొంచెము ముందునకు వచ్చినది. ఈదూరుముఖమంతట బద్ధప్రాకార రూపము అలంకారయుతముగా మలిచియున్నది ఈ స్తంభములకు క్రింద నిర్మితమైన అంచుగోడమీది అలంకారశిల్పము అమరావతీస్తూపప్రాకారశిల్పమును స్మృతికి తెచ్చునదై ఉన్నది. అనాటికి బహుశా ఆంధ్రగర్భమైన అమరావతియందు మహాస్తూపశిల్పముల నిర్మాణము జరుగుచుండియుండవచ్చును. అందుచేత ఉత్తమశ్రేణికి చెందిన ఆంధ్రశిల్పులందరు ఏకముగా అమరావతిదివ్యస్తూప కార్యమునందు నిమగ్నులయి ఉండవచ్చును. అందుచేత అతిదూరమున ఉన్న నాసిక గుహాలను సామాన్యఆంధ్రశిల్పులే మలిచియుండవచ్చునని మనము ఊహింపనగును.

శాతకర్ణిగుహాకూడ ఒక పెద్ద విహారము. ఇది ప్రథమమున నిర్మితమయినతర్వాత, అనేకమార్లు మలిచి, గుహను పొడుగించుటేకాక రూపశిల్పములను సయితము చేర్చిరి. ఈ విహారమందు ఇరువైపుల కుడ్యమునకు ఎనిమిదిచొప్పున పదునారు ఉపగదులు కలవు. ఇవిగాక వెనుకభాగమందు ఒక ఆదిత్యమును తొలిచి, ఆదిత్యమునకు ఎడమవైపున మరిరెండు చిన్న గదులను తొలిచిరి. ఈఉపగదులందు అరుగులుకూడ రాతితో మలిచియున్నవి. విహారగర్భమం దేర్పడిన ఆదిత్యమందిర ద్వారమునకు ఇరువైపుల ౯ అడుగుల ఎత్తయిన ద్వారపాలకుల రూపములు కలవు. ఈ ద్వారపాలకులు చేతులందు తామరపువ్వులను ధరించి, శిరముపైన పెద్ద మకుటములతో కానవచ్చెదరు. ఒక ద్వారపాలకుని ఎదురున చిన్న స్తూపమును, రెండవవాని ఎదురున బుద్ధప్రతిమయు మలిచియున్నవి. ఆదిత్యమందు ౧౦ అడుగుల ఎత్తయిన పెద్ద బుద్ధప్రతిమ కలదు. ఈ బుద్ధరూపము ధర్మచక్రముద్రను ధరించి, పాదములు ఒక పద్మముపై నుంచి, పర్యంకాసనమున నిర్మితమయినది. ఈ బుద్ధగృహమున కిరువైపుల చామరధారు లిద్దరు ద్వారపాలకులరీతినే కానవచ్చెదరు. ఆదిత్యమందలి రూపశిల్పములు క్రీస్తుకు తర్వాత ఏడవశతాబ్దమున నిర్మాణమయినవని పండితాభిప్రాయము. నిశ్చయముగ ఈ శిల్పములందు ఆంధ్రకళాభావమున గమనింపదగిన విశేషము లేవియు లేవు. ఈ గుహాంగణమందున్న వరాండా స్తంభములు కార్లీస్తంభములరీతినే కాన

వచ్చును. ఇది గుహ తొలిని మలచిననాడే నిర్మితమయిన ఆంధ్రకరశిల్పములే అని చెప్పవచ్చును.

ఇచట మిగిలిన గుహలందు కొన్ని శిథిలములయినవి; కొన్ని పూర్తికూడ కాలేదు. తక్కిన గుహలందు గమనింపదగిన వాస్తువిశేషములుకాని, శిల్పవిశేషములుకాని లేవు. పశ్చిమమునుంచి రెండవ గుహయందును, పదునేడవ గుహయందును రూపశిల్పములు కొన్ని కలవు. ఈశిల్పములన్నియు పూర్ణ మహాయానగతి ననుసరించును. వీటియందు ఆంధ్రకళాభావమున గమనింపదగిన విశేషములేవియు మనము కానము.

నిశ్చయముగా నాసికగుహలందు నిజకళాప్రదర్శనమయినవి తొలిమలచిన చైత్యగుహాముఖము, తర్వాత కొంతకాలమునకు మలిచిన నహపానవిహార గుహలుమాత్రమే అని చెప్పవలయును. ఈ అద్భుతశిల్పములు ఆనాటి ఉత్తమ వాస్తురూపములను పూర్తిగ ప్రకటించుచు, మహాశిల్పినిర్మితమేనని చూచినంతనే తోపజేయును. తక్కిన గుహలందు నిజకళాప్రదర్శనము లేదనియే చెప్పవలయును. ఈగుహలందు కల అనేక ప్రాచీనఆంధ్రశాసనములు మాత్రము చరిత్రకారులకు అతిముఖ్యమయినవి. ఈ గుహలందు నేడు మనము గర్వింపదగిన విషయము వాటి ప్రబల ఆంధ్రకృషియే కాని, ఇందు విదితమవు కళాప్రదర్శనము మాత్రము కాదని ఎరుగవలయును.

*  *  *  *

బొంబాయికి దాదాపు ఇరువదిమైళ్లదూరమున కన్హేరీగుహలు ఉన్నవి. ఇవన్నియు మొత్తము నూటఎనిమిది అని చెప్పవచ్చును. ఏలనన, ఈ గుహావర్గమందు చాల గుహలందు శిల్పవాస్తుప్రదర్శన మేమియు కానము. నిర్ణయక్రమము అయినను వీటియందు కానరాక, రాతిన మలచిన గూండ్లవలె కానవచ్చును. క్రీస్తుక.పూర్వము దాదాపు ఒక వందసంవత్సరముల నుంచి క్రీస్తుశతర్వాత ఏడెనిమిదివందల సంవత్సరములవరకు మలిచి నిర్మితమయిన మహాగుహావర్గము ఇది. ఇచట అనేకగుహలు, మరలమరల మార్పులు చెంది, తొలిరూపము తెరుగుటకు వీలులేని వయిపోయినవి. ఈ గుహలందు బ్రహ్మలిపిశాసనము లనేకములు కలవు. ఆంధ్రశాతకర్ణి రాజుల చరిత్ర ఇచట చాలవరకు లిఖితమయినదని పండితాభిప్రాయము.

ఈవర్గమందు అనేకగుహలు నేడు మనము ఎరిగిన గృహనిర్మాణపద్ధతులను అనుసరించే నిర్మితమయి నేటికిని వాసయోగ్యముగ ఉన్నవని చెప్పవచ్చును. ఈ గుహలందు కొన్నిమాత్రమే రూపశిల్పములచే అలంకృతమయినవి. ఒకటి రెండు గుహలందు, ఇంకను చిత్రలేఖనచ్ఛాయలు కానవచ్చును. అనేక కారణములవలన శిథిలములయిన ఈగుహల తొలిశోభ నేడు మనము చూడలేము. అయినప్పటికి చూచినంతనే వాటి ప్రతిభమిలమిలలు మనకు గోచరించకతప్పదు.

ఈ గుహలందు ముఖ్యముగా గమనింపవలసినది ప్రథమగుహ అయిన ఒక మహాచైత్యగుహ. ఈ గుహ ద్వారబంధముపైన యజ్ఞశ్రీశాతకర్ణిశాసనము కలదు. ఈచైత్యము నిజముగా ఆనాడే ఏర్పడినప్పటికిని, అనేకరూపాలంకారశిల్పములు చాలకాలమయినతర్వాత ఇందు మలిచినందువలన, దీని పూర్ణప్రథమస్వచ్ఛరూపము మనకు తెలియదు.

ఈగుహ ఏర్పాటంతయు కార్లిగుహను పోలినది. గుహకు ఎదురుగా, కొలదిదూరమున ఒక చిన్న అడ్డగోడ ప్రాకారమును ఉద్దేశించును. ఈ అడ్డగోడ బాహ్యముఖమంతయు శిల్పముచే అలంకృతమయినది. ఈ అలంకారశిల్పము గౌతమీపుత్రగుహ అడ్డగోడశిల్పమువలెనే ఉండి, అమరావతీప్రాకారశిల్పమును స్మృతికి తెచ్చును. బహుశా ఈ అడ్డగోడ అలంకారము గుహనిర్మాణమయిన కొంతకాలమునకు చేర్చి ఉండవచ్చును. ఈ గుహాముఖమంతయు గౌతమీపుత్రగుహాముఖమును పోలిఉన్నది. ఈ గుహాశిల్పములందు ఒక చిత్రమందు ఏర్పడిన జంతురూపచక్రసంకలనము అమరావతిశిల్పశైలిని అనుకరించునదై ఉన్నది. బహుశా ఈ అలంకారశిల్పము, నాసికనందలి గౌతమీపుత్రగృహనిర్మాణము ఏకకాలముననే జరిగిఉండవచ్చును.

ఈగుహకు ఎదురుగా, ఇరువైపుల రెండు ధ్వజస్తంభములు కలవు. ఒక స్తంభమునకు శిరస్సుపైన అశోక

స్తంభములకువలెనే నాలుగు సింహములు కలవు. రెండవ స్తంభశిరోభాగమున మూడు కుబ్జరూపములు మలిచి ఉన్నవి. వీటికి పైన పెద్ద ధర్మచక్రములు నిర్మితమయి ఉండినట్లు పండితుల ఊహ.

గుహలోపల చైత్యమందు ముప్పదినాలుగు స్తంభములు కలవు. వీటియందు పండ్రెండుమాత్రమే పీఠము, అధిష్ఠానము, కుంభము, గ్రీవము, బోధిక మొదలయిన భాగము లన్నియు కలిగి, పూర్ణరూపమున ఉన్నవి. ఈ స్తంభముల వాస్తువంతయు కార్లీగుహ స్తంభములను అనుకరించినది. కాని మానప్రమాణములు సమముగా ఏర్పడక కొంత మోటుగా ఉన్న మాట వాస్తవము. స్తంభశిరస్సులందు బోధికభాగమున ఏర్పడిన శిల్పములు సయితము, స్వచ్ఛత తప్పి, కొంత లోటు పడిన మాట వాస్తవము. చైత్యోపరిభాగమున కప్పుకు ఆనాడు నిర్మించిన కొయ్యచట్టమంతయు శిథిలమయి అదృశ్యమయినది. ఈగుహాఅంతర్భాగము, దాదాపు ౮౩ అడుగుల పొడవు, ౩౧ అడుగుల వెడల్పు కలిగి, నిర్మాణక్రమమున సర్వాంశములందును కార్లీగుహను పోలిఉన్నది.

ఈ గుహాంగణమందు అనేకశిల్పములు కలవు. ఇవి చాల శిథిలమయినవి. ఈశిల్పముల శోభ కాలప్రసార మినుమంతయు కడిగివేయలేదు. ఈ మహాంగణమందు, ప్రథమమున ఆకర్షించు శిల్పములు పార్శ్వకుడ్యములందు మలిచిన బుద్ధరూపములు. ఇవి ౨౩ అడుగుల ఎత్తయి, మానప్రమాణము లతిసమముగా ఏర్పడి, అత్యద్భుతముగా ఉన్నవి. ఈ బుద్ధముఖములందు మహాయానస్థులు సిద్ధాంతీకరించిన కరుణ అతి స్పష్టము. ఈమహాశిల్పములు,గుహ నిర్మితమయినతర్వాత రెండుమూడువందలఏండ్లకు మలిచిఉండవచ్చును. ఈ శిల్పములందు విదితమవు పుష్టి, రూపురేఖాగతి సంపూర్ణ ఆంధ్రమేకాని వేరుకాదు. ఈబుద్ధరూపములను మలిచిన మహాశిల్పి ఆంధ్రశిల్పియో, లేక ఆంధ్రశిల్పాలయమున పాఠమందిన శిల్పియో అయిఉండవలయునేకాని వేరుకాదు.

గుహాసింహద్వారమునకు ఇరువైపుల గోడన మలిచిన రూపశిల్పములు తొలినాటివే. ఇవి సంపూర్ణముగ ఆంధ్రములు. ఈశిల్పములందలి వసనాభరణములు, తలకట్లు, ఇతరఅంశముల శైలి సర్వము శాతకర్ణిశిల్పములను పూర్తిగ అనుసరించినవి. కార్లీ గుహయందు సయితము ఈస్థలములందే ఇటువంటి శిల్పములే కానవగును. కాని ఈశిల్పములు మరింత అందము కలిగిఉన్నవి. ఈ శిల్పములందు ముఖ్యముగా గమనింపవలసినవి ద్వారబంధమునకు ఇరువైపుల, ప్రక్కనే సతీసమేతముగా చిత్రితములయిన సోదరుల శిల్పములు. ఈ సోదరరూపములు, ఆనాడు ఈగుహానిర్మాణమునకు కావలసిన ధనమిచ్చిన ధనికుల వని అచటి శాసనములవలననే తెలియుచున్నది. ఇవి మనిషిప్రమాణమున ఉన్నవి. ఈరూపములు సంపూర్ణ జీవము కలవయి, తాము నిర్మించిన చైత్యగుహకు అందరిని ఆహ్వానించుచున్నరీతిని గోచరించును. ఈ శిల్పములందు విదితమయిన రూపురేఖలగతి, నిమ్నోన్నతములు, భంగిమ, పుష్టి, అనుభావము మహాశిల్పికరాగతములేకాని వేరుకాదు. ద్వారబంధమునకు ఎడమవైపున ఉన్న స్త్రీముఖమందలి మందహాసము, యూరపునందు అతిప్రఖ్యాతి వహించిన డావించీ మోనాలిజా తైలచిత్రమందలి మందహాసమును మరిపించును. దుష్టులెవరో ఈమె పెదిమలనే ఛేదన మొనర్చిరి. అయినను ఆ పెదిమలందు తాండవించుచున్న అపూర్వమందహాసమును ఏమాత్రము మాపలేకపోయిరి. ఇదే నిజఆంధ్రశిల్పరీతి. శిల్పము ఛేదనమయినను శిల్పభావము మరుగుపడక, శిల్పఖండనములను పెగల్చుకొని ప్రకాశించుచునే ఉండును.

ఈ కుడ్యముఖముననే, పైభాగమందు చిత్రితమయిన సప్తమానుషబుద్ధరూపములు, ఒక అవలోకితేశ్వరరూపశిల్పములు సయితము, తొలినాటి శిల్పములు కాక, చాలకాలమయినతర్వాతనే మలిచినవి. వీటియందలి శిల్పప్రదర్శనము అతినీరసమయినది.

మిగిలిన గుహలందు కళాభావమున పరికింపదగిన విశేషము లంతగా లేవు. అయినప్పటికీ రూపశిల్పము లతివిరివిగా మలిచియున్న మూడునాలుగు గుహలను ఒకింత గమనింపవచ్చును. ఈగుహలందు అనేక బుద్ధ, బోధిసత్వ, స్తూపరూపము లధికముగా కానవచ్చును. ఒకటిరెండు గుహలందు కుడ్యములన్నియు సంపూర్ణ

ముగా శిల్పముయును. ఈశిల్పములందు పునరు క్తి ఎక్కువ అయి, దోషరూపమునే వహించును. చూచిన శిల్ప రూపమే అనేక ప్రమాణములందు, అనేకరీతుల పలుమార్లు కానవచ్చి, కొంత విసువునుసయిత మదయింప జేయును. అయినను ఈ పునరుక్తియందే కానవచ్చు ఆశిల్పుల శ్రద్ధ అతీతమయి ఆశ్చర్యమును మాత్రము తప్పక కొలుపును. ఈ శిల్పములన్నియు మహాయాన గతినే అనుసరించినవి. ఇవన్నియు క్రీస్తుశతాబ్ది రెండుమూడుశతాబ్దముల అనంతరము వెలచినవే అని చెప్పవచ్చును.

ఈ శిల్పములందు రెండు కల్పనలుమాత్రము గమనించదగినవి. ఈకల్పనలందు శిల్పవిశేష మేమియు లేకున్నప్పటికిని, చిత్రమయిన భావవిశేషములుమాత్రము కలవు. ఒక కల్పనయందు బుద్ధుడు ఉపవిష్టుడయిన పద్మము ఒక నిటారుకంబముపైన ఉండును. ఈ కంబమునకు క్రిందిభాగమున నాగపురుషు లిద్దరు ఇరువైపుల తన్నిపట్టి కంబమును నిలుపుచుందురు. కంబ మధ్యభాగమునుంచి ఇరువైపుల రెండుపద్మములు మొలచును. ఈపద్మములందు నాగపురుషులో, లేక భక్తులో కానవచ్చెదరు. ఈకల్పన అనేకమార్లు ఈగుహలందు కానవచ్చును. అప్పుడప్పుడు రచనయం దొకింత భేదము కానవచ్చినను, ఈకల్పన రూపు ఒకింతయు నను మారదు. అనేకమార్లు ఈగుహయందు ఈకల్పన పునరుక్తి చాల అయినందువలన, అనేక ఇతరగుహలం దీకల్పన అక్కడక్కడ కానవచ్చినను, కన్హేరికల్పన అనునామముననే ఇది ప్రసిద్ధికెక్కినది. ఇంతేకాక ఈ కల్పన ప్రథమఅంకురము ఈగుహలందే అని పండిత సిద్ధాంతము.

ఇక రెండవ కల్పన ఒక బోధకశిల్పము. లిట్టనీ (*Litlany*) అని పాశ్చాత్యపండితు లందురు. ఈ కల్పనయందు కేంద్రమున అవలోకితేశ్వరు డుండును. కుడిపైపున పైనుంచి క్రిందకు వరుసగా ఒక పురుషుడు ఏనుగ, సింహము, సర్పము, అగ్ని, నావచ్ఛేదనము మొదలయిన బాధలకు లోనయి, భయమున నుండును. ఎడమపార్శ్వమందు ఇదేరీతిన కారాగార, గరుడ, పిశాచ(బౌద్ధుల బోధకముక్త)ఖడ్గ,విరోధిబాణలు చిత్రించి యుండును. ఇటువంటి సర్వబాధలనుంచి అవలోకితేశ్వ రుడు రక్షింపగలడని ఈ చిత్రభావము. ఈ చిత్రకల్పన యందు చిత్రితమయిన ప్రతిఒకబాధను గూర్చిన కథలు సయితము కలవు. ఈకల్పన సయితము ఈగుహ లందు అనేకమార్లు కానవచ్చును. ఒక్కొక్కతరి, వట్టి బాధలేగాక, అవలోకితేశ్వరుడు తద్బాధానివార ణము చేయుచున్నరీతిగూడ చిత్రించియుండును.

మహాయానము ప్రబలుచున్న కాలమున, నీరసించుచున్న ఆంతర్యసౌభాగ్యములందు ఉద్భవించిన కల్పనలివి. ఆంతర్యగతి ననుసరించి ఈశిల్పములందు సౌందర్యత అదృశ్యమయినది. నీరసించిన ఆంధ్రశిల్పశైలి మాత్రము ఈ రచనలందు మరుగుపడలేదు.

ఈ కన్హేరిగుహాసర్గము ఇంత ప్రబలమయిన దయినను ఒక్క విహారమయినను ఇందు కానము. మొదట చెప్పిన ఒక మహాచైత్యము తక్క, మిగిలినవన్నియు విడి భిక్షుక గృహములే. సర్వగుహలందును ముఖ్యముగా విదితమగు ప్రధానలక్షణములు గుహాంగణమందలి వరాండా, అరుగులు. అతిశయభావమున ఉదయించిన, ప్రత్యేకఆంధ్రవాస్తులక్షణమయిన వరాండా పూర్ణవిని యోగము, వాస్తువునం దిది కల్పింపగల సొంపు కన్హేరి గుహలందు ప్రస్ఫుటితమయినది.

ఈ వర్గమందు విహారములు లేనందున, ఇచటి పరివ్రాజకవర్గమందు సామాజికజీవనము లేదనుటకు వీలులేదు. అందరు గూడి ధర్మమును చర్చించుటకయి మహాశాలలు రెండు ఈగుహలందున్నవి. ఇందు అతి ప్రఖ్యాతి వహించినది దర్బారుగుహ. ఈగుహనిర్మాణ క్రమము నాడు అజాతశత్రువు రాజగృహసంగీతము కొరకు నిర్మించిన మహాశాల ననుకరించుననని పండితాభి ప్రాయము. ఇచట నిర్మితమయిన ప్రతిగుహయందును, ముందు వరాండాయేగాక, తపశ్చర్యకొరకు ఏర్పరచిన ఉపగదితోపాటు, అరుగులు కలిగిన ఒక చావిడి సయితము కానవచ్చును. కొన్ని గుహలందు ఈ చావిడుల వెనకభాగమున, ఒక చిన్న అదిత్యమును సయితము కల్పించి, అదిత్యమందు ఒక బుద్ధవిగ్రహమును గూడ నిలిపిరి. అందుచేత అనేకశాఖలకు చెంది, ప్రత్యేక శిష్యవర్గములు కలిగిన, వివిధబౌద్ధసన్యాసుల సమూహము ఇచట నాడు ఉండెడిది అని మనము ఊహింప వలయును.

ఈ గుహలందు సర్వపండితులను ఆశ్చర్యమొన రించిన ఘనవిశేషము ఇంకొకటి కలదు. ప్రతిగుహకు ఎదురుగ ఒక చిన్న నీటికుండు కానవచ్చును. సర్వ పర్యంతము ఈ నీటికుండు, చల్లటి మంచినీరుతో చేతి కందురీతిన నిండియుండును. ఈ నీటివసతికిని కను గొని, ఆనాడు ఇచట ఇంత మహాగుహావర్గమునకు శంకుస్థాపన మొనరించిన ప్రథమశిల్పిప్రజ్ఞ మహోత్కృష్ట మని వేరుగ చెప్పనక్కరలేదు. (సశేషము)




[క థా ని క]

శ్రీ అందే నారాయణస్వామి

పార్థసారథికీ, ముకుందానికీ విరోధం వచ్చిందన్న వార్త విని గ్రామస్థులు ఆశ్చర్యపడ్డారు. ఇద్దరూ ప్రాణస్నేహితులు. ఆఫీసువేళల్లోతప్ప వాళ్ళను ఒంటరిగాచూసిన వాళ్ళు వుండరు! లోగడ వాళ్ల స్నేహాన్ని చూసి అసూయపడ్డవాళ్లు కొందరు సంతోషించారుగూడా! ఇప్పుడు ఇద్దరికీ నోటి మాటలే కాకుండా కళ్ల చూపులు గూడా లేకుండా పోయినవి. ఇద్దరూ బజారులో తారసిల్లినా ఆమడదూరం తొలిగిపోతున్నారు. పార్థసారథినీ, ముకుందాన్నీ గూడా ఇంట్లో పెద్దవాళ్లు "ఒరే! మీరు బాల్యస్నేహితులు. ఒకకంచాన తిని ఒకమంచాన పండినవాళ్లు కదా, మీ కెందుకురా యీ విరోధం?" అని కూకలు వెయ్యకపోలేదు. "నేనేమీ అన లేదు. వాడే నాతో మాట్లాడడం లేదు" అని ఒకరూ, "నావల్ల తప్పేమీ లేదు. వాడే బిగుసుకు పొయ్యా" డని మరిఒకరూ—యిట్లా యెవరిమటుకు వాళ్లు సమాధానాలు చెప్పారు. పెద్దవాళ్లు మందలించినా వాళ్ల మనస్సులు మారలేదు.

ఆ గ్రామంలో రెండు పార్టీలు. రెంటికీ బద్ధవైరం. ఒకపార్టీవాళ్లు యేపని తలపెట్టినా (అది గ్రామానికి మేలుచేసేదిగాని, కీడుచేసేది గాని) రెండోపార్టీవాళ్లు ప్రతిఘటించి దాన్ని కాకుండా చెయ్యడమే వాళ్ల పని. ముకుందం రెండోపార్టీలో చేరిపొయ్యాడు. వాళ్లకు మరింత బలం చేకూరింది. ముకుందం పార్టీవాళ్లు అవతలపార్టీవాళ్లంటే ఒంటికాలిమీద వెళ్లడం మొదలుపెట్టారు. గ్రామరాశిరాములవారి కోవెలపూజాపునస్కారాలపట్ల రెండుపార్టీలకూ తగాదాలు వచ్చి అదివరకే వ్యాజ్యాలు పడి గుడికి తాళాలు వేసుకున్నారు. ఒకరోజు సాయంత్రం కోవెల ఆవరణలో యెదిగివున్న గడ్డిని పార్థసారథిగారి పాలేరు కోస్తూ వుండగా అవతలిపార్టీవాళ్లు వచ్చి కొడవలి, తట్ట లాక్కొని పాలేరును కొట్టి పంపారు. కొట్టడానికి వచ్చిన గుంపులో ముకుందం కూడా వున్నాడు. అప్పుడు పార్థసారథి అవతలిపార్టీలోని కొందరి పేర్లు చేర్చి చార్జి పెట్టాడు. అక్కడ విశేష మేమిటంటే! ముకుందాన్ని మాత్రం అందులో చేర్చలేదు. అందుకు పార్టీలో కొందరు పార్థసారథిని "ఏం మాజీస్నేహితుడనా అతణ్ణి చేర్చలే" దని దుయ్యబట్టారు. అందుకు అతడు వాళ్ల కిచ్చిన సమాధానం ఇది: "వాణ్ణి ఇటువంటి చచ్చుకేసుల్లో ఇరికిస్తే ఏం లాభం? గురిచూసి దెబ్బకొడితే ఇక యెప్పటికీ తలయెత్తకుండా వుండాలి. వాణ్ణి వదిలిపెట్టానని ఎంచవద్దు" అని.

ఇక ముకుందం వాళ్లతో వీళ్లతో "నాపేరు పెట్టడానికి వాడికి గుండె లెక్కడున్నాయి! మనమంటే వాడికి సింహ స్వప్నం" అని చెప్పుకున్నాడు.

## 2

ఆరుమాసాలు గడిచినవి. ముకుందానికి పార్టీసంబంధమైన కక్షలు అట్లా వుండనిచ్చి మరిఒక అవాంతరం వచ్చిపడ్డది. ముకుందానికీ పక్కఇంటి ఆసామికీ గోడదగ్గర తగాదా వచ్చి వ్యాజ్యాలు వేసుకోవడందాకా జరిగింది. అవతలఆసామి వున్నవాడు. ముకుందాన్ని లొంగదీయడానికి ముకుందం అవతల మరిఒక ఆసామికి బాకీవున్న నూటయాభైరూపాయల ప్రాంసరీ నోటును ప్రతిఫలం యిచ్చి తనపేరటికి అర్డరు వేయించుకుని ముకుందానికి రిజిస్టరు నోటీసు గూడా ఇచ్చాడు. అయితే ఆరునూరైనా ముకుందం ఒకళ్లకు లొంగే ఘటం కాదు. ముకుందం పరిస్థితులు చూద్దామా! వున్నవాడేమీ కాదు. జీతంరాళ్లవల్లనే జీవనం. అందులో అప్పో సప్పో చేసి గోడకేసులో కొంత ఖర్చుకూడా పడివున్నాడు. చేతిలో కాసీలేదు. వెంటనే సొమ్ము చెల్లించకపోతే అతడు దావావేసి జప్తుతెచ్చి తనను పరాభవించేటందుకు సిద్ధంగా వున్నాడు. ఏ కాస్త లోటు కనిపించినా గోరంతలు కొండంతలు చేసి మనిషిని గేలిచెయ్యడానికి వేయి కళ్లతో యెదురుచూస్తున్నది అవతలపార్టీ ఒకటి. తన మానాన్ని తాను గౌరవంగా జీవిస్తున్న అతని కది మనోవ్యథ కలిగించింది.

బాకీ చెల్లించివేద్దామని అప్పుకోసం ప్రయత్నించాడు కాని యెక్కడా అప్పుపుట్టలేదు. పిచ్చివాడిలా తిరిగితిరిగివచ్చి ఈ ఆపద నుండి బయటపడే దెట్లాగా అన్నవిచారంతో ఇంటివసారాలో మంచానికి చేరగిలపడ్డ ముకుందానికి మెరుపులా ఒక ఊహ తట్టింది. తన అన్నకుమారుడు-డాక్టరు-కాకినాడలో ప్రాక్టీసు పెట్టి, బాగా డబ్బు గడిస్తున్నాడు. అతడు తానంటే ఎంతో ఆదరాభిమానాలు కలవాడు. ఈఅవస్థంతా దేనికి, అతనికి వ్రాసి డబ్బు తెప్పించుకుందా మనుకొని ముకుందం వెంటనే కాగితం కలం తీసుకుని ఏకాంతంగా కూర్చుని, ఇట్లా యిబ్బందిలో వున్నాననీ, ఓ నూటయాభై రూపాయలు పంపితే వెంటనే మళ్ళా తీర్చి వేస్తాననీ, రెండు గంటలసేపు ఆలోచించి మూడుపేజీల ఉత్తరం వ్రాసి కవరును స్వయంగా పోస్టులో వేసి వచ్చాడు.

కాకినాడకు ఉత్తరం వ్రాసి వారంరోజులయింది. తన పేరటికి డబ్బు వస్తుందని వరసన మూడురోజులనుంచి ముకుందం పోస్టుకు వెళ్ళివస్తూన్నాడుగాని అంతవరకూ ఏమీ రాలేదు. ఆవాళ తప్పకడబ్బువస్తుందన్న దృఢ నిశ్చయంతో టపా వచ్చేవేళకు పోస్టాఫీసుకు వెళ్లాడు. ఆవాళగూడా ఏమీ రాలేదు. ముకుందం నిస్పృహతో ఇంటిదారి పట్టాడు.

పెద్దబజారునే వెళ్లిపోతూవున్న ముకుందానికి అటువైపే వస్తున్న పార్థసారథి కొంత దూరంలో కనిపించాడు. ఆపదకూ వైరానికీ చాలాదూరం. అందులో వెనక ఇద్దరిలో ఎవ్వరికి ఏఆపద వచ్చినా తమకు వచ్చినట్లు బాధపడుతూ ఒకళ్ళని ఒకళ్లు ఆదుకున్నవాళ్ళు. ముకుందానికి పార్థసారథిని పలకరించాలన్న సంకల్పం ఉదయించింది. తీరా తాను పలకరించిన తర్వాత అతడు పలకకపోతే తాను చిన్నపుచ్చుకోవలసివస్తుందే! పోనీ, పలకకపోతే

అతని మాట అతనికే వుంటుంది, తనమీద నెపములేకుండా పలకరిద్దాం! ఇంతమాత్రానికి తనకు వచ్చే నామోషీ ఏముంది-అన్న నిశ్చయానికి వచ్చాడు. అయితే ఏ నెపంమీద పలకరించేటట్టు? మళ్ళా ఆలోచనపడ్డది. వేరే నెపం అతని కేమీ గోచరించలేదు. 'ఏరా సారథీ, ఎక్కడికి వెళ్ళుతున్నావు?' అందా మనుకున్నాడు. అసలే విరోధంగా వుంటున్నవాడిని ఎప్పటి లాగా 'ఏరా' అనిపిలిస్తే ఏంకోపం వసుందో! అట్లాగూడా కాదు. 'ఏం సారథీ! ఎక్కడికి వెళ్ళుతున్నావు?' అని మాత్రం పలకరిద్దామని తీర్మానించుకున్నాడు.

పార్థసారథి దాపులోకి వచ్చేశాడు. ముకుందాన్ని సమీపించాడుగూడ. తీరా అతడు సమీపించేసరికి ముకుందానికి నేరం చేసినవాడిలా గుండెలు కొట్టుకొన్నవి. పార్థసారథికేసి కళ్లప్పగించి వూరుకున్నాడు. మాట్లాడేటందుకు నోరు పెగల్లేదు. పార్థసారథి అతణ్ణి దాటివెళ్లిపోయ్యాడు. పాపం, ముకుందం వల్లెవేసుకున్నదంతా వృథా అయింది. అతడు దాటిపోవటంతో ముకుందానికి ఉక్రోషం ముంచుకొచ్చింది. తాను అతణ్ణి కలవేసుకునే ఆహాతు లేనివాడే కావచ్చు. అతడుమాత్రం తన నెందుకు పలకరించకూడదు? అతనికి తాను చేసిన ద్రోహ మేమిటి? డబ్బుకలవాణ్ణి, పార్టీ బలంకలవాణ్ణి అన్న అహంకారం బలిసింది. వీడి డబ్బెంత చేసు, వీడెంత చేసు! అసలు చేస్తున్నదంతా వీడే. అవతలవాడికి పుర్రెట్లు పెట్టి మద్దత్తుగా వుండి కథ నడుపుతున్నదిగూడా వీడే. ఈ ఆలోచనలతో ముకుందం ఇల్లు చేరుకున్నాడు.

ముకుందం ఇక పోస్టుకు వెళ్లడం మాని వేశాడు. ఆరెండోరోజున అతడు ఇంటిపంచలో దిగులుగా కూర్చునివుండగా వీథితలుపు నెట్టుకొని పోస్టుజవాను వచ్చి ఒక కవరు యిచ్చి వెళ్ళిపొయ్యాడు. ముకుందం ఆత్రంతో కవరు చించి కాగితాన్ని పైకితీసి మడత విప్పాడు. అతని ఆశ్చర్యానికీ, ఆనందానికీ అంతు లేదు. అది తాను వ్రాసిన ప్రాంసరీనోటు. డబ్బు ముట్టినట్టు వెనుకవైపున చెల్లు వ్రాయబడి, మెరుస్తూ ప్రక్కయింటి ఆసామీ సంతకంకూడా వున్నది. తన అన్నకుమారుడికి తానంటే ఎంత దయ! తాను సంగతులు, అన్నివివరాలతో వ్రాసివుండడంవల్ల తనవాడు ఇక్కడి పరిస్థితులన్నీ శ్రద్ధతో గమనించి తనపేరటికి డబ్బుపంపి మళ్ళా తాను అవతల ఆసామీకి చెల్లించేలోపలఅవతలవాడు తొందరపడి దావావేస్తాడేమోనని తలచి నేరుగా వాడికే డబ్బుకట్టి స్వయంగా నోటు తెప్పించుకుని తనకు పంపివేశాడు. ఎంత దూరదృష్టి కలవాడు! ఇక ఆ వాజమ్మలు యెన్ని కుట్రలు పన్ని తన నేం కదిలించగలరు? అయితే, దీనితోపాటు వుత్తరం ముక్కన్నా జతపరచలేదేం? అవును. ప్రొద్దస్తమానం వచ్చేవాళ్లూ పొయ్యేవాళ్లుగా తల్లో పెంట్రుకలంత మంది రోగులు వాణ్ణి వేపుకు తింటూవుంటారామె. వ్రాసేటందుకు తీరికయెక్కడుంటుంది? అయినా సజ్జనులకు ఇతరులకు సహాయపడడమే ముఖ్యలక్ష్యం. అట్లా చేశామనీ, ఇట్లా చేశామనీ యెన్నటికీ వారు వ్రాసుకోరు. ఇట్లా అనుకుని ముకుందం అప్పుడే కాగితం, కలం తీసుకుని—

"నాపరువు నిలబెట్టావు. నీమేలు ఎన్నటికీ మరిచిపోలేను. పరోపకారపరాయణు

లకు, స్వార్థత్యాగులకు మన భారతభూమి పుట్టినిల్లు. బిడ్డా! నిన్ను నేను పొగడగూడదు గాని నీబోటి పుత్రరత్నాలను గన్న భారత మాత ధన్యురాలు. పూర్వం మన ముత్తాత గారు గొప్పగొప్ప త్యాగాలు చేసి ఆ తరంలో మన వంశానికి గొప్ప పేరుప్రఖ్యాతులు తెచ్చాడని మానాయనమ్మ చెపుతూవుండేది. పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది. యీతరంలో మన వంశానికి నీమూలకంగా పేరుప్రతిష్ఠలు రాగలవని నాకు చాలా నమ్మకంగా వున్నది. భగవంతుడు నీకు ఆయురారోగ్యము లిచ్చి రక్షించుగాక."

తన పాండిత్యాన్నంతా గుప్పించి పై ధోరణిలో చేటభారతమంత ఉత్తరం వ్రాసి పోష్టులో వేశాడు. అందుకు మూడోనాటికే జవాబు వచ్చింది. ముకుందం కవరు చించి చదవగా అందులో యిట్లా వున్నది:

"పూజ్యులైన చిన నాన్న గారికి, నమస్కారములు—

మీరు వ్రాసిన రెండుత్తరములు చేరినవి. మీరు ముందుగా వ్రాసినప్రకారం డబ్బు పంపలేకపోయినందుకు మీరు నన్ను యద్దేవా చేస్తూ వ్రాసినందుకు చాలా విచారపడుతున్నాను. నేనంటే యెంతో వాత్సల్యంగల మీరు, మన స్థితిమితంలో వుండి ఇట్లా వ్రాశారని నమ్మలేకుండా వున్నాను. నేను యేమో వ్రాసినానని అశ్రద్ధచేయక మీరు వెంటనే బయలుదేరి వచ్చి నాచేత పరీక్షచేయించుకోవలెనని మరీ మరీ కోరుతున్నాను."

ఉత్తరం చదువుకుని ముకుందం వెలవెల పోయాడు. తిక్కరావన్న ఇట్లా వ్రాశాడేం? అయితే డబ్బు ఎవరు కట్టినట్టు? తన అత్త వారు చూద్దామా, వాళ్ళదీ అంతంత మాత్రం సంసారమే! ఇక స్నేహితులని చూద్దామా, ముఖ్యమైనవాడే తనమీద కత్తికట్టె! ఆపదనుగుర్తించి తనకు అడ్డు పడగలవా ళ్ళింకెవ రున్నారు? అతనికి అగమ్యగోచరంగా వున్నది. పోనీ, తనకు డబ్బు యెలా చేరిందో ప్రక్కయింటి ఆసామీని యెవరిచేతనైనా అడిగించి అంతు తీయిద్దా మనుకుంటే అది అద్దెకొంప. ఇంటి యజమానిదిమాత్రం దగ్గరగ్రామం. ఇంతలో తన మేనత్తకు చీటీ వ్రాసిపంపిన సంగతిఅతనికి చప్పున జ్ఞప్తికి వచ్చింది. కాకినాడకు వుత్తరం వ్రాసేనాటికి రెండురోజులముందు ఆవీథిలో యెవరో ఆగ్రామం వెళుతూంటే కోనూరులో వున్న తన మేనత్తగారికి డబ్బుపంపమని ఆషా మాషీగా చీటీవ్రాసిపంపాడు. సొమ్ము ఆమె కట్టిందని ఇప్పు డతనికి అర్థమయింది.

## 3

తర్వాత రెండుమాసాలు గడచినవి. ముకుందం తగ్గేరకం కాదు. ఈ రెండుమాసాల బట్టీ ఇద్దరూ ఎన్నోసార్లు ఎదురుపడ్డా, ముకుందానికి పార్థసారథిని పలకరించాలన్న సంకల్పం ఆనాటితోనే అంతరించింది. రెండు పక్షాలకూ వైషమ్యాలు యథాప్రకారం నడచిపోతూనేవున్నవి.

ఆరోజున గ్రామంలో ఒక గగ్గోలు బయలుదేరింది. ముకుందం క్రిందటిరోజు సాయంత్రం కాలవకట్టమీద ఒక అమ్మాయితో మాట్లాడిన మాట నిజమే. ఆ అమ్మాయి తెల్లవారేసరికి ఇంట్లో లేదు. గడచిన రోజు సాయంత్రం ఆ ఇద్దరూ కాలవకట్టమీద మాట్లాడుకుంటున్నప్పుడు ఎవరు చూశారో మరి–ఆసంగతి కాస్తా గ్రామంలో వ్యాపించారు.

పార్టీలువున్న గ్రామంలో ఇటువంటి వార్తలకు వడి జాస్తి. అది ఆనోటా ఆనోటా పడి ప్రొద్దు పొడిచేటప్పటికల్లా, ముకుందం ఫలానా అమ్మాయిని లేవతీసుకెళ్ళాడన్న . వార్త గ్రామమంతా వ్యాపించింది. ఎవరినోటివెంట వచ్చినా అదేమాట! ఏవీథిలో చూసినా అదే ముచ్చట! వీథిఅరుగులమీద నలుగురూ కూడడమూ—

"ఏమండో, మీకు తెలిసిందా?"

"అహా, తెల్లవారుఝామునే తెలిచింది"

"ముకుందాన్ని తెల్లవారి గ్రామంలో నేను చూశానే మరి!"

"అదంతా నాటకంలేండి. గ్రామంలో వుండి అందరికళ్ళా పడితే తాను లేవతియ్యలేదనుకుంటారుగా!"

"అంతేఅంతే. నిన్న సాయంత్రం ఇద్దరూ కాలవకట్టమీద గుసగుసలు ఆడుకుంటూ వుంటే కళ్ళారా చూచినవాళ్ళుండగా అంతకంటే నిదర్శన మేం కావాలి?"

"ఈదెబ్బతో చూసుకోండి. నామాట వట్టిదైతే. రెండుపార్టీలూ తలపడి తలకాయలు పగలగొట్టుకోకపోతే అప్పుడనండి."

"మీరన్నట్టు కొంపలంటుకునేటట్లే వున్నది. ఇందులో తీసిపొయ్యేవాళ్ళెవరూ లేరు"

—ఇట్లా గ్రామమంతా అట్టుడికినట్టుడికి పోతున్నది.

ఆర్రోజు మధ్యాహ్నం పన్నెండింటికి మామూలుప్రకారం ఇంటికి భోజనానికి వచ్చిన ముకుందాన్ని భార్య "యేమిటండీ, మీమీద గ్రామంలో ఇట్లా వదంతిగా వున్న" దని ఆదుర్దాతో అడిగింది.

"అదానంగతి! యిప్పుడు బజారునే వస్తూఉంటే అంతా నావంక అదోమాదిరిగా చూస్తున్నారు. ఏదో గుసగుసలాడుకుంటూన్నారు. ఎందుకోననుకున్నాను" అన్నాడు ముకుందం.

"అంతా ఎరగనట్టు మాట్లాడతారేం, నిజం చెప్పండీ?"

"నాకేమీ తెలియదు"

"నాదగ్గర దాస్తారేం? పొరుగింటామె అంతా చెప్పింది. అదీ, మీరూ నిన్న కాలవకట్టమీద మాట్లాడుకోలేదూ?"

"మాట్లాడిన మాట నిజమే"

"ఇంకేం, నంగనాచిలా మాట్లాడతారేం? ఇటువంటి వ్యవహారాల్లోగూడా దిగారూ!"

"అయితే ఏమని మాట్లాడామో వినవేం?"

"ఆడదానికీ, మగవాడికీ ఏంమాట లుంటవి? ఊరికే పుడుతుందా వదంతి?"

"వాళ్ళకు పుట్టిన పిచ్చ నీకూ పుట్టిందీ? ఇదంతా అవతలపార్టీవాళ్ళు చేస్తున్న దుష్ప్రచారం! నిన్న సాయంత్రం నేను కాలవకట్టనే షికారువెళ్ళివస్తూన్నాను. ఆ అమ్మాయి రావిచెట్టుదగ్గర ఎదురుపడ్డది. చేతిలో కొడవలి వున్నది. నన్ను చూసి నిలబడి 'ఇటు ఎవరైనా వెళ్ళారా?' అని అడిగింది. అందుకు నేను 'నీకు ఎవరు కావాలి? పేరుచెపితే చెప్తా' నన్నాను. అందుకు ఆఅమ్మాయి వెలావెలా పోయి 'ఆడమనిషి.' అన్నది. 'మగమనిషని ఎవ్వరన్నారూ' అన్నాను

నేను. అంతటితో ఆఅమ్మాయి చరచరా వెళ్ళిపోయింది. ఇదీ మాయిద్దరికీ జరిగిన సంభాషణ."

"ఇంతమాత్రానికే నటండీ గ్రామంలో మీమీద అంతగగ్గోలు పుట్టింది?"

"చెప్పేదేమిటి? ఇదంతా ఆ పార్థసారథిగాడు చేస్తున్న తతంగం. ఆపిల్ల ఎట్లా పరారీఅయిందో అది నామీదికి తిప్పారు."

"ఎంత స్నేహానికి అంత విరోధ మంటారే అట్లా వచ్చింది మీ ఇద్దరికీ. అయినా ఒకళ్ళతో మనకు విరోధం దేనికి చెప్పండి? మనం ఎంతటివాళ్ళమని?"

"ఒకవేపున వాళ్ళు కయ్యానికి కాలు దువ్వుతూవుంటే నన్నంటావేం? అయినా వాళ్లు ఎన్నికుట్రలు పన్ని నన్నేంచేస్తారు?"

"అట్లా అనబోకండి. అవతలవాళ్లు డబ్బుకలవాళ్లు. మనం చూద్దామా అన్నంలో రాయి తీసుకోలేనివాళ్లం."

"అయితే, ఏమంటావ్? డబ్బుంటే యెవడి కెక్కువ?"

"డబ్బున్నవాళ్ళేమనన్నా చెయ్యగలరు. గ్రామంలో చూస్తే గోలగా వున్నది. మీరుమాత్రం బైటికి కదలవద్దు."

"నిప్పు పట్టుకుంటే పొక్కుతుందా, లేకపోయినా పొక్కుతుందా? మన కేం భయం?"

"మీ కెప్పుడూ ఇంతే. ఎడదిడ్డమంటే పెడదిడ్డ మంటారు! అసలే పార్టీకతలామె! గ్రామంలో చూస్తే కొట్లాటలు జరుగుతవని పుకారుగా వున్నది! ఇల్లు కదలవద్దంటే నామాట వినరు" అని ఆమె పమిటచెంగుతో కళ్లద్దుకుంటూ అన్నది.

"పిచ్చిదానిలా వున్నావు! నీ కంత భయం దేనికి? దేవుడు చాలా మేలుచేసి, వాళ్లు నామీదికి రావాలేకాని ఇవతల మన పార్టీ లేదూ. మక్కెలు విరగపొడిచి చంపుతారు, తెలిసిందా?"

భోజనం కాగానే ముకుందం పైమీద వుత్తరీయం వేసుకొని పార్టీవాళ్లనలుగురి ఇళ్లకూ వెళ్లి ఈ వుదంతమంతా చెప్పివచ్చినాడు.

ప్రొద్దుకూకింది. ముకుందం వసారాలో లాంతరుదగ్గిర కూర్చుని నిశ్చింతగా పత్రిక చదువుకుంటున్నాడు. ఇంతలో వాకిటి ముందు గల్లంతు వినవచ్చింది. పరారీ అయిన పిల్లతరఫువాళ్లు వుద్రేకంతో పదిమంది కైకర్రలు పుచ్చుకుని ముకుందంఇంటిమీదికి వచ్చేశారు. వీథిగుమ్మంముందు నిలబడి ముకుందాన్ని బైటికి రమ్మని కేకలువేస్తున్నారు. ముకుందంభార్య కంగారుకు అంతు లేదు. ముకుందం వెంటనే దొడ్డిగుమ్మం గుండా కుర్రవాడిని తన పార్టీవాళ్ళకోసం కబురిచ్చి పంపాడు.

వెళ్లిన కుర్రవాడు వచ్చేశాడు. ఇంకా వాళ్లురాలేదు. వాకిటిముందు వాళ్ళ కేకలు జాస్తీ అవుతున్నవి. "మీరు బైటికి వెళ్ళవ" ద్దని భర్తను బతిమలాడుకుని, భార్య వీథిగుమ్మంలోకి వెళ్లి "ఎందుకు నాయనలారా! మాఇంటిమీదికి వచ్చారు? మే మేపాపమూ యెరగము. మీరు వెళ్ళిపోండి" అని వాళ్ళతో చెప్పింది. "ఆడదాన్ని పంపి తాను ఇంట్లో దూరాడా?

బైటికి రమ్మను. కనపడుతుంది" అంటూ వాళ్ళు దుర్భాష లాడడం సాగించారు.

అప్పటికీ తన పార్టీవాళ్ళు రాలేదు. ఇంట్లో ముకుందానికి గాభరా అధికమైంది. పెద్దపులికి బాగా ఆకలివేస్తేనే పంజా విప్పుతుంది! పార్టీగూడా అంతే! సమిష్టిగా బయలుదేరదగిన కారణం ఏర్పడితేనేగాని అది లేచి ఒళ్ళు విరుచుకోదు! లేకపోతే గేదెను వేసిన పులిలా మత్తుగా పడుకొని వూరుకుంటుంది! ముకుందం ఇంకా వాళ్ళు వస్తారన్న నమ్మకంతోనే వున్నాడు. వాకిటిముందు వాళ్ళు చేస్తున్న గోల మిన్నుముట్టుతున్నది. ముకుందానికి కాళ్లు భూమిమీద ఆనడం లేదు. ఇంకా తాను జాప్యంచేస్తే వాళ్ళు ఇంట్లో జొరబడేటట్లున్నారు. ముకుందం ధైర్యంచేసి వీధిగుమ్మంలోకి వెళ్ళి "మీరన్యాయంగా మాయింటిమీది కొచ్చి ఇట్లా గల్లంతుచేయడం దేనికి?" అన్నాడు.

అతని మాట ఆలకించే దెవరు? అతణ్ణి చూడగానే వాళ్ళకు వుద్రేకాలు హెచ్చిపోయినవి. నోటికి వచ్చినట్లల్లా తలోమాటా మాట్లాడుతూ కర్రలు పైకెత్తారు. ముకుందం ఒక్కడూ ఏమి చేయగలడు? అతడు వణికిపోతున్నాడు. భార్య అతణ్ణి లోనికి తీసుకువెళ్ళడానికి యత్నిస్తూవున్నది.

ఇంతలో "ఏయ్, ఆగండి. వాడిమీద గనక దెబ్బపడ్డదా మీ పరువు దక్కదు." అని పెద్దకేక వినవచ్చింది. ముకుందానికి తన పార్టీవాళ్ళు వచ్చేస్తున్నా రని ప్రాణం లేచి వచ్చింది. అంతా అటువైపు చూశారు. పార్థసారథి బాణాకర్ర పుచ్చుకొని వడివడిగా అక్కడకు వస్తున్నాడు. వానకురిసి వెలిసినట్లు అంతా నిశ్శబ్దమయింది. ఎత్తిన కర్రలు అట్లాగే నిలిచిపోయినవి. పార్థసారథి వాళ్ళను సమీపించి "ఎందుకు మీ రన్యాయంగా వాడి ఇంటిమీదికి రావడం? వాడి సంగతి నాకు బాగా తెలుసు. మనిషి పెంకెవాడే కావచ్చు! వాడిదగ్గర యిటువంటి చెడుబుద్ధు లేమీ లేవు. మీఅమ్మాయినిగురించి వాడి తరఫున నేను హామీయిస్తున్నాను. మీరు వెళ్ళిపొండి" అన్నాడు. అంతటితో వాళ్ళు ముఖాలు వ్రేళ్ళాడవేశారు.

పార్థసారథి అన్న మాటలకు ముకుందం తన చెవులను తాను నమ్మలేకపోయాడు. ఆనందపారవశ్యంతో ముకుందం పార్థసారథి రెండు చేతులూ పట్టుకుని "నిన్ను అర్థంచేసుకోలేకపోయినందుకు సిగ్గుపడుతున్నా రా సారథీ! ఆరోజున నోటుకు డబ్బు చెల్లించింది గూడా నువ్వేనని ఇప్పుడు తెలుసుకున్నాను. నిన్ను అపార్థం చేసుకున్నందుకు నన్ను క్షమించు" అన్నాడు.

అప్పుడు పార్థసారథి "అయితే నీ తప్పుకు శిక్ష వేస్తున్నాను. యిప్పుడు నాతో మాయింటికి భోజనానికి రారా!" అన్నాడు.

---

# జీవితపరమార్థము

శ్రీ సత్యవోలు శేషగిరిరావు

మతిచెడి నీ పాటి మానవుల్ వారి
చిత్తస్థిరత్వమ్ము చెడుటకు నీవు
కారణం బని నిన్ను దూఱుచు నుండ
స్థిరమతి వై నీవు చెలగెద వేని.

నీ పాటిమానవుల్ నిన్నొకింతైన
నమ్మకుంటకు కారణములు వారలకు
గల్గియున్నను నీవు కలరూ పెరింగి
నీ పైన నమ్మిక నిల్పుకొం టేని.

వేచి యుండగ గల్గి వేసర వేని,
నిను గూర్చి దబ్బఱల్ వినుచున్న నైన
నీ వసత్యము లాడ నేరవ యేని,
జనులకు నీ పై నసహ్యంబు గలుగ.

పట్టున నీ వడవడి పరి యేని,
కడు మంచివాడ వై కనబడ వేని,
అతి తెలివిగా మాటలాడ బో వేని
స్వప్నమ్ములను గాంచువాడ వై యుండి.

గాలిలో మేడలు కట్టబో వేని,
ఆలోచనలు సేయ నలవాటు పడియు
నాలోచనలె గమ్య మై యుండ వేని,
జయ మపజయమును సౌఖ్య దుఃఖముల.

దుల్యంబు గా నీ వెదుర్కొందు వేని,
ఒకనాడు నీ వాడి యున్నట్టి నిజము
వసుధ మూర్ఖులను లోబరచుకొనంగ
ఖలులచే తారుమారు గావింప బడుట.

యాలించి సహియింప జాలుదు వేని,
అమలినమతి జీవితము ధారవోసి
చేసినకార్యముల్ శిథిలమ్ము కాట
గనియు జీర్ణము లైన పనిముట్లతోడ.

మరల నిర్మింపంగ దొరకొందు వేని,
నీవు పొందిన జయానీకమ్ము నెల్ల
పణముగా నిడి రెప్పపాటుకాలమున
పోగొట్టుకొని వెండి మొదలుపెట్టుచును.

పోయినదానికై పొక్కబో వేని,
స్నాయువుల్ హృదయమ్ము సత్తువ నెల్ల
కోల్పోయినప్పుడు గూడను నీవు
నీ మనోబలముచే నిఖిలాంగములను.

స్వాధీనపరచుకో జాలి కార్యములు
నెరవేర్చుకొనుట నీ తరమయ్యె నేని,
పలుతెఱంగుల మనుష్యులతోడ దిరిగి
నీ సద్గుణౌఘంబు నిల్పుకొం దేని.

వరరాజకోటితో నడయాడు చుండి
పామరస్నేహంబు వదలబో వేని,
ప్రాణమిత్రులు గర్భవైరివర్యులును
నిన్ను బాధింపగా నేరర యేని.

ఒక్కరు నతిగ గాకుండ నెల్లరును
నిన్నెల్లయపుడు గణించెద రేని,
కడచిన మరిరాని కాలచక్రమును
క్షణమైన వినవాడ జాలవ యేని.

కోరకున్నను సమకూరు భాగ్యమ్ము
గొని యెద్దియును మది గోరబో వేని,
అగణితభాగ్యసమంచితంబగుచు
ప్రకృతిసౌందర్యవిభ్రాజితం బైన.

యీ వసుంధర నీదియే నిక్కువముగ
నరసి జీవితపరమార్థమ్ము దెలిసి
సదమలజ్ఞానసంపద గల్గి యెల్ల
మానవుండవు నీవు వానందనుడవు.

# అవధానుల వారి అల్లుడు

●

శ్రీ తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి

౧

అవధానులవారి యల్లు డందమైనవాడు మిగుల,
ఏలేశ్వరయువకులలో ఇంతటి సుందరుడు లేడు.
తెల్లజామపండువంటి దేహకాంతి కలుగువాడు,
ధవళమల్లికోరకముల దంతపంక్తి కలుగువాడు,
యవనదేశ్యమంజులబుజాశైన నాస కలుగువాడు,
నీలాలక లల్లాడెడి నిండుమోము సొబగువాడు,
ఉపవనపున్నాగతరువునోజ నిడుపుటొనువువాడు,
నిజజానువులం దాకెడి నిడుదబాహుయుగమువాడు.
వీరభద్రమూర్తి బయలువెడలి వీథి నేగునపుడు
వెనుదిరుగని వీక్షింపని వికసింపని వెలది లేదు.
నిజగ్రామనికటముగా నిండుగ పారెడి కృష్ణా
తటినీసలిలమ్ములందు తానమాడునపుడుగాని,
ఎన్నెన్నో చిత్రగతుల ఈదులాడునపుడుగాని
ప్రోదినీతటాన జనము పార్ష్ణమునం జూచుచుండు.
స్నానానంతర మతండు సన్నని తడివలువలతో
కృష్ణాతీరమ్మునుండి గేహమ్మున కేగునపుడు—
వ్యాయామప్రస్ఫుటమగు వాని దేహసౌష్ఠవమ్ము,
గమనములో నొలుకు సొబగు కనుపండువు చేయుచుండు.
మూర్తికి గల దెంతో వసతి—మున్నూరెకరముల భూమి
చెంగలువల చెరువు, దాని చెంతనె మామిళ్ళతోట.
గ్రామమునకు చేరువగా గట్టించినవాడు మేడ
నూతనవాస్తుప్రకార మాతని జనకుండు నిరుడు.
ఆవరణమునందు చిన్ని యారామము, చుట్టుభిత్తి
అంగణమున పూలమొక్క లన్నిదెసల ఫలతరువులు.
మావితోటశాలలలో మంచి పశుసమృద్ధి కలదు,
అన్నిటికిని తలమానిక మైన కపిలగోవు వరలు.
పెంచినారు వీరభద్రు పితరులు మేనత్తకూడ
ఒక్కండే బిడ్డనుట ఎక్కుడగు గారాముతోడ.
చెడిపోవక పెంపకమున చిన్నవాడు సక్రమముగ
జనప్రీతిపాత్రముగా సద్వర్తను డే యయ్యెను.
అయిదేడులనాడు మూర్తి కవధానులవారు తనయ
నిచ్చి పెండ్లిచేసినారు ఎంతో వైభవముతోడ.
వారణాసిలోన మూర్తి వ్యవసాయపరీక్ష యిచ్చి
గతవారమునందె నిజగ్రామమునకు వచ్చినాడు.
అతని విద్య ఆనాటికి అవసితమై యుండుకతన
భార్యదెసకు వ్యగ్రమ్మయి భావము ప్రేల్లురుకుచుండె.

౨

అవధానులవారి కూతు రందమ్ముల రాజహంసి !
ఆ పల్లంపేటలోన అంతటి చక్కనిది లేదు.
పరిపాండుచ్ఛాయమయ్యె పసిమినిగ్గు లీను మేను,
హరిణీనేత్రముల రేఖ లందిపుచ్చుకొనెడి కనులు ;
భూమీధరపంక్తిబోలు భ్రూయుగ్మము, కోలముఖము,
సోగగంధఫలీనాస, శోణపూర్ణబింబోష్ఠము ;
చరణమ్ములు హస్తమ్ములు సరసీరుహసన్నిభములు
కల్యాణీదేవి పోలుచు గండారపు బొమ్మవోలె.
అయిదేడులనాడు జరిగె అసదృశవైభవముతోడ
వీరభద్రమూర్తితోడ వివాహమ్ము కల్యాణికి.
కుతుకముతో చెప్పికొనిరి కొన్నినాళ్లు సంగీతము
ఆగ్రామము విడిచి చనెడి యంతవరకు నాచార్యులు.
ఆంధ్రగ్రంథములు కొన్ని యాసక్తిని పఠియించెను,
అయినను భాగవతమన్న ఆస్థ మెండు కల్యాణికి.
ఆత్మీయుల కన్యలతో ఆడుచుండు పచ్చీసును,
అప్పుడప్పుడు వినోదముగ అల్లికపని చేయుచుండు.

కాలాతిక్రమమునందు కలిగిన సంతాన మగుట
కల్యాణిని పెంచినారు కడు గారాబమ్ముతోడ.

ముప్పది మాసములవాడు ముద్దియ పుష్పవతి యయ్యె,
నిండుకొనియె పరిణాహము నితంబమున, వక్షంబున.

కలవారలు గాన లోటు కానబడదు వారియింట,
పాలేరులు పనికత్తెలు పరిచారకు లున్నవారు.

పాకక్రియలోన తనకు పలుమారులు సాయపడగ
తలపెట్టెడి తనూజాతను తల్లి నివారించుచుండు.

ఉభయకుటుంబములవారి కున్నవి సన్నిహితముగా
బాంధవ్యమ్మును మైత్రియు పరిణయాత్పూర్వమందె.

బాల్యమునసె తమ బిడ్డలు భార్యాభర్తలుగ ప్రీతి
పెద్దవారు నిర్ణయించి పెండ్లిచేసినారు పిదప.

పెండ్లి కనంతరముకూడ చెరకు లేదు కల్యాణికి
ప్రవర్తించు చనవుతోడ భర్తృసన్నిధానమందు.

జవ్వన మంగమ్ములందు సన్నద్ధం బయినకొలది
పతిమీదికి నామెమనసు పలుమారులు సాగజొచ్చె.

వారణాసినుండి యతడు వ్రాసిపంపు ప్రతిలేఖకు
ఉచితమైన ప్రత్యుత్తర మొసగుచుండె రక్తి నామె.

చాటుగ పలుమార్లు పతిచ్ఛాయాపట మీక్షించుచు
ఎడనెడ నందలి పెదవులు వ్రీడాభరమున ముద్దాడును.

నాఘు డంపు కథావళులు నవలలు పత్రికలు చదువు,
పాడుచుండు నవ్యకవుల ప్రణయకావ్యఘట్టంబులు.

వంగదేశకలాకారవతంసరచితంబులైన
వర్ణరమ్యచిత్రపటావళులు విలోకించుచుండు.

రకరకాల క్రొత్త పాదరక్షలు ధరియించి తిరుగు
తనుజాతను గని ముద్దున తలిదండ్రులు నగుచుందురు.

పదునేడవ యేడు నడచుపట్టున తారుణ్యశ్రీ
కల్యాణీదేవి తోచె గజ్జెలుగ్రముల గున.

వారణాసినుండి భర్త వచ్చిన వృత్తాంతము విని
తన్ను జూడ నెపుడు వచ్చు దయితుండని పలవరించు.

తారుణ్యం బనురాగము దశముగ మిశ్రునీకరింప
ముగ్ధసుఖస్వప్నంబుల మునిగి తేలిపోవుచుండె.

3

అవధానులవారి భార్య కాపుల్లంపేటలోన
ఎందును సరివచ్చునట్టి యిల్లాలెవ్వరును లేదు.

అతిథుల కభ్యాగతులకు అలయదు వడ్డనలు చేయ,
సదనమునకు వచ్చు దీనజనులకు దానము లొసంగు.

కానబడదు వర్తనమున గర్వరేఖ యెన్నండును,
చల్లని వాక్కుల నాయమ సంప్రీతి జనింపజేయు.

శాంతమూర్తి యన్న జనస్తవభాజన మగుటె కాక
భర్తయాదరంబుకూడ పడసిన దా ధన్యురాలు.

నలుపది సంవత్సరాల నడుమవయసున నున్నయామె
ఆరోగ్యానందంబుల కవతారమువోలె దోచు.

అడిగిన నేగాని భర్త కాలోచన చెప్పదామె,
భర్తకు రుచియింపనట్టి పలుకు నోట రానీయదు.

పాకమింటిలోని యాప్తబంధుజనము చేయుగాక
పల్లభునకు పత్రమందు వడ్డనంబు తానె చేయు.

జడ యల్లును తనూజాతకు స్వహస్తములతోడ నామె,
అభిలషించునపుడు దుహితకలంకృతియు సలుపుచుండు.

శ్రావ్యమైన కంఠముతో చదువుచుండు భాగవతము,
పాడుచుండు రకరకముల పాటలు విశ్రాంతివేళ.

సహోదరుని కుటుంబమ్ము జననియు నా గ్రామమందె
కలదు సుఖముగానె, బంధుగణముకూడ కొంత కలదు.

తనయమీద నున్నట్టులె తన యల్లునిమీద గూడ
అవధానులవారి భార్య కధికమైన ప్రీతి కలదు.

వారణాసినుండి లేఖ వచ్చినపుడు తన దుహితకు,
దరహాసము చేయుచుండు తల్లి మహోసహానమూర్తి.

పరికిణీలు మాని యింక భర్తతోన నెపుడు పుత్రి
కాపురమ్ము మొదలిడు నని కాంక్షించుచు నుండు నామె.

వ్యవసాయపరీక్ష యిచ్చి వచ్చినాడు స్వగ్రామము
జామాతని విన్నయపుడు సంభ్రమమ్ము చెందె నామె,

౪

అవధానులవా రసాధ్యు డనియెడి
ప్రథ యున్నది యాప్రాంతంబులలో.

అగ్రహారమం దర్ధభాగమున
స్వత్వము కలిగిన చండశాసనుడు,
తనవాక్యంబే తప్పనిసరిగా
నిర్వహించుకొను నిపుణవర్తనుడు.

క్రమాంతమ్ముగా శాఖకసంహిత
శ్రద్ధధానుడై స్వాధ్యాయమ్మును
చేసినవాడట చిన్నతనమ్మున,
ఆయన వేదాభ్యాసజడుండని
భావించినచో ప్రమాదం బె యగు.

బ్రాహ్మము క్షాత్రము ప్రస్ఫుటముగ నే
తత్ఫాలమ్మున తాండవమాడును.

ప్రతిస్పర్ధులను ప్రధానన్యాయ
స్థానము లన్నిట సక్రమమ్ముగను
తీర్థయాత్రవలె త్రిప్పి జయించిన
అసాధ్యకుశలుం డగ్రహారికుడు.

కఠినమానసుడు కా డవధానులు.
సాయము వేడిన శాంతవర్తనుల
కెల్లర కాయన హితమే చేయును.

అగ్రహారికము లభియోగంబుల
జయ మొందుటచే శాంతచిత్తమున
చేయును కాలక్షేపము గృహమున.

పూర్వమె విశ్రుతపుణ్యతీర్థముల
సేవించుటచే చీటికి మాటికి
అన్యనగరముల కరుగం డాయన.
గ్రంథమ్ములతో కాలక్షేపము
జరుగుచుండు విశ్రాంతి వేళలను

ధర్మపత్ని యెడ నిర్మలరాగము
ఆదరమును గల బాధ్యాసురునకు.
పుత్రిక యన్నను పూర్ణప్రేమము,
లోపం బెరుగక లాల్మని పెంచెను.

పన్నెండేడుల ప్రాయపు కన్నెకు
ఘనముగ జేసెను కల్యాణంబును.
అల్లునియెడ గల దధికప్రీతియె,
వరదక్షిణ అవ్వారిగ నొసగెను.

పుత్రిక కల్లుడు పుస్తకంబులను
బహుపత్రికలను ప్రణయలేఖలను
బహుమానంబుల బంపుచు నుండుట
తెలిసియు, అవధానులు వారింపక—
వారలయెడగల వాత్సల్యమ్మున
దరహాసముతో తల పంకించును.

పనుకటివర్షము వియ్యంకునితో
వ్యవహారమున వివాదం బెట్లో
పెరిగిన కతమున భీష్మించుక, త
త్సదనములోనికి జనుట మానుకొని
అవధానులు, తన యనుంగుకొమరిత
అడుగుపెట్టబో దత్తవారి గృహ
దేహళిపై నని దీక్ష వహించెను.

విద్యాభ్యాసం బుద్యోగాంతం
బగుట లేటికని అల్లునితోడను
మాడబ్బింబుల మునుపే చెప్పెను.

ప్రస్తావనలో బంధువు లల్లుని
మాట యెత్తునెడ, 'మన గృహంబున నె
ఉండవచ్చు గద ! ఉద్యోగంబా
అతని కేటికి !' అని వచియించును.

ఏలేశ్వరమున కేగుట మానెను.
కాని అల్లునెడ గాఢప్రీతియె,
యాదృచ్ఛికముగ నల్లుడు వచ్చిన
ఆదరించువా డతనిని శ్వశురుడు.
అరుగుదెంచినపు డల్లుం డత్తకు
భార్యకు నిజముగ పర్వదినం బే.
స్వగ్రామమునకు జనుదెంచినవా
డల్లుండని విని అవధానులవా
రట్టిట్టయినా రాలోచనలో.

౨

కృష్ణవేణీతరంగిణిపైన ఉయ్యాల
లూగుచు మూగుచు నవలియొడ్డు కట్టుమీద
చేరు నావవిధాన చిత్తచాంచల్యాన
గడపినా డొకనాడు కడుభారమున మూర్తి.

చాటుగా నొకమారు శ్వశురగేహము జేరి
ఎట్లయిన తన భార్య వీక్షించిరావలయు
నన్న యుద్యోగంబు మిన్నందినది, కాని
జనకుండు విన్నచో క్షమియింప డను భీతి
పొంగునల్లంతనే భూమిస్థలికి దించె.
తన తోటకును నదీతటమునకు నాతండు
కాలుకాలిన పిల్లికరణి దిరుగుచునుండె.

అవలియొడ్డున నున్న ఆంజనేయుని మంది
రమునకో, దాపులో రంగనాథుని గుడికో
భగవాను సేవకై భార్య యరుదెంచుచో
చూచాయగా నామె జూడవచ్చు నటన్న
ఆశ సప్తాహమున కడుగంటిపోయినది.

సమముగా పితతోడ సహభోజనము లేదు.
ఆమ్రోపవనసదనమందే నివాసమ్ము.
ఏకాకిగా కాల మెట్లో గడపుచుండ
ఒకనాడు ప్రియదర్శనేచ్ఛ గాటంబయ్యె.

నది దాటి చని చిన్న నావలో సాయాహ్న
మవలియొడ్డున నున్న హనుమానుగుడి జేరి
నమస్కారు కావించి మూర్తి ప్రదక్షిణాల్,
స్తుతియించి దైవతము, జూచె గ్రామమువైపు.
అటను పుల్లమపేట అనతిదూరమ్ములో
అర్ధచంద్రాకృతిగ అవనీజములలోన
సంఘన్నమై కొంత, స్పష్టమ్ముగా కొంత
చిలుకపచ్చని రంగుచీర కట్టిన సతీ-
కమనీయరేఖలో కానవచ్చుచు నుండె.

ఇంతలో నొక బంధు వేతెంచి గుడిదరికి
అడిగి కుశలప్రశ్న; లవధాను లానాడె
గుంటూరు చనిరట్లు, కొలదిదినములలోనె
తిరుగవచ్చు నటంచు తెలిపి చనె లోపలికి.

గుండె కొంచెము కొట్టుకొనుచుండగా మూర్తి
కొంత మోదమ్ముతో కొంత కౌతుకముతో
బయలుదేరెను శ్వశురభవనమార్గమువెంట.
మస్తకమ్మును వాంచి మందగమనమ్ముతో
అత్తవారింటిపై పాత దరిగడివేళ
చంద్రికల్ వ్యాపించె సర్వదిక్కులయందు.

గ్రామమ్ము మొగదలం గలదు వారి గృహమ్ము;
తూర్పుదిక్కున నుండు తోరణం బున్నతము.
ప్రక్కగా ఆగ్నేయదిక్కులో వంటయిలు,
పశ్చిమమ్మగ నుండు పసువులున్ శకటముల్.
నారంగతరువులున్ నారికేళంబులును
ఆమ్రభూమిజమ్ము లన్యదిక్కుల గలవు,
చాలుగా నెసనెడను పూలమొక్కలు పొలుచు.

వివృతమ్ముగా నున్న వీధివాకిలి వెంట
అరిగి మెలమెల్లగా నంగణముమీదుగా
మూడుదిక్కుల దృష్టి మూర్తి ప్రసారించె.
ఈశాన్యభాగాన ఎత్తరుగు పంచలో
కర్రకుర్చీమీద కల్యాణి కూర్చుండి
ఇందుబింబమువంక ఏకాగ్రదృష్టితో
వీక్షించు చొక్కింత వివశయై కనుపట్టె.
ఉత్ఫుల్లమయ్యె నాయువకు నేత్రద్వయము,
గుండె దడదడ కొట్టుకొనె నొక్క పర్యాయ,
మొక్కసారిగ నతని యొడ లెల్ల ఝల్లుమనె
ప్రాణేశ్వరిం గాంచు ప్రథమక్షణమునందు.
కొంచెమాగి యతండు గొంతు సవరించుకొని
ముందడుగు వేయగా ముఖము త్రిప్పుచు ముగ్ధ
వీక్షించె ప్రాణేశు విస్మయస్తబ్ధయై.
చేరువకు నరుదెంచి చిన్నిగొంతుకతోడ
కల్యాణి యని పిల్వగా ప్రాణనాథుండు
వెస లేచి ద్వారమ్ముదెస కడుగు వేసినది.

ఎక్కి సోపానమ్ము లొక్క పెట్టున నతడు
ప్రాణప్రియం జేరి బాహువుల్ చాపగా
అప్రయత్నముగానె ఆత్మేశుకంఠంబు
కౌగిలించినది యా కన్నె గాఢమ్ముగా.
గాఢపరిరంభణగ్రస్తయా ప్రియురాలి
గండమ్ము లోష్ఠముల్ కంఠంబు మూర్ధంబు
ముద్దుజడివానలో ముంచివేసె ప్రియుండు.
ఎవరైన వీక్షింతు రేమో యనుచు ముగ్ధ
అరుగుచుండెను లోని కనుసరింప నతండు.
మన కేమి భయ మనుచు మరలించి గదిలోని
కామె నల్లన మూర్తి, అర్గళము బంధించె.

దీపప్రదీప్తిలో దేవతాకృతితోడ
విలసిల్లు భర్త గని విభ్రాంతితో బాల-
హృదయమ్ము కరగిపోయినది దేహముతోడ.
ముగ్ధభార్యను మరల మూర్తి యుద్రేకాన
బిగి కౌగిలింతలో జిగిముద్దుజడిలోన
వివశురాలిని జేసివేసె నిముషములోన:
ప్రాయంపు దంపతుల భావ ముద్రేకించె.

౬

అవధానులవారి భార్య ఆత్మజాత నెందులకో
పిలిచె వంటయింటనుండి బిగ్గరగా నా పేరను.
అల్లుని యాగమనవిషయ మవిదితంబు, కాన నామె
కల్యాణీ యని పిలిచెను క్రమ్మర నెలుగెత్తి సుతను.
ప్రతివచనము రామి నామె బయలువెడలె తనుజాతను
పాకశాలలోన నేదో పనికొరకై కొని తేరగ.
నీరవమ్ముగా వల్గనిర్మోచన మాచరించి
విడిచి కత్త్య, పంచ జేరి వీరభద్రమూర్తి వేగ
అవతరించి మెట్లవరుస అంగణమ్ము జేరుచుండ.
అమ్మాయీ, అమ్మాయీ అనుచు వచ్చుచున్న తల్లి
జామాతను గాంచి తొలుత సంభ్రమ మెక్కింత చెంది,
సంతుష్టస్వాంత యగుచు స్వాగతవాక్యంబు పలికె.
'మీ పెల్లరమును సుఖులము, మీ యింటను కుశలమ్మా?
కానరారు మామగారు కల్యాణికి సుఖమేనా?'
అను నల్లుని వచనమ్ముల కత్త బదులు చెప్పె. అనిరె—
'కల్యాణీ, మూర్తి వచ్చె, కాళ్ళకు నీరమ్ము తెమ్ము;'
గదిలోపలనుండి వెడలి కల్యాణి జలమ్ము దెచ్చి
సిగ్గున తొట్రిలుచు వచ్చి చెంత చెంబు నుంచి తొలగె.
'చూచిపోవ వచ్చినాను, నే చనవలె కృష్ణ దాటి,
అలసింప నావ దొరకదనిరెను తల వాంచి మూర్తి.
మామగారు లేరనిరెందు మాత్రమునకె చనవలెనా?
కలవరించుచున్నది మా కల్యాణి అనుక్షణమ్ము!
'చనవచ్చును లెమ్ము రేపు.—స్నానమునకు కల్యాణీ
వేడినీరు తోడవమ్మ వేగిర మే' అనిరె నామె.
పరిచారకు బిలువ, వాడు పటాసనము వెన్నెలలో
వేయంగా గూరుచుండె వీరభద్రు డొంటరిగా.

శ్రోత్రవస్త్రములను తల్లి కూతురిచే నిప్పించెను
జామాతకు ప్రీతితోడ స్నానానంతరమునందు.
పంచాంగం బవధానుల భార్య చూచి సంతసమున
కొత్తచీర కట్టించెను కొమారితకు చిరునగవున.
ఒక్కమారె భోజనమున కుభయుల గూర్చుండబెట్టి
మృదుమధురాలాపమ్ములు తుదివరకును జేయుచుండె.
ప్రథమయామ మైనవెనుక పానుపుగదిలో నమర్చి
పండుకొనుము గదిలో నని పలికెను జామాతతోడ.
కల్యాణీదేవి కలంకారం బేకాంతమందు
చేసి జనని గదిలోనికి సిగ్గిలు పుత్రికను బంపె.
'గ్రహించిన యట్లు తోచు కల్యాణీ, మన సంగతి
చాల దొడ్డతల్లి!' యనిరె జామాతోడ వల్లభుండు.
ఆ శోభనరాత్రివేళ అవధానులవారి ప్రతిన
భావింపని చందంబున భగ్నపరీపాక మొందె!

౭

రాతిరి యింటికి భోజనమునకై రానందుల కేదో
సాకు చెప్పి తప్పించుకొనియెను చల్లగ కొమరుండు.
కాలం బంతయు తోటయింటిలో గడపుచుండుకతన
ఆత్మీయులకును విదితము కాలే దాతని వృత్తంబు.
మరునటిరాతిరి చేసి భోజనము మావితోట కేగి
అచ్చటి గృహమున నిదురించినవా డర్ధరాత్రిదాక.
చిన్నసంచిలో పలయు దుస్తులను సిద్ధముచేసికొని
చేరినాడు భద్రమ్ముగ కృష్ణాతీరమ్మును మూర్తి.
నావ చేసికొని అర్ధరాత్రమున నదిని దాటువెడల
అనుమానాస్పద మగుట తథ్యమని అట్లు చేయలేదు.
పాలుచుచుండె గగనమ్మున చంద్రుడు పుచ్చపూవువోలె
నిఖిలలోక మాయర్ధరాత్రమున నీరవమై యుండె.
దేవసదనముల కించుక యావల తిరుగు నుత్తరముగ
పర్వతపంక్తుల నడుమగ కృష్ణాపవిత్రతోయములు
నదీతటమ్మున పశ్చిమమ్ముగా నడిచి కొంతమేర
చడ్డీమాత్రము ధరించి, శిరమున సంచి కట్టినాడు.
వీక్షించినవా డావలితీరము వీరభద్రమూర్తి.
అవలిగట్టున అంజనేయుడి కభిముఖమ్ముగాను
అనువగుచోటను సలిలమ్ములలో నవతరించినాడు.

తటములు రెంటను రాతితో కట్టిలను తలపించుచునుండు.
అర్ధరాత్రం బింకుమించుగా వచ్చుటి నైశాల్యం,
జేకాలంబు నిండియుండు జల మెండిపోవకుండ.

చల్లని నీరము సోకినంతనే జలదరించె మేను,
అయినను వేసవికాల మగుటచే అతిశీతము కాదు.
పతి కౌగిటిలో కవోష్ణసౌఖ్యము సంస్మరించినాడు,
వివిధసుఖమ్ముల భావనచేయుచు వేగ యీదినాడు.
కొంతభాగమును మండూకమువలె సంతరించినాడు,
బారలు వేయుచు నదిలో విశేషభాగ మీదినాడు.

తల యేమాత్రము నదీజలంబుల తడవనీయలేదు.
తమూబలంబున కాళ్లలంబునను తటిని దాటినాడు.
కాళపూర్వమే యిరువదినిముషాల్ గట్టుచేరినాడు.
పొడివస్త్రంబులు ధరించి మాటేగ పోయినాడు గుడికి,
ఆంజనేయునకు ప్రదక్షిణమ్ముల నాచరించినాడు
చెట్లమాటుగా అత్తవారి యిలు చేరినాడు మూర్తి.

జాలమార్గమున దీపకాంతిలో జాయావదనంబు
వీక్షించినవా డుత్సాహముతో వీరభద్రమూర్తి,
గడపచెంత గల కలశోదకమున కాళ్ళు కడిగినాడు.
భార్య తుడిచినది వస్త్రఖండమున పాదమ్ముల తడిని.
శయ్యాగారమునై పున కుథయులు సాగిపోయినారు.

౨

ఈశ్వరుడే పట్టజాల డింటి దొంగ నను సామెత
అన్వర్థం బయినది యా యవధానులవారి యింట.
పనులు చూచి గుంటూరున బ్రహ్మశ్రీ వేదమూర్తి
అవధానులవారు వచ్చి రాత్రియగ్రామమునకు.
నాల్గురేలు నిజగృహాన నడచు వృత్త మెరుగరాయి
యథారీతి నతడు కాలయాపనమ్ము చేసినాడు.
పగటివేళ నిజపుత్రిక బహుశీఘ్రముగా నిద్రించెడి
కారణమ్ము నించుకైన గ్రహియింపనె లేదు తండ్రి.
చనియెను శాంతముగ రెండు సప్తాహము లీతీరున :
కాని కాలమెుక్క రీతి గడవ దనుట తథ్యమె కద!
నాటి యర్ధరాత్రమందు నదిలో నీదునపుడు మూర్తి
మెరయుచుండె నాకసమున మిలమిల నక్షత్రమ్ములు.
కాని కొంతదూర మీద గగనమ్మున చిరుమబ్బులు
వ్యాపించుచు చినుకులు పడువైఖరి కానంగవచ్చె.

బాహువులను సారించుచు బారుటీతమీద నదీ
తటమును ప్రాపించినాడు త్వరితముగా భద్రమూర్తి.
వలిపములం దాల్చి యత్తవారియింటి కేగుచుండ
చిటపట మని పడసాగెను చినుకు లవిశ్రాంతమ్ముగ.
శ్వశురగృహము జేరుసరికి వస్త్రము లన్నియును దడిసి
నీరు కారిపోవుచుండె సెమ్మెనున ధారలుగా.
తుండుగుడ్డతోడ నొడలు తుడిచికొనుచు, పంచలోన
ఆరవేసి యున్న బట్ట లాతడు ధరియించినాడు.
కల్యాణీదేవితోడ కవోష్ణసుఖం బనుభవించి
వేకువనే అచటినుండి వెడలిపోయినాడు మూర్తి.
అవధానులుగారు స్నాన మాచరించి యుదయవేళ
పంచలోని కరిగెను మడిబట్టలు ధరియించుటకై.
దండెముపై గానరామి ధౌతవస్త్రయుగళి మతడు
'ఆరవేయ మరచితివా' యని భార్యను మందలించె.
ప్రతివచనం బీయ కామె భర్తృముఖము విలోకించి
చీరచెరగు వ్రేళ్ల జుట్టి చిరునగవున నిలిచియుండె.
మరల భర్త ప్రశ్నింపగ మందహాసవదనముతో
'అల్లుడు వానిని ధరించి ఆరిగియుండనోపు' ననియె.
'అల్లుడు ధరియించు టేమి' అనుచుండగ నతని దృష్టి
పడినది యాకస్మికముగ తడిబట్టల కుప్పమీద.
అదియే మను భర్తమాట 'కల్లుడు గతరాత్రివేళ
విడిచి వాని నిచ్చటనే వెడలియుండు' ననియె నామె.
భర్తృప్రశ్నపరంపరకు భార్య యనియె సంగ్రహముగ:
'గడచె రాత్రి అల్లు డిటనె కల్యాణీదేవితోడ.'
అవధానులవారి చిత్తమందు బండ్లు పరుగులిడియె
భూకంపపురస్సరముగ పొంగిపోయె కృష్ణానది.

భార్య యింటిలోన తెచ్చి పట్టుబట్ట లిచ్చువేళ
ఘటన లెల్ల విస్తరముగ గ్రహియించెను యజమానుడు.
తన దృఢప్రతిజ్ఞ విడిచి తనయమీది ప్రీతిచేత
శిరస్సు వంకించి యనియె చిరునగవున భార్యతోడ :
"కానీ గజయీతగాడు కావరాని యపాయమ్ము
అట్టి నదీజలములయం దడుగడుగున పొడము నమము.
"సుముహూర్తము పెట్టించెద అమావాస్య దాటగానె,
తన తండ్రికి తెలియజేయు తత్క్షణమే అని చెప్పుము."

# కీ. శే. మధురభారతి మాధవపెద్దికవి

[మరణము: ౬-౨-౫౦]

శ్రీ పిల్లలమర్రి హనుమంతరావు

మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రిగారు ౧౮౯౫ ప్రాంతంలో గుంటూరుజిల్లా బ్రాహ్మణకోడూరు గ్రామాన జనన మొందినాడు. ఈకవి తండ్రి శంకరయ్యగారు పరమపౌరాణికోత్తములు.

తిరుపతివేంకటేశ్వరకవులు అవధానాలు చేస్తూ ఆంధ్రదేశమంతటా సరస్వతీవిద్విలాసాన్ని ప్రదర్శిస్తూ సంచారం చేస్తున్నప్పుడు అనేకయువహృదయాల్ని ఆకర్షించినారు. అలాంటి యువహృదయాలలో మాధవపెద్దికవి హృదయం ఒకటి. పద్యాలు చెప్పుతూ ఆధోరణే జీవితానికి వేలిబాటగా తీర్చుకోచూచిన మాధవపెద్దికవి 'తిరుపతివేంకటేశ్వరశిష్యపరమాణువై' నాడు. వెంకటశాస్త్రిగారు ఈశిష్యునిగూర్చి ౨౦-౧౧-౩౬ వ తేదీన వ్రాసిన వాక్యాల్ని ఉల్లేఖించడం అనుచితం కాదు:

"ఇతడు సుమారు ఇరువదిరెండేళ్లకు పూర్వము నాయొద్ద కొన్నాళ్లు మాఘకావ్యమును, కౌముదియు జదువుకొనుటకు వచ్చినాడు. మాదంపతులయందు కేవలము కన్నతల్లిదండ్రులకన్నను అధికభక్తిగా నుండి చదివికొన్నాడు. కాని అతనికి దోచినట్లు చదువుటయే కాని నా యేర్పాటునుబట్టి చదువువాడు కాడు. ఇతని కప్పటికే తెలుగులో మంచి కవితాధార యుండెడిది. ఎట్లో కొంతకౌముదియు, మాఘములో కొంతవఱకును నెఱవేర్చినాడు. ఇతని చదువు గానములో మిళితమగనే యుండునుగాని నాకు లేశమైనలేనే యితనికి నాదనామక్రియ అనెడి రాగముమీద నభిమాన మెక్కువ. ఆకారణమువలన నాకు శిష్యుడై కూడ నా చదువుధోరణి యితరశిష్యులతో పాటుగా నీత డనుకరించువాడు కాడు."

కనక చెళ్లపిళ్ల వారి శిష్యత్వము ఈకవికి దోహదమిచ్చింది. మాధవపెద్దికవి కవితావినోదంతో కాలక్షేపం చేస్తూ, కావ్యానందంద్వారా బ్రహ్మానందాన్ని సాధించిన ధన్యజీవి!

మాధవపెద్దికవి ఉన్నచోట పల్లగంపను ఎగబడినట్టుగా చుట్టూ నోరుతెరుచుకొని ఆయన మాటల్నీ, పద్యాల్నీ వింటూ ఆశేషులు అట్టే నిలుచునిపోయే వారంటే అత్యుక్తి ఏమీ లేదు. ఈయనది హాస్యప్రకృతి. లోకాన్నంతా అదృష్టితో తేలికగా చూడడం ఈకవి అలవరచుకున్న వైశిష్ట్యం: ఈలోకము శాశ్వతము కాదనే ధ్రువనిశ్చయంతో కాలక్షేపం చేస్తూఉండేవాడు. ఈలోకం నిమిత్తమాత్రం: అంచేతే ఒక క్రీడారంగంగా దీన్ని దర్శించి వినోదంతో కాలాన్ని వెళ్లబుచ్చడం ప్రారంభించినాడు. ఇల్లా ఆషామాషీగా ఉంటూఉంటే మాధవపెద్దికవికి జీవితంలో పెద్ద దెబ్బ తగిలింది. అది కామేశ్వరీ (భార్య) వియోగం. దీనికి కవిహృదయం ఎంతగా దురపిల్లిందో చెప్పవీలుకాదు. ఈయనచేత 'పతీస్మృతి' అనే ఖండకావ్యాన్ని రచింపజేసిందా దుఃఖం. అప్పుడు కవిజీవితాన్ని గురించీ, లోకనైజాన్ని గురించీ గాఢంగా ఆలోచించడం ప్రారంభించినాడు:

"నను వంచించెనుగాని పాడునరజ
న్మంబిచ్చి దైవంబు, మిం
టను తాఱంగలయట్టి పిట్టనయి యు
న్నన్ నాబహిఃప్రాణముం
డిన లోకంబున కట్టె నే నెగిరి పో
నే యెన్నడో! ఇంక బా
తిన యీవ్యర్థపుజీవనం బను నెడా
రిన్ యాత్ర సాగింతునే."

'ఇక నెంత శీఘ్రగతిని చేరవత్తునో నీవు వీక్షింతుగాక' అన్న ప్రవచనాలలో పారలౌకికచింత ఆయనమనసులో ప్రాదుర్భావము చెందినట్లు భావిస్తాము.

భార్యావియోగానంతరం ఈ కవి ఎన్నెన్ని కష్టాలో బడినాడు. అంతకు పూర్వం ఆర్థిక దురవస్థ. ఆతర్వాత అంతర వేదన. ఆరోగ్యం చెడి ఉబ్బసానికి గురిఅయి ఈ కవి ఎంతగానో బాధచెందినాడు. లోకానుభవమూ, దురవస్థా—అనారోగ్యమూ హెచ్చినకొద్దీ ఈయన అంతర్ముఖుడు కాజొచ్చినాడు. కవితా ప్రసంగావసరాలలో ఆయన ఎంతగా లీనమైపోయేవాడో చెప్పలేము. మా జమీదు జమీందారుగారైన అప్పరాడ్వైభునికి మాధవపెద్దికవి తన గోడు విన్నవించుకున్న సందర్భాన్ని 'బృందావనం'లో చదివితే ఎంతటి దారిద్ర్యాన్ని అనుభవించినాడో తెలుసుకోగల్గుతాం.

"మడులు మాన్యమ్ము లెల్ల మున్నె తెగన
మ్మంబడ్డ జేసేవో యు
స్త్రీకు లాయప్పులవా రోనర్పగ దవా
దిగ దారకం బాము నుం
డెడి యుద్యోగము గూడ నూడె గడు వ్యా
ధిగ్రస్తమైపోయె నా
యొన లీనాటికి, జీవయాత్ర యిక నె
ట్లో వేంకటాద్రి ప్రభూ!"

ఈయన శరీరానికి బాధ కల్గినప్పుడల్లా కవిత్వానికి అలంకారం చేకూరింది; ఆత్మకు వికాసం కలిగింది.

తెనాలిలో డాక్టరు గోవిందరాజుల వెంకట సుబ్బారావుగారి అండ లభించిన తర్వాత ఆరోగ్యం కుదటబడిం దీయనకు. డాక్టరుగారితో స్నేహమూ, వేదాంతం లక్ష్మీనారాయణగారి ఆదరమూ లభించడంతో మాధవపెద్దికవి తెనాలివాసి అయిపోయినాడు. ఈమహనీయు లిద్దరూ ఈ కవికి పెట్టని కోటలై ప్రాణాన్నదాతలై పరోక్షముగా ఆంధ్రసాహిత్యసరస్వతీ వికాసానికి తోడ్పడినవా రైనారు.

అనేకసభల్లో గౌరవం పొందిన కవి బుచ్చయ్యగారు; కంఠమెత్తి పద్యాల్ని చదువుతూఉంటే ఎంతపెద్దసభ అయినా సద్దుమణిగి అదుపులోకి వచ్చేది. శ్రావ్యంగా నాటనామక్రియరాగంలో ముక్కుతో పద్యాలు చదువుతూఉంటే ప్రజ ముగ్ధులయ్యేవారు.

మాధవపెద్దికవి నలుగురిలో చదువుతూ ఉండడమే కాని రచ్చకు వచ్చింది కాటూరి వేంకటేశ్వరరావుగారి మైత్రి హెచ్చినప్పటినుంచే ననవలె. కాటూరివారి కోమలహృదయంలో మాధవపెద్దికి ఉత్తమస్థానం లభించడం విశేషం. ఆ అమృతముహూర్తమునుంచీ మాధవపెద్దికాటూర్లు జంటబాయలేదు. కాటూరివారున్నారంటే మాధవపెద్దికవి ప్రక్కన ఉన్నాడన్నమాటే. లేకపోతే పాడుంపట్టు పట్టడానికని వాల్గుడుగులు వెనక ఉండైనా ఉండిఉంటాడు. అంతగా వారిరువురూ జీవికాజీవులైనారు.

జాతీయోద్యమాన్ని నవ్యాంధ్రకవులుకూడా యథాశక్తిగా నడిపించినవారే. మాధవపెద్దికవి హరిజనోద్ధరణనిమిత్తం హెచ్చుగా పాటుపడిన కవి. 'అంటరానివా రెవరో కాదు మావెంట రానివారో' అని జాతీయోద్యమంలో పాల్గొనని ఇతరుల్ని ఆధిక్షేపించిన కవిలోని జాతీయభావాన్ని గమనించండి.

"ప్రజసృష్టి కీ వెంత పరమనీచుడవో
పరమేశ్వరుని కంత పరమోత్తముడవు...
గంజి త్రాగుచు లోకకల్యాణమునకు
నాత్మ నర్పించు దేవాంశసంభవులు
ఇటు చుల్కనై పోవు టే జానజాల
నీలోక విది వమ్ము నాలోకి రమ్ము."

ఎంతటి సానుభూతి ఉందో చూచినారా!

'ప్రణయలీల' అన్న ఖండకావ్యం వ్రాసి ఉమరుఖయ్యాం రుబాయీల ప్రభావాన్ని పుంజీభవింప జేసికొన్నా డెన్నడో. ఇటీవల 'ఉమర్ ఖయ్యా'మని ప్రత్యేక కావ్యాన్నే ప్రచురించి ఆభావాన్ని స్థిరపరచినాడు. 'సతీస్మృతి' నిజంగా కరుణరసాకృతివిశేషమే కాని వేరొకటి కాదు; కవిహృదయం ఎంతటి ఉమ్మలికంతో ఉడికిపోయిందో ఈపద్యాలవలన అవగతం అవుతుంది. ఈక్రిందిపద్యంలో చూడం డెలా భార్యాన్వేషణం చేస్తున్నాడో:

"మెడ పైకెత్తి యొకానొకప్పుడు శర
న్మేఘంబులం గాంచి నీ

పాడ నేమే నెఱిగించు నేమెం యని నే
బుద్ధీంద్రియక్షోభతో
నడుగం జూచెద నెన్నొ చుక్కల వనం
తాకాశమం దైన నె
క్కడ నీచక్కని చుక్క గానమన సం
జ్ఞ దెల్పవో పుణ్య సఖీ."

ఒకనాటికాలంలో రామాయణం వ్రాయతలపెట్టి మాధవపెద్దికవి కొన్ని పద్యాల్నిమాత్రమే వ్రాసినాడు. శూర్పణఖనాసికాఖండనము — పంచవటి అన్న ఖండకావ్యాల్ని రచించడమే జరిగిందికాని, ఉద్గ్రంథరూపం దాల్చలే దాసంకల్పం. 'పంచవటి' సహృదయహృదయాలలో సంతోషాన్ని కల్గించిన మాట వాస్తవం; కళాశాలావిద్యార్థులకు పాఠ్యగ్రంథమై మరింత ప్రాచుర్యాన్ని పొందింది. పాత్రల్ని ప్రవేశపెట్టడములో, సంభాషణాశైలిలో, పద్యాల్ని నడిపించడములో, జాతీయాల్ని ప్రయోగించడములో 'పంచవటి' ప్రశంసనీయమైన ఖండకావ్యమని మన్ననలు వడసింది.

ఇంక ఈయన చాటుధారాచక్రవర్తి అన్నట్లు వ్రాసిన చాటువులు చెప్పక చెప్పతూఉంటవి. దైనిక రాజకీయవిశేషాల్ని ఈకవి గమనించి కవితలో జొన్పినట్లుగా మరొకరు వ్రాయలేదంటే సత్యదూరం కాదు. ఆధునిక నాగరకతనుగూర్చి హేళనచేస్తూ వ్రాసిన చాటువులు ఆయన చదువుతూఉంటే పొట్ట చెక్కలయ్యేది. ఎంత మనోహరాలో చూడండి:

"కనులన్ జూడకు భార్యయేనియును నీ
కాలస్థితిం బట్టి జ
ర్మను లైలమ్ము జపాను సబ్బ మెరికా
క్రొపుల్ వియన్నా సులో
చనముల్ స్వీడను చేతిశత్తిమును స్వి
ట్జర్లెండు రిస్టువాచి ఫా
రెను డ్రెన్ ఫ్రెంచికటింగుమీసలును ప్యా
రిస్ ఫాషనే! లేనిచో!
బంగాళిబాబుధోవతికట్టు సేలము
య్యంగారి యుత్తరీయంపు మడత
సెల్యులాయడ్ ఫ్రేము స్పెక్టకి ల్సాఫుఖుల్
స్లిప్పర్సు టార్పెడో షీల్డుపెన్ను
వైటుకళ్ల షర్టు పన్నెహాండ్ కర్చీఫు
రీమోడలు కటింగు రిస్టువాచి
వాకింగుస్టిక్కు నంబరులైటు స్మెల్ సిక్సు
పెన్సి నవల గోల్డుప్లేటా సిజరో
లేనివా డుండియునుగూడ లేనివాడె
యున్నవా డేమిలేకయు నున్నవాడె
ప్లీడరైన నెంతటి గొప్ప లీడరైన
డాక్టరైనను గొమ్ములు దిర్గు యాక్టరైన."

నవ్యాంధ్రకవులలో ఈకవివలె నవ్వినటువంటి, నవ్వించినటువంటి వ్యక్తి మరొకడు లేడు. ఈయనకు శత్రువంటూ లేడు. ఉత్తమకవిత్వంతోనూ, నిత్య సంభాషణంతోనూ ఆహ్లాదాన్ని కూర్చిన నిత్యరసోల్లాసి. కావ్యానందంలో తలమునకలువేసి బాహిరప్రపంచాన్ని విస్మరిస్తూఉండే ఘడియల్ని పరిశీలిస్తే నిజంగా ఈకవి సాధకుడే ననిపిస్తూ ఉండేది. స్వర్గాన్ని కూడా ఈ రససిద్ధిముందు నీరసంగా ఎన్నిన కవిచిత్త మెంత పవిత్రమైందో తెలుస్తుంది; రసద్రష్ట నిజంగా మాధవపెద్దికవి.

"నృత్యసరస్వతీకటక
నిక్వణముం బ్రకటించుకొంచు సా
హిత్య సరస్వతీ హృదయ
మిచ్చుచు గానసరస్వతింబలెన్
సత్యపదార్థకీర్తనము
సల్పెడు మత్కవితాసరస్వతీ
నిత్యత చాలు, స్వర్గమును
నీరస మీరససిద్ధిముందటన్."

అన్నిటికన్నా మాధవపెద్దికవికీర్తిని చిరస్థాయిగా నిలువరించేది ఆయన వ్రాసిన 'మృత్యుంజయ స్తవం'. ఇది శతకమైనా కావ్యత్వాన్ని సాధించిన కృతి. శతక సాహిత్యంలో కాళహస్తీశ్వరశతకాదులతో తులతూగగల స్తోమతు ఈ మృత్యుంజయ స్తవానికి ఉంది. శతకాలన్నీ భక్తిభావప్రకాశితాలైనా, మృత్యుంజయము మాత్రం హాస్యాన్ని మేళవించి సార్థక్యాన్ని పొందుతున్నది. అసలు మాధవపెద్దికవిప్రకృతే హాస్యప్రకృతి. ఆయనరూపమే హాస్యాన్ని కలిగిస్తుంది. వినోదంగూర్చే సంభాషణ, గిలిగింతలుపెట్టే పలుకులూ పద్యాలూ, విదూషకపాత్రకు వేరె వెదుక్కోనవసరం

లేని ఆ రూపమూ హాస్యరసోపస్కారకాలని వేలుగా చెప్పక్కర్లేదు.

"ఒకతే చాలుగదయ్య యేలుకోన, నీ
    మోదా కటయ్య యొక
త్తుక నొంటర్ మతిరొక్క తెర్ శిరసునం
    దుర్ గట్టుకొన్నావు యే
లకో, పైగా మెడనిండ పాము లొడలె
    ల్లర్ బూదియుంగూడ నీ
మొకముర్ మా మొక మేమిరూపమిది! శం
    భూ ప్రేతభూతప్రభూ!"

అని ఏనాడో శంభయ్యను ఎగతాళిచేసి వశం చేసుకో యత్నించినాడు. తరువాత కాలంలో మృత్యుంజయునితో ఇష్టసల్లాపం ఆడవలసినంత చనువు సంపాదించి అంతర్ముఖుడైనాడు. మృత్యుంజయునితో స్నేహం క్రమంగా వృద్ధిపొంది కవిలోని సంస్కార పరిణతినీ, సాధనావిశేషాన్నీ వెలువరచడానికి కారణభూతమైంది. ఎగతాళి స్నేహమైంది. స్నేహం భక్తికి దారితీసింది; భక్తి అమృతత్వాన్ని ప్రసాదించింది. భక్తిపారవశ్యంలో ఈకవి ఎంతగా లీనుడైనాడో చూడండి:

"శ్రీకైలాసనగాధివాస! కరుణా
    సింధూ! జగత్ప్రాణబం
ధూ! కల్యాణగుణావహా! సకలదు
    ర్దోషాపహా! దేవతా
నీకాభ్యర్చితపాదపంకజ! భవా
    నీనాథ! గంగాసనా
థా! కైవల్యమయా! చతుర్నిగమగే
    యా! తండ్రి మృత్యుంజయా!"

లౌకికస్ఫూర్తితో భక్తి నెలా దీప్తిమంతం చేస్తాడో ఈకవి గమనించం డీక్రింది పద్యాలలో:

"మెడ నాగయ్యకు నొక్కచే బుసబుసల్,
    మేనర్ సగంబైన యా
బిడతో నీ కిక నెప్పుడుర్ గుసగుసల్,
    వీక్షించి మీచంద మె
క్కడ లేనంతగ నెత్తిపై రుసరుసల్
    గంగమ్మకుర్, నీచెవిర్
బడు నేలాగునో మా మొఱల్ తెలియద
    ప్పా! మావ మృత్యుంజయా!

ఒక లంబోదరుడైన పుత్రకుడు ము
    న్నున్నట్టిదే నీకు జా
లక కాబోలును సృష్టిచేసితివి యీ
    లంబోదరుంగూడ దీ
గకు గాయల్ బరువౌనకాని, కడుపుల్
    గల్పించి యవ్వాని కే
లకొ యివ్వానికి నొక్కమైని యిడుముల్
    మెల్పింతు మృత్యుంజయా!"

అని తన లంబోదరత్వాన్ని గూర్చి స్పృశించినాడు కూడ!

నిజంగా మాధవపెద్దిసరస్వతి మధుర భారతియే. హాస్యం అణుఅణువునా అగుపిస్తుంటే ఈయనపలుకులు పలుకులనైలదికి మందస్మితం కలుగజేస్తాయి అనడం తథ్యం. ఆంగ్లపదాల్నీ, హిందూస్థానీపదాల్నీ బహుళంగా తన కవిత్వంలో వాడి అవిఘ్నమైన ధోరణికి మార్గదర్శి అయినా డనవలె. పోచాయింపులు - గాడిద తన్నులు - బండారం బైటపడటం - సవాలక్ష లావాదేవీలు - సున్నకు సున్న, హళ్లికి హళ్లి - లెక్కకా జమక - బిస్మిల్లా - టికానాలేదు - కవాకష్టము - భలోభాయిగాడు - హత్తెరీ - ఫట్టు - కామూషు - డిక్కాష్కన్ - గంపశ్రాద్ధపు తలకట్టువాడు - ఇలా జాతీయాలు - మామూలు పలుకుబళ్లు - స్వేచ్ఛగా ఇతని కవితలో వాడినట్లు గుర్తిస్తాము. నవ్యాంధ్రకవులలో మాధవపెద్దికవికి ఉన్న స్థానం అనితరసాధ్యమైనది. "అద్యతనాంధ్రకవిప్రపంచనిర్మాత" లేమన్నారో చూడండి:

"ఇతని చదువుపట్ల మిక్కిలి శ్లాఘ్యముగా నుండును. ఒకరి త్రోవకు బొత్తిగా లేఖినిని నడుపనివాడగుటచే నీతని కవితకు గ్రంథచౌర్యదోషము లేశమును తగులదు. ప్రస్తుత మాంధ్రభాషలో జేరి వాడబడుచున్న హూణభాషాపదము లితని కవిత్వములో నెన్నో యుండును."

ఈవాక్యాలు యథార్థాలు. ఈకవికవిత్వం చావదు. దానికి అమరత్వం అలవడింది. కాని— ఆకంఠం—ఆ కవిమూర్తి! అగపడదు.

ఆవామనమూర్తి—చేతులో పొడుంకాయా—చంకలో ఉత్తరీయపు చుట్టా—పొడుంచారలతోడి ముక్కూ—నిరంతరకవితాప్రసక్తీ—ఆ హాస్యప్రకృతీ—ఆదరంతో కవిమిత్రుల్నీ బంధువుల్నీ సంభావించడమూ—ఇవిమాత్రం ఇక లేవుకదా!

# పౌరుషము

●

శ్రీ ముదిగొండ జ్వాలాపతి లింగశాస్త్రి

భారతయుద్ధమం దొకడు బాలుడు వృద్ధు దొకండు వీరు లన్
వేరు గణించి రా ముసలి భీష్ముడు స్వార్థ మొకింత లేక లో
కూరిమి నాపలేక తను గోరినవానిని వీడలేక తా
నారసి కీర్తి నిండు పదినాళ్లు రణం బొనరించె ప్రేమతో.

తనకంటెన్ మరి వేరె లే దొకడు పద్మవ్యూహముం జొచ్చి రా
నని పెత్తండ్రి దలంచి పంప దను ధైర్యం బింతయున్ లేక చే
యను వేరొక్కటి లేకయున్న గని కర్ణాదుల్ మహావీరు లు
న్నను వ్యూహం బభిమన్యు డొక్కరుడ ఛిన్నాభిన్నమున్ జేయడే.

దేవుండే యగు కృష్ణమూర్తి భగవద్గీతాప్రబోధంబు స
ద్భావంబే యగు జేయ పార్థుడు కృపావ్యాప్తాత్ముడే యౌను యు
ద్ధావిర్భూతఫలంబునం దిరువురం దాసక్తి లేదౌను ధ
ర్మావిర్భూతము పౌరుషం బది రణం బా ప్రేమనిక్షేపమా.

ఆచార్యుండు రణంబు సల్పె గద రాజ్యం బేల గాంక్షించెనే
వాచాటుం డనుకొమ్ము కర్ణు డయినన్ వాంఛించెనే రాజ్యమున్
పేచీపెట్టిన నీకతప్పునొకొ "సుప్రీంకోర్టు"లోనైన భీ
ష్మాచార్యుం డది పౌరుషం బనక ఏమం చింక నొక్కన్వలెన్.

అబలయె గాద ద్రౌపది ప్రియాత్మ లెరింగి వచింప నేర్పు నా
సొబగు లెరుంగుగాద దను జూచి సుయోధనుతోడ సంధికిన్
ప్రబలసుయత్నమున్ సలుప పాటుబడంగలనన్న నన్న నా
కబరియిటుండ చూచెదవుగా యను మాటలు సూదిపోటులే.

తను జంపంగను బుట్టినా డనుట సత్యం బంచు లోనెంచి త
ద్ఘనకీర్తిన్ స్థిరలో స్థిరంబునలుపన్ గాంక్షించి వేయేల నా
తనిచే జచ్చిన మోక్షమం చెరిగి సీతన్ వీడ నారాముతో
ననిసేయంగల నన్న రావణుని వాక్యం బేమి బోధించునో!

నాయకురాలిమీఁద పలునాటను బుట్టి ప్రసిద్ధులౌ మహా
నాయకులెల్ల కత్తిఁగొనినారుగదా సతిమంత్రిణీత్వమున్
జేయగఁజాతుమా యనుచు చిచ్చదిమై పలునాటి నెట్లు గా
ఁజేయగఁజాలెనో కవుల చేతి కలంబున కందునట్లుగన్.

అన్నలదమ్ములు నాస్తి పంచుకొని సౌఖ్యం బొందగా పోరుకే
మన్నన్ ధర్మముగాని వారికొర కన్యాయంబుగా నెవ్వరో
సున్నామైరన నేమిధర్మ మది మెచ్చుంగాంచునే ఎట్లు పో
రన్నన్ పౌరుషజన్య మెల్లరకు ప్రత్యాసన్నమృత్యుస్థితిన్.

పౌరుష మాత్మదేశ సుఖభాగ్యవివేకపురోభివృద్ధి చే
కూరగ నంద రొక్కటయి కూరిమి సల్పిన సార్థకంబగున్
నేరుపు మెత్తు రందరును నిత్యసుఖాంచితజీవితం బగున్
పోరున గల్గు నర్థ మురిపోసిన బంగరుతాడుపోలికన్.



# రెండవతారికలు: ఒక ఫలశ్రుతి

శ్రీ నాయని కృష్ణకుమారి

ఒకపని చేసితిమా, దానినుండి ఒక యానందమును బొందితిమా, ఆ యనుభూతికి కారకులైన ఆద్యులు మన మనస్సులకు తగిలివత్తురు. వెనువెంటనే మనలో నరకలెత్తు తెలుగుదనపు పవిత్రరక్తము కృతజ్ఞతాసాంద్ర మగును. ఒకసారి, ఒక్క నిముసములో సగము సేపైన, ఒక్క తటిల్లత మెరసి మాయమైనంత అల్పవ్యవధిలోనైన, వారినిగూర్చిన యాలోచనలు మనలో సేశాము లెత్తును—అట్లగుట అనుసరించవలసిన మర్యాద యనిగాదు; అచరించవలసిన విధాయక కృత్య మనిగాదు;— తెలుగుతల్లులు తమ పాపల కుగ్గు పాలతో రంగరించి పోసిన మహాగుణ మని; తరతరములనుండి యనూచానముగ తరలివచ్చు మహాద్భాగ్య మని!

తెలుగుభాష యున్నది! దాని కీనాటి కొక వ్యవస్థ నొందిన సాహిత్య మున్నది. అందు పురాణ వాఙ్మయము గలదు; ప్రబంధవాఙ్మయమును గలదు; ఉదాత్తగంభీరములైన నీతిబోధ లున్నవి. మధురసారస్యములు మేళగించిన భక్తిపారవశ్యత లున్నవి. శృంగారరసానంద పోషకములైన ప్రాబంధిక గాథ లున్నవి!—ఇవన్నియు స్వతంత్రములు గావని యొక వెక్కిరింపు అనుకరణమో, అనుసరణమో అనున దొక యీసడింపు. అయిన నేమాయె! ఆ, స్వతంత్రము లని పిలువబడునవి గూడ ఏదో దివ్యశక్తిప్రేరితములై సృష్టిలో పాదుకొనిపోయిన సత్యములకు ఛాయలు గావేమి? అప్పు డవిమాత్ర మనుకరణములు గాకపోవునా? అనుసరణములు గాదన్న మానునా?— ఇది యొక చిక్కు విడని సమస్య. అవునన్నవా రవు నందురు! కాదన్నవారు కాదందురు!

అట్టి మన తెలుగుసాహిత్యమున కొక మహాత్ముడు పెట్టినది భిక్ష! ఈనా డది యింత స్థితికి వచ్చినదన్న, మనవారు కవులై, కవికులకలహంసలై వర్ధిల్లుచుండి రన్న ఆదియంతయు నాతనిదేవి చలువ! అట్లు కాదనలేదు కృతజ్ఞత గల యాంధ్రప్రాణి.

ఆ పుణ్యమూర్తి అపస్తంబసూత్రుడు; ముద్గల గోత్రజాతుడు. పేరు నన్నయ. బ్రాహ్మణకులమున భట్టారకు డీయన; యజ్ఞముచేసిన సోమయాజి. ఈతడే చాళుక్యరాజచంద్రుడు రాజరాజనరేంద్రుని కుల బ్రాహ్మణుడుగ వర్తిల్లి గౌరవము పెంచుకొన్నది! ఈతడే నిరంతరసంహితాభ్యసనతత్పరతచే తద్ధర్మములను జీవితమున రంగరించుకొన్నది! ఈతడే వేదబుక్కుల వంటి గానపవిత్రతను తన వాక్కున నిల్పుకొన్నది! బ్రహ్మాండాది నానాపురాణముల జీర్ణించుకొన్న ఇట్టి విజ్ఞానఖని వాక్కున కవితాదేవి పీఠము పెట్టికొన్నది. సుప్రసన్నవదనయై యాశిషముల వెదజల్లినది—'బంగారము ఘుమఘుమలాడు'టన్న ఇదియే కాదేమి?

ఈయన ఆంధ్రభారతము తెలుగు భాషాదేవికి తొలి పూజాసుమము. తెలుగుప్రాణికి అక్షరభిక్ష పెట్టిన అన్నపూర్ణ! అది అమృతమై యుద్భవించినది! ఆంధ్రుల కమరత చేకూర్చినది! నిజమునకు తదుద్భవమున కెన్ని పాట్లు! తత్సంపాదన కెంత ప్రయత్నము? ఆ కష్టముల కన్నిటికి ఒరిపిడి నన్నయ! ఆ ఉపద్రవముల పోగమంచునకు బాలసూర్యుడు నన్నయ! ఆయన మంధరమై పండిత మండలిని తరచినాడు. జగన్మోహినియై తెలుగువారికి ధర్మామృతమును పంచి పెట్టినాడు!—"ఓయి, అన్ని కష్టముల బడెనా, ముష్టి రెండున్నరపర్వములు తెనిగించుటకు?"—ఒక్క పేళన తటుక్కున మెరయును మనోవీథులలో.

ఇక భారతావతారికను పరికించితిమా, అందు కొన్నికొన్ని మన కతివిచిత్రములుగ కన్పట్టును. వీరి నిట్లేల రచించినా డన్న సందియమునకు చో టిచ్చును. ఆ సందియములు తీర్చికొనుటమాత్రమే మన పని!

"శ్రీవాణీగిరిజాశ్చిరాయ దధతో
వక్షోముఖాఙ్గేషు యే
లోకానాంస్థితి మావహ న్త్యవిహతాం
స్త్రీపుంసయోగోద్భవామ్
తే వేదత్రయమూర్తయ స్త్రిపురుషా
స్సంపూజితా వస్సురై
ర్భూయాసుః పురుషోత్తమామ్బుజభవ
శ్రీకన్ధరా శ్శ్రేయసే"

భారతావతారికలోని మంగళాచరణశ్లోక మిది!

వ్రాయునది తెలుగుభారతము! ఆంధ్రీకరించువాడా తెలుగువాడు నన్నయ! ఆయనకు సంస్కృతమున నెంత యభిమాన మున్నదో తెలుగున నంత కిబ్బడిగ నున్నది. అట్టివాడు, నాందిగ సంస్కృతమున శ్లోకము రచించు టేమి? మార్గ యనిపించుకొను సంస్కృతమునుండి కవితా సరస్వతిని దేశీవీథులలో నడిపించుచుంటి నే, యేమైన బెడిసికొట్టునేమో యని ప్రారంభించెనా? లేక దేవభాష సంస్కృతము; అది గ్రంథమునకు మకుటముగ నుంచియే తీరవలయు నని మొదలిడెనా?

తరువాత,—

"అమలిన తారకాపముద
యంబుల నెన్నను సర్వవేద శా
స్త్రముల యశేషపారము ము
దంబున బొందను బుద్ధిబాహుళి
క్రమమున దుర్గమార్థజల
గారవభారతభారతీసము
ద్రము దఱియంగ నీదను వి
ధాతృనకైనను నేరబోలునే?"

అని చెప్పుట మరియొక విచిత్రము!—ఇట్లు చెప్పుట తన శక్తిని మరుగుపరచుకొనుటకై చెప్పుటయా, లేక ఏదేని ప్రయోజనము కాంక్షించి చెప్పుటయా? అట్లు చెప్పిన వెనువెంటనే, "అయినను దేవా నీయనుమతంబున విద్వజ్జనంబుల యనుగ్రహంబున జేసి నా నేర్చువిధంబున నిక్కావ్యంబు రచించెద" అని వెల్లడించుట మరొక విశేషము. ఇవ్విధముగ రాజును, పండితమండలిని తన కావ్యప్రారంభమునకు సూత్రప్రాయముగ నిలబెట్టు టేల? వారి కట్టి విశిష్టత యున్నదీ కార్యనిర్వహణమున?

తరువాత పండితసభలను నుతించినాడు.

"పరమవివేకసౌరభవి
భాసితసద్గుణపుంజవారిజో
త్కర రుచిరంబులై సకల
గమ్యసుతీర్థములై మహామనో
హర సుచరిత్రపావన ప
యః పరిపూర్ణములైన సత్సభాం
తర సరసీ వనంబుల ము
దంబొనరం గొనియాడి వేడుకన్—"

అని వానిని 'సరసీవనంబుల' తోడ బోల్చియు నంతతో వదలక పర్వానుక్రమణిక జెప్పుచు నందుగూడ జొన్పినాడు—సభాపర్వము 'పండితచేతోనిర్వృతి' చేసినది. 'సకలసభారమ్య'మైనది యారణ్యపర్వము. 'సభారంజన'మై సర్వమనోజ్ఞము వాదగి వెలసిన నాలవ పర్వము విరాటపర్వము! ఏనవపర్వం బిది నానుద్యోగపర్వ మింపైనది 'సభల'. అత్యనుపమమై 'సభల' నమరినది ద్రోణపర్వము. ఇట్టులే ఏ పర్వమున కాపర్వము సభల యామోదము బడసినదని చెప్పుచువచ్చినాడు నన్నపార్యుడు. ఈ సభల కిందుల కంతటి స్థానము నీయవలసివచ్చినది? ప్రతిసారి వానిని నుతింపవలసిన యవసర మేమి కలిగినది నన్నయకు?

ఆపైన నారాయణభట్టునెడల నన్నయభట్టు కృతజ్ఞత!

"పాయక పాకశాసనికి
భారతఘోరరణంబునందు నా
రాయణునట్లు దాను ధ
రామరవంశవిభూషణుండు నా

రాయణభట్టు వాఙ్మయాధు
రంధరుఁడుం దన కిష్టుఁడుఁ గసహా
ధ్యాయుఁడునైన వాఁ డభిమ
తంబుగ దోఁడయి నిర్వహింపఁగన్”—

తన పూనిక ‘భారతఘోరరణము’వంటిదట! కావననే తరువాతి శ్రీనాథుఁడన్నాఁడాయనను “భారత ఘట్టోల్లంఘనపటిష్ఠగాఢప్రతిభు” డని. తాను పాకశాసని. తన నారాయణభట్టు నారాయణుఁడే!— అనిన, శ్రీకృష్ణుఁడర్జునునకు జేసినంత సహాకృతి యాయన నన్నయకు జేసినాడన్న మాట!—ఆ పద్యమున వేసిన చివరిమాట ‘తోడై నిర్వహించుట’లో నేయర్థమున్నదో? ఏవిధముగ నారాయణభట్టు నన్నయకు తోడైనాడు? ఆయనకలములో నీయనగూడ కలము కదిపినాడా? ఆయనభావములతో నీయనగూడ తన భావముల పెనవైచినాడా?—అటులే యయ్యేనేని ఆశ్వాసాంతగద్యములో నారాయణభట్టుపేరు జోడింపనంతటి కృతఘ్నుడు కాడే నన్నయభట్టు! మరి యీ సహాయ మెట్టిది! ఈ నిర్వహించుట యే విధిని?

ఈ ప్రశ్నపరంపరకంతటికి జవాబులే కావలయునా, వెనుకటి చరిత్రయంతయు త్రవ్వి చూడవలయును. నాఁడే నన్నయగారి కష్టములు, ఆయనభారత రచనానిర్వహణ కడునైన సమస్యలు—అన్నియు బయటపడునది!

మహారాష్ట్రమున అభీరుల తోడి శకు లంతరించి పోయిరి. డెబ్బదిసంవత్సరములైన పరిపాలనపు ముచ్చట దీర్చికొనిరో లేకోగాని యాభీరుల వంతు గూడ వచ్చినది. అప్పుడప్పుడే కన్నులు దెరచి నేల నాలుగుచెరగుల కలయఁగొన్న చాళుక్యవీరులు వారిని శాసించినవారు; పదభ్రష్టులను జేసి సింహాసన మాక్రమించినవారు! ఈ వంశపు రత్నదీపము సత్యాశ్రయపులకేశివల్లభుఁడు! ఆతని బాహుబలవిజృంభణ పరరాజ్యమహావృక్షముల పెకలించి వైచినది. వానిని కలిపికొన్న చాళుక్యరాజ్యలక్ష్మికి సర్వవాహినుల లయ మొనరించుకొన్న మహాసాగరపు పోలిక! పరాక్రమమునకు తోడు దూరదృష్టిగూడ నా మహారాజు సొత్తు. విపులమైన ఆ రాజ్యభవనమునకు తన భుజాస్తంభములే చాలును! అయినను భ్రాతృవత్సలుఁడా రాజచంద్రుఁడు! ఒక్క తల్లికడుపున రక్తము రెండుగా చీల్చికొని పుట్టిన తన తమ్మునకు రాజ్యభారనిర్వహణమున పాలుండకపోవు టేమి? కావననే తన రాజ్యమున తూర్పుసీమయందు తమ్ముని శాసనము! పశ్చిమమున తన పాలనము!

ఆకుబ్జవిష్ణువర్ధనుని వంశమువాఁడు, వేఁగినాటిని పాలించిన ధన్యజీవి, విమలాదిత్యుఁడు. ఈయన సింహాసనారూఢుఁ డగుటకుముం దెన్ని కలహసంగ్రామావర్తములు! ఎన్ని విప్లవవిస్ఫులింగములు! కొంతకాలముపాటాతఁడు చోళుల చెఱసాలయందు బందీ. కాని చివర కా బందిఖానాయే అత్తయిల్లై అలరించిన దా అదృష్టవంతుని. మామగారి ప్రాపు నరునకు నారాయణుని వలె నిలువగా తన సింహాసనమును సుస్థిరము చేసికొన్నాఁడాయన. తండ్రి సంపాదించిపెట్టిపోయిన ఈ సువ్యవస్థలో కడుపులోని చల్ల గదలకుండ కాలూని కూరుచుండవచ్చును రాజరాజు! కాని ఆయన సోమరి గాఁడు. ఒకప్రక్క పారంపర్యముగ తనకు సంక్రమించిన రాజ్యరక్షణ. మరియొకప్రక్క తనలో నురకలెత్తు తెలుఁగురక్తము ప్రేరేచు వాఙ్మయపోషణ— ఇవి రెండును రెండుకన్నులాయనకు. వానికి కుడి యెడమభేదములే లేవు. కావననే ఆతని ‘నిజభుజవిక్రమ విజితారాతి రాజనివహుఁ’డని నుతింతురా, ‘వివిధాగమవిహితక్రియు’డని నుడువవలయును. ‘అపరాజిత భూరిభుజాకృపాణ ధారాజలశాంత శాత్రవ పరాగుఁ’డని పొగిడిరా, ‘మనీషి విద్యాశ్రీమత్తత్త్వవిత్తమున మహి నొప్పినవాఁ’డని ప్రస్తుతింపవలయును. ‘మంత్రిపురోహిత సేనాపతి దండనాయక దౌవారిక మహాప్రధానానంత సామంతవిలాసినీ పరివృతుఁ’డనునా, ‘అపారశబ్దశాస్త్ర పారగులైన వైయాకరణులును, భారతరామాయణాద్యనేక పురాణప్రవీణులైన పౌరాణికులును, మృదు మధుర రసభావభాసుర నవార్థవచన రచనావిశారదులైన మహాకవులును వివిధతర్కవిగాహిత సమస్తశాస్త్ర సాగర గరీయః ప్రతిభులైన తార్కికులును నాదిగాఁగల విద్వజ్జనంబులు పరివేష్టించి కొలువఁ’బడిన వాఁ డనుచు! ఇంతటిరా జాకవి కండ!

ప్రాణికి ప్రాణమువలె, ప్రాణమునకు ప్రాణివలె నన్నయరాజరాజు లొకరి నొకరాశ్రయించుకొన్నారు. ఆ ఏకతా ఫలితముగనే భారతరూప మేర్పడ గలిగినది. ఘృతమునకు పాత్ర యాధారమా, పాత్రకు ఘృత మాధారమా యనునదిగా నిచటి ప్రశ్న! భారత జననమున వీరిరువురికి గల బాధ్యత ఎట్టిది? ఒకరి కొక రెంతవర కుపయోగకు లైరి?—అను సంశయములు చర్చనీయములు.

వీరిరువురికృషియు సాహిత్యవిషయిక మేగదా! కాన నన్నయకు బూర్వము తెలుగుభాషయవస్థను పరికింతము. అప్పటికి దానికి లిపి యున్నది. పాల్కురికి సోమనచే తుమ్మెదపదములు, గొబ్బిపదములు, ప్రభాత పదములు, వెన్నెలపదములు అని పేర్కొనబడిన దేశీయఛందము లున్నవి. సోమనాథు డనువాడు వీనికి ఛందోనియమముల జెప్పుచు "అనియతగణైః— యతిర్వా ప్రాసోవా" యని నిర్ణయించినాడు. ఇదంతయు గమనించిన కొందరిమతమున నన్నయ ఆదికవి గాడు. అతడు వాగనుశాసను డనుకొన్నది మెచ్చుటకు దగిలించుకొన్న బిరుదు. వారి యుద్దేశ్యమున వాగనుశాసను డన్న, ఆదికవి యన్న ఇదివరకు లేని ఛందమును సృష్టించినా డని కాబోలును! అంతవరకు తెలుగుప్రాణి కనివిని యెఱుగని లిపిని నిర్మించినా డని కావును!

నన్నయచేసిన పని యది గాదు. అతడు లిపిని సృష్టింపలేదు. కాని దానియందు మార్పులు చేసినాడు. దేశీయఛందముల గ్రహింపకపోలేదు. కాని వానికి తోడుతోడుగ సంస్కృత ఛందోవాహినినుండి పాయలు తీసి కలిపినాడు. ద్రవరూపమున నున్న తెలుగుభాష కొక వ్యవస్థ నిచ్చుటకై సంస్కృతపు టానకట్టలు పోసినాడు. ఇది యాయన జేసిన పని. ఈవిధముగ అరూపముగ, అప్రశస్తముగ నున్న తెలుగు వాఙ్మయమును సవరించినాడేగాని సృష్టింపలేదు. ఆపని చేయుటకై తన భాషాంధ్రీకరణ మహావ్రతముగ సాగుటకై యాతడు రచించుకొన్న ప్రణాళిక మాత్రమే ఆంధ్రశబ్దచింతామణి!

చాళుక్యుల విజయాంకములు చోళుల కానాడు వెలలేని సాహిత్య మున్నది. దాని సర్వతోముఖవిజృంభణ విజ్ఞులకు కన్నులపండువు. ప్రతిపండితుడును, ప్రతి కవియు, ప్రతివిజ్ఞానఖనియు గూడిన ఒక కూడిక వారి సంఘము—ఎవ్వరేని యొక గ్రంథము రచించిరా, ఒక కావ్యగానము జేసిరా అది ముందు వినబడవలయును ఆ సంఘమునకు. దానిని విన్నవారు దాని ప్రాశస్త్యము నేర్పరింతురు; దానికి సాహిత్యవిపణిలో వెల కట్టుదురు. అట్లెంచుకొనబడిన గ్రంథమే వారి పరిభాషలో 'సందర్'. అదియే పండితపామరులు చదువుటకు యోగ్యతను సంపాదించుకొన్నది. ప్రపంచమున ప్రమాణించుట కనుజ్ఞను తెచ్చుకొన్నది. ఈపద్ధతి రాజరాజుకనుల కాకట్టయిన దేమి! కాననే వారిని తానుగూడ అనుకరించవలయునన్న యాశయే తన రాజ్యమున పండితసభలను కూర్చి పెట్టినది.

కాని ఆ సభలలో తెలుగునకు స్థానము లేదు. ఈసడింపు మాత్ర మున్నది. అందు కవనము జెప్పిన వారికి అవంతరైన ప్రోత్సాహము లేకుసరిగదా అగౌరవమున్నది. కారణ మాభాష. దేశి. అనాగరకులు, మోటువారు నిత్యవ్యవహారమున కుపయోగించు భాష యది! "ఒక్క రూపన్నది లేక పలుపోకల బట్టిన ఆ పదజాల మేమి, కట్టుబడి కావ్యరూపమున నుండు టేమి! అస లందున్న దే కొద్దిసామగ్రి యాయె! దీనితో నెన్ని భావముల స్ఫురింపజేయగలరు! ఎంత రసమును చిప్పిలింపగలరు? ఎవరయ్యా తెలుగున కవిత్వము చెప్పెద నను తెలివిమాలినవాడు? పండువంటి సంస్కృతి మున్నది. లెక్కకుమిగిలిన విషయము లున్నవి! మోజుదీర చేతికి వచ్చిన గ్రంథములు వ్రాసిన కాదందు రెవ్వరు? వీడుమిక్కిలి ఆదరమును గౌరవమును గలుగునే?"—ఇదియే ధోరణి ఆనాటి పండితులందరికిని! ఇదియే పోకడ తెలుగువిషయమున వారి హృదుల నిండినది!

అట్టి ఆకాలపు రాజును, కవియు వారు!— కాని వారి మనస్సులలో తెలుగుదుస్థితి యున్నది. దానిని వాఙ్మయస్థితికి తేవలయునన్న దీక్ష యున్నది. అట్లని, అందరు పండితులను కాదని వీరేమి చేయ గలయును?

తాను రాజే! మూర్ధాభిషిక్తుడే! అయిన నేమి వన్నె? వారిని తాను శాసించునా? ప్రజలలో అసంతృప్తి రేపునా? రేపి తన హృదయమున తీరని చిచ్చు రగుల్చుకొనునా?

తాను పండితుడే! పండితమండలికి అధ్యక్షప్రాయుడే! కాని ఏమి ఫలము! వారిని కాదని ముందంజ వేయునా? ప్రజల దృష్టిలో పేలవమైపోవునా? పోయి 'సుజను' డన్న తన ఖ్యాతికే మచ్చ తెచ్చికొనునా?

అట్లని ఎంతకాలమని తమ కోర్కను తమ లోనే యణచుకొని గ్రుక్కిళ్లు మ్రింగుట! ఎంత కాలము, ఇప్పుడు పోయిన దేమిలే మంచికాలము వచ్చునని వేచియుండుట! అన్ని కాలములు మనవా? ప్రతినిమేషమును గడచిపోవుచున్నదే!

అవ లన్నియు ననుశీలించిన—

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని
  యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని
  కవివృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వలక్షణసంగ్రహ మని
  యైతిహాసికు లితిహాస మనియు
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ
  యం బని మహిఁ గొనియాడుచుండ"

భారతమును తెలుగు సేయవలయు నని యున్నది నన్నయకు! అవును మరి! ఆ కృతి సర్వధర్మసంపుటీకరణ మాయె! "ఇదం భారత మనాశ్రిత్య కథా భువి నవర్తతే" యనియు, "ధర్మేచార్థేచ కామేచ మోక్షేచ పురుషర్షభ, యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్క్వచిత్" అనియు దీనిని చెప్పికొనిరాయె! అట్లే, "హిమకరుదొట్టి పూరుభరతేశ కురుప్రభుపాండు భూపతుల్ క్రమమున వంశకర్త లనగా మహినొప్పిన" తన వంశమున "ప్రసిద్ధులై విమలసద్గుణ శోభితులైన పాండవోత్తముల చరిత్ర" యని, భారతమును తెలుగు సేయింపవలయు నని రాజరాజున కున్నది! ఇట్లిరువురి దృక్కులకును భారత మాశ్రితము. పైపెచ్చు ఆనాటికే భారతమును కన్నడించినారు కన్నడకవులు. ఆ చర్య వీరిరువురి హృదులయం దున్న వాంఛకు పాతుగల్లు! కాని మొదలు లేదు మొత్తుకోడు కొడుకుపేరు సోమ లింగ మన్నాడట యెవరో! అటుల, అసలు తెలుగునే కావ్యోపయోగమున కంగీకరింపని పండితమండలి భారతాంధ్రీకరణ కొప్పుకొనునా? ఈ కోర్కను బలి బుచ్చుటయు, ముల్లుదీసి కొఱ్ఱడచుటయు నొక్కటి గాదేమి?

ఇట్లు కింకర్తవ్య మని మొగమొగములు జూచుకొను సమయమున నవతరించినాడా బహుభాషావిజ్ఞానమూర్తి నారాయణభట్టు. నరునకు నారాయణునివలె బలారికి బృహస్పతివలె ఆ నన్నయభట్టుకు నారాయణభట్టు చేదోడును, వాదోడును! అతడు సంస్కృత ప్రాకృత పైశాచికాంధ్రభాషలయందు 'కవిరాజశేఖరు'డు! అదృష్టముకొలది యిటుల లభించిన యీ విజ్ఞానపు తెప్ప నాదరువుగ గొని యేటి కెదురీదు ప్రయత్నము లారంభించెను, ఆ కవివిభుఁడు!

రాజరాజు పండితసభలలో సభ్యులను భారతాంధ్రీకరణవిషయమై కదిపి కదిలిపెట్టును. ఆయన విధిధాగము విహితక్రమము డాయె! మనీషి విద్యాక్రమతత్త్వవిత్తమున మహి నొప్పువా డాయెను! అర్థధర్మశాస్త్రముల తెరం గెరింగి, ఉదాత్తరసాన్వితకావ్యనాటకక్రమములు పెక్కులు సూచినవాడుగూడను! అంతటివాడు వెలికి తెచ్చిన విషయమే యని అందరును అక్షతో వింటురు! చర్చోపచర్చలు గావింతురు. కొందరామోదించువారు, మరికొందరు నిరసించువారును. ఈవిధముగ సభయంతయు రెండు తెన్నుల బోవును. ఆమోదించువకు మీమాత్రత్రయపు వన్నెల చందమామ! నిరసించువారి ప్రాణములకు నారాయణభట్టు పెనుభూతము! అతడు బహుభాషల పాండిత్యము గడించెనా? యుక్తియుక్తముగ వాదింపనుగూడ గలడా?—ఇక నేమి? ఆనాటికే కన్నడమున భారతము వెలసినది. ఇతర భాషలన్నియు పదిముఖముల విస్తరిల్లుచున్నవి. "మాతృభాష కిదేమి గతి యయ్యా! యీ నిరాదరణ కిదేమి పెరవారివిషయమా? ఈ యవమాన మెవ్వరి కేమి?"—ఇట్లే సత్తేరుపై బండివడక

నారాయణభట్టువాదనాప్రౌఢిమ! దీని నామోదించి తలయూచు పని ఆ 'విమలవిచారు'నిది, ఈ 'లోకజ్ఞు'నిది! "ఇదేమి చిత్రమో, అంతటివారికే నచ్చిన దీయూహ, దాని కెంతటి ప్రాముఖ్యమో!" యని మెత్తబడువారు కొందరైన, "పోనిమ్ము! జరిగినది జరుగనీ, అవునన్న పోయిన దేమి?" యని యొప్పుకొను వారు మరికొందరు! అటునిటు తేరక పట్టిన కుందేటికి కాళ్లు మూడే యన్నరకపు కొరకరాని కొయ్యలు నుండకపోరు!—ఈవిధముగ వారు మూపురము జేరి పండితబాహుళ్యపు టంగీకృతిని సంపాదింతురు. కాని యీ యంగీకృతి నాభికడనుండి వచ్చినదా, నాలుక చిగురుమాటయా?

అది యేమైనను, దానిని పరిదిద్దుకొనుట బాధ్యత యొక నన్నపార్యునిదే! కారణ మాతడు గ్రంథకర్త. ఆకృతిబాగోగులపై వారి యభిప్రాయముల మార్పున కాస్కార మున్నది!

కీడెంచి మేలెంచుమని, వారు పైమాటగ నీపని కొప్పుకొని చాటునకు పోయి నాలుకొడించు దశకు ననుకొందము. అప్పుడు నన్నపార్యుని యుద్దేశ్యము పూర్ణమైనదనుట యెట్లు? తొట్టతొలి కృతియే యీసడింపులపాలైన తరువాత నాళావలో మరి యే గ్రంథములైన బుట్టునా? పుట్టి మన్ననల చూఱగొనునా? అయ్యవారిని జేయబోయిన కోతి యైనటుల తాను నాడు పూనుకొని విఫలుడైనచో, మరి కల్పకల్పములకు తెలుగున సాహిత్యము పుట్టునో లేదో? ఎట్టి క్లిష్టపరిస్థితులను దాటుట యన్న, పండితపామరుల మనస్సులను తనయెడల స్నేహప్రేమార్ద్రములు జేసికొనుటే! ఒక మతవిషయికముగగాని, రచనాధోరణిలోగాని, ఆనాటి సాంఘికాచారాదిక చిత్రణమునగాని విప్రతిపత్తి చూపట్టగూడదు భారతపాఠకునకు. ఆవిధముగ నేదృష్టితో, నేమనస్తత్వము గలవాడు జదివినను తన కృతి అవిధముగ వాని మనస్సు నలరించినదా, ఇక తాను సఫలుడైనటులే!

కానసే మంగళాచరణశ్లోకము సంస్కృతమున నున్నది! అందు త్రిమూర్త్యాత్మకమైన పరతత్త్వమే ప్రస్తుతింపబడినది. అది సంస్కృతమున నుండుటకు హేతువు ఆనాటి పతితల దేశకవితాపతనదోషము నివారణ మగుటకు; పండితుల సంస్కృతప్రియత్వమునకు కొంత గౌరవ మిచ్చి యాదరించినటుల గాన్పించుటకు! ఇక త్రిమూర్తుల కభేదము చెప్పి నతించుట మతవైవిధ్య మున్న పాఠకుల నిరసనకు పాలు గాకుండుటకు! అవును మరి. పాఠకులలో కొందరు శివభక్తు లుందురు; మరికొందరు విష్ణుపాదపూజానిరతులుందురు; ఇంక కొందరు బ్రహ్మోపాసకు లుందురు. వీరి కందరికి భారత మాదరణీయ మగుట కింతకన్న సులు వేది!—ఆ బృహత్ఫలసాధన కీ కిటుకు!

తా నాంధ్రీకరించినంత మేర సంస్కృతభారతమును నన్నయ అనుకరించినాడేగాని అనుసరించలేదు. ఆయనది యథోచితానుసరణమే. దానికి కారణ మరుగుచుండ, ఆయనమనస్సులోని దొక్కటే యూహ. తన కృతి జనబాహుళ్యపు ప్రేమాదరముల నూరగొనవలయును. వ్యాసుని కాలపునాటి పరిస్థితులు నన్నయకాలపువారికి సగటుగ దోచవచ్చును. నన్నయనాటి యాచారములు వ్యాసునినాటి వుండకపోవచ్చును. అట్టియెడ ప్రజాశ్రేయస్సే మనమున బెట్టికొన్న నన్నయ వానిని తన శక్తికొలది మార్చివైచినాడు. అందుల కుదాహరింపుగ సంస్కృతభారతమున కచదేవయానీఘట్టమున దేవయానిప్రేమ నుదాత్తముగ చిత్రించుటకు యత్నించినాడు వేదవ్యాసుడు. అటులే కర్ణజననమునుగూడ. నన్నయనాటి కవి సంఘమూహ్యములు! కానసే వానిని పట్టించుకొనక ముక్తసరిగ త్రోచివైచినా డాయన. ఈవిధముగ భారతమంతయు నుదాహరింపవచ్చును—ఈ పనిచేతగూడ భారతము జనుల యాదరమునకు పాత్రమైనదని చెప్ప సాహసింపవచ్చును!

ఇక నన్నయ, 'భారతాంధ్రీకరణ మెంత కష్టతరకార్యమో చూడు' డని చెప్పిన పలుకుల నాలకింతము!

తా జెప్పబోవునదా పంచమవేదమగు భారతమును! ఆ చెప్పుటయు పదజాలపరిపుష్టముగాని

యాంధ్రమున. తాను ప్రతిభావంతుడే. కాని ఎంతటి ప్రతిభగలవాడైనను 'తారకాసముదయ మెన్న' గలడా? 'సర్వవేదశాస్త్రముల పార మశేష మెఱుంగ' గలడా?—అటులే "యీ క్వచిత్స్వనుగ్రహో" నర్థుల గురుత్వము వహించిన భారతభారతీసముద్రము నీద దొరకొనువాడను నేను! అందే లోపము వాటిల్లిన నది దోసమున్నట నీకు న్యాయము గాదుసుడీ!" యని హెచ్చరించుటకు చెప్పిన వాపలుకులు. ఇంత హెచ్చరింపును హెచ్చరించి, యావెంటనే, "దేవా, నీయనుమతంబున విద్వజ్జనుల యనుగ్రహంబునఁజేసి"—యని రాజును విద్వజ్జనులను నిలబెట్టుటచే తన చుట్టును రక్ష వైచికొన్నాడు నన్నయ! ఏదేని లోపము వాటిల్లి, "ఇంత చేతగానివాడ వూరకుండకపోతివా? ఏల చెప్పితి వయ్యా?" అని యెవ్వరేని ప్రశ్నించిరా, "నా దేమున్నది వారు బలవంతపెట్టిరి. చిన్నవాడను. మరి కాదందునా?" అనుట కిరవొత్తు!—నిజమే! మరి యింత గురుతర కార్యభారము నెత్తిన వైచికొన్నవా డెన్ని కట్టుదిట్టములు లేనిది బరిమీదకు వచ్చును? ఇన్ని కాపులు పెట్టికొన్నను, ఇంకొక శ్రీరామరక్ష—అది 'నా నేర్పువిధంబున నీ కావ్యము రచించెద' ననుట! 'ఉభయభాషాకావ్యరచనాభిశోభితునకు, విపులశబ్ద శాసనునకు, సంహితాభ్యాసునకు నీవినయ మేలనయ్యా తీవిగ జెప్పికొనక?' యనిపించును మనకు. కాని యీవిధమును నాయనపోకడయే పండితమానసములలో సుముఖత నింపి, వారిని తనవైపునకు త్రిప్పినది; తాను కాంక్షించిన ప్రయోజనమును సఫలము జేసినది!

ఇంకను పూర్వకవిస్తుతులు. తెలుగున కవులు లేరుగాన నన్నపార్యుని స్తుత్యర్హు లెవ్వరును గాక పోయి రానాడు. ఇక మిగిలినది సంస్కృతము. అందలి కవులలో నన్నయ పరాశరాత్మజుని బొగడు వైఖరి చింతనీయము. ఆయన "భారతభారతీశుభ గభస్తిచయంబులఁజేసి ఘోరసంసారవికారసంతమస జాలవిజృంభము"బాపినవాడట! "అంతపని నాయన సాధించుట భారతరచనవలన! మరి యాంధ్రీకర్తను జేసినగూడ దానినుద్దేశించియే యీపనికి మొదలుబెట్టి నానయ్యా, దేశిమార్గమున జెప్పిన నేమి, మార్గకవితా రీతుల నడిచిన నేమి, దాని ఫల మెటులైన మనకు దక్కునుగదా! మాణిక్యమును మసిపాత, గట్టితి మని మీ రనుకొన్నను, అది కాంతిహీనము గాదే!" అని హెచ్చరించును ప్రజలను! అంత నిగూఢప్రయోజన మున్నదా వ్యాసస్తుతివెనుక! ఇట్టి జాగ్రత్తల కన్నిటికిని మకుటప్రాయము పండితసభల ప్రశంస! పండిత మానసములను తనవైపునకు త్రిప్పికొనుట కిదియొక ప్రయత్నము. కాననే ఆ సభలకు తన యవతారికయందంత ప్రాముఖ్య మిచ్చినాడు. అవి వివేకసౌరభము వెదజల్లు సరసీవనంబులు! సద్గుణపుంజవారిజోత్కర రుచిరములు! మనోహరసుచరిత్రపావనపయఃపరిపూర్ణములు! సకలగమ్యసుతీర్థములు!—ఇటులే, ప్రతి పర్వమును సభల ప్రశంసల గనివదని పలికినాడు! 'సభలే ఆమోదించిన ఇక మన కేమి యభ్యంతర మయ్యా' అని ప్రతిపాఠకుడు జదువు నని యాయన యూహ! నిజమున కానాటి పండితసభల కంత పలుకుబడి యుండెడిది ప్రజలలో! అదియే నన్నయచేత నన్నిసారులు పండితసభాప్రశంసలను జేయించినది!

ఈ తతంగమంతయు ముగిసినవెనుక తన యాప్తుల వైపునకు దిరిగినా డా 'సుజను'డు! తన మిత్రుడు నారాయణభట్టెంత శ్రమపడెను తనకొరకు! అటు పండితుల వాగ్వాదముల యుక్తియుక్తముగ ఖండించుటకేనా, ఇటు కన్నడించిన భారతపు తెన్నులు తెలియజెప్పుటకేనా—ఒకటేమిటి, అన్ని విధముల నాతడు చేయూతనిచ్చి మిత్రు డనిపించుకొన్నాడు. అట్టివానికి తా నేమిచ్చును; కృతజ్ఞతాపూరితమగు హృదయముదక్క! అయినను, కవిగాన, ఆ సంయమి పద్య మొక్కటి జెప్పినాడు. ఆ నారాయణుని చే రాకల్పాంతము నిలచు నేర్పాటులు జూపినాడు 'ఈ సహాయ మీవిధపు వైయుండదు. బహుశ నారాయణభట్టు నన్నయ్యతో బాటు భారతరచన సాగించెనేమో' యని కొందరి మతము. మనఃపూర్తిగ తన మిత్రుని నారాయణుని జేయగలిగిన నిర్లిప్తుడు తనతోపాటు నారాయణభట్టు రచనయే సాగించిన నాతని పేరు గలుపక యాశ్వాసాంతగద్యను రచించె ననుట నమ్మకమునకు దూరము. అయిన నిందలి సత్యాసత్యములతో మనకు పని యేమికి—

ఝుంఝామారుతము లెన్నిటి కెదురునిలచి, ఏటి కెన్ని యెదురీత లీది, అందరిచే చివరకౌననిపించుకొని, యప్పుడు,

"సారమతిం గవీంద్రులు ప్ర
సన్న కథాకలితార్థయుక్తి లో
నారసి మేలునా నితరు
లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తినిధి
నన్నయభట్టు తెలుంగునన్ మహా
భారతసంహితారచన
బంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్"

ఇప్పటికొక్క దాని కథ ముగిసినది. ఇక రెండవ దాని పరిశీలనము — దీనికిని విశిష్టత యేమైన నున్నదా, లేక అన్ని గ్రంథముల యవతారికవంటి దేనా యిది? ఒకవేళ ఏదైన విశేషమున్న నది నన్నయ యవతారిక బోయిన త్రోవల బోవునా? లేక దీని తెన్ను దీనిదియు, దాని త్రోవ దానిదియు నా?

అక్కరము వేర్చిన ఆంధ్రప్రాణి కన్నుల కలువ పూవు తిక్కన. అష్టకష్టములపాలై పండితే జలదముల అనుగ్రహమునకు వేచి తెలుగుసాహిత్య క్షేత్రమును భారతసస్యోత్తమున్ గావించినాడు నన్నయ — కోత గాచి నక్కలపాలు చేసినట్లు. చివరకు శివకవుల చేతిలో తుదివందనున్న ఆ నన్నయచే స్థాపింపబడిన వ్యవస్థ తెకత్తికోలది యుద్ధరించి పూర్వపురూపునకు దెచ్చినాడు తిక్కన.

"శ్రీయన గౌరినా బరగు
చెల్వకు చిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహ
రంబగు రూపము దాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయ యని
పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చు మెచ్చు పర
తత్త్వము గొల్చెద నిష్టసిద్ధికిన్"

ఇది తిక్కన్నగారు తన కృతికి చేసిన మంగళాచరణపు వైఖరి. ఇది తన పూర్వుడు నన్నయ ననుకరించుటకు చేసెనా? లేక నాయనవలె ఏదేని ప్రయోజనాకాంక్షియై రచించెనా? — ఒకవేళ నట్టి కాంక్షిత మేదేని యున్న నది యేది?

తిక్కనార్యుడు కనుదెరచు నాటికే తెలుగుదేశ మల్లకల్లోలముగ నున్నది. రాజకీయపరిస్థితులను జూచిన నటు పాండ్యాదుల యుద్ధృతము తెలుగుటెల్లలపై యుప్పెనపొంగు! దాని నాకట్టు కాకతీయాంధ్రుల సంరంభము చిల్లర రాజ్యముల కంఠములపై కత్తిపెట్టినట్లు. అట్టియిరకాటములో బడిన యొక భూఖండము మనుమసిద్ధి పరిపాలితక్షితి! దానిని గాచుకొను శక్తిలేని యా రాజు అటులటురే నెట్టికొనివచ్చుచున్నాడు కాలమును! విద్యావిషయమున జూచుచూ, నన్నయచే వ్యవస్థితమైన యాంధ్రభాషోద్యానము శివకవి ఝుంఝా ప్రభంజనుని పాలై యారకున్నది. ఆయనయనువాదపద్ధతికి వీరి మణిప్రవాళశైలి యెదురుచుక్క. ఆయనచంపువులను వీరి ద్విపదలు నొసలు విరచి వెక్కిరించును. — ఇక సాంఘికముగా పరిశీలించిన, మతమే ప్రధానముగ రేగిన కలతలుపంక్తి సంభవించిన పల్నాటియుద్ధము జరిగి పదు నొకండు వేల వీరుల నాహుతిగొన్న దుర్లిప్తలు వారి కన్నుల ముందు గడచినవే! కావనే శైవులన్న వైష్ణవులకు గన్నెఱ్ఱ. వైష్ణవులన్న శైవులకు చేదు'మాత్ర'. వైష్ణవుల పేరు వినవలసివచ్చెనో యని సంహాది గంట వాయింతురు శైవులు. శైవుల మోము జూడవలయు నేమో యని విసనకఱ్ఱల చాటున ముఖము చేరవేయుదురు వైష్ణవులు. తప్పిదారి యొకరితో నొకరు మాటలాడవలసెనా ఆ విధియంతయు తేనెపూతనాలుక! విసపుపూత మనస్సు! —'నీచేత పూలు నాచేత రాళ్లు నీవు నన్ను రువ్వు నేను నిన్ను రువ్వెద'నను వైఖరి!

ఈవిధపు టల్లకల్లోలము లేవియు మొదట మొదట తిక్కనకు కాన్పట్టలేదు. పిల్లతనపు టుత్సాహము మాత్రము నింపుకొన్న అతడొక్క కవీశ్వరుడు మాత్రమే తొలుతొల్త. అతని కప్పుడున్నది గ్రథనాకాంక్షమే గాని, గ్రంథకర్తబాధ్యతాస్ఫురణ గాదు! కాననే అందరు పోవుపోకలనే తానును బోయినాడు. కుకవినింద యన్నాడు. సుకవిస్తుతి యన్నాడు. 'అమలోదాత్తమనీష నేనుభయకావ్యప్రౌఢి పాటించు

శిల్పమునం బారగుడౌనన్నాడు — నిర్వచనోత్తర రామాయణము చెప్పినాడు. కాని యందు సామాన్యమానవ జీవితపు సకళ వైఖరియే చిత్రితముగాని, ఆనాటి ప్రజల దుస్థితి ప్రస్ఫుటము గాలేదు. రామాయణము చెప్పిన ట్టుల నదియును రామకథనే చెప్పినదిగాని, నాడున్న క్లిష్టసమస్యల నెదుర్కొను మెలకువలు చెప్పనే లేదు.

తరువాత కాలము గడచినది! వయస్సు మళ్లినది. అనుభవముచే గడించుకొన్న విజ్ఞతకు యజ్ఞముజేసి సోమయాజియైన పవిత్రత తోడైనది. సకలశాస్త్రసారముల జూచిన యాతని పరిపక్వహృదయమున కప్పటికి ఆనాటి పరిస్థితులు కొట్టిరాగా భయవిస్మయోద్రేకముల విస్ఫారితనేత్రుడై సర్వము నవగాహన మొనరించుకొన్నాడు. ఇంతలో శక్తియుడిగిన మనుమసిద్ధి రాచరికపు ముచ్చటకు నీళ్లు వచ్చున ట్లున్నది. అయిననేమాయె! ప్రజ్ఞామూర్తి తిక్కనార్యుని ప్రతిభానలమున కవి యాహుతి.

ఇక, సర్వవిషయముల భ్రష్టులై యల్లాడు తనతోడి వారి నుద్ధరించు టెట్లు? వీరినన్నిటిని చక్కదిద్దవలయు నన్న తా జేయవలసిన దేమి? అహోరాత్రము లాలోచించిన యాతని మేధస్సున నొక తటిత్తు భారతాంధ్రీకరణస్ఫురణ. నిజమే! ఐతిహాసికములలో రత్నములు భారత రామాయణములు. అవి రెండును నాటి కసంపూర్ణములే. కాగా, బుద్ధిపూర్వకముగనో, కాకనో రామాయణమును తానే పూరించినాడు. ఇక మిగిలినదియు భారతమే! తనయూహలు కొనసాగుట కొక పెరటికల్పకమును భారతమే!

కానిరే మన స్తత్వము గలవారి కావిధి స్ఫురింప జేయునటుల తాను రచింపగలడా భారతమును! ఆనాటి కాతడుభయభాషాప్రౌఢి చాటించు శిల్పమున బారగుడౌననునది మరచినాడేమో? 'బాలస్వభావు'డట. 'నేర్చినభంగి' దాని జెప్పి భక్తకోటికి పరణీయు డగుటయే తన యభిలాషయట! — 'కిమస్థిమాలాం కిము కౌస్తుభమ్' అను తత్త్వముతో పూర్తిగ నిండిపోయినాడా మూర్తి. అంత నిర్లిప్తత కాలవశత నేర్పడినదే యనవలయును — అట్లని తన బాధ్యతను మరువలేదాయన. తన హృదిలో వేరులు పారిన కార్యనిర్వహణాసక్తి తాను మరువలేదు. ఎటులైనసరే తనచుట్టు నున్న వారిని సర్వవిషయముల బాగుచేసియే తీరవలయును. అది తన విధి! తనకు ఏ దేవమానవులును శాసింపని యాజ్ఞ! సరియే, విద్యావిషయికముగ నన్నయ, యేర్పరించిన వ్యవస్థను పునఃస్థాపించుటనేమో, సాంఘికముగ నెటుల మార్పులు దెచ్చునో అన్న మన యనుమానమునకు నిర్వృతి యాయనమంగళాచరణమును, ఆయనకృతి కన్యకా భర్తృవిషయమును!

హరిహరాత్మక మగు నా పరతత్త్వము తిక్కనార్యుని యూహలలో నిలచిన మతవిషయికమగు సువ్యవస్థకు పునాది! — అది యిట్టిదట్టిది గాదు; నీవు శ్రీపతి యనుము, గౌరీపతి యనుము, మురారీ యనుము, త్రిపురారి యనుము — దానికి కాలుష్య ముండదు; అపకర్ష ముండదు. మీరుమిక్కిలి యట్టి వైదికధ్యాయిత కిచ్చు మెచ్చున — తిక్కన యిందిమిడ్చిన సూక్ష్మ మేమి? — 'మత వైషమ్యములు కూడదయ్యయనుట. శివకేశవుల కభేదమయ్యె యనుట! నిష్కారణముగ నీవు నొచ్చి యితరుల నొప్పింతు వేల యని మందలించుట!' — ఇట్టి తన యూహను, ఆదర్శమును భారతపతికలందరాదరించి యాచరింతురని యా పుణ్యమూర్తి నమ్మకము. అయిన నీత డూహించిన ప్రయోజనము పాఠకులకు చప్పున స్ఫురించునా? కృతిపతిని దెలిసికొనునంత యుత్సుకత ప్రతిపాఠకున కుండునా? — మరి వాని హృదయము నాకర్షించునటుల యా కృతిపతి నచట నిలువబెట్టవలయును. అట్లు చేసిననే యందలి నిగూఢత, ప్రయోజకత వానికి దెలిసివచ్చునది. ఇదంతయు యోజించియే క్రొత్త పుంత ద్రొక్కినాడు తిక్కనార్యుడు.

తాను "ప్రబంధమండలి కధినాథునిగా నేపురుషుని జేర్కొనువాడనో యను తలంపుగూరిన మదితో" "ఇంచుక నిద్రించుసమయమున" — తన తండ్రి గుంటూరివిభుడు కొమ్మనదండనాథుడు స్వప్నమున గాన్పించినటుల, హరిహరనాథుని యాదేశము తనకు వినిపింపవచ్చినటుల చెప్పినాడు. తరువాత నా పరతత్త్వము సాక్షాత్కరించుటయు, నాయన—

పారాశర్యుని కృతి యయి
భారత మను పేర బరగు పంచమ వేదం
బారాధ్యము జనులకు త
ద్గౌరవ మూహించి నీ వఖండితభక్తిన్,

తెలుగుబాస వినిర్మింప దివురుటరయ
భవ్యఫలసార్థతరుపక్వఫలముగాదె

దీనికెడ నియ్యకొని చేకొనాని కృతిప
తిత్వ మర్థించి వచ్చితి తిక్కశర్మ"

అని యర్థించుటయును దెల్పినాడు. ఈ యుదంతమునందు సత్య ముండుననుకొనవచ్చును. లేదా, కవి చాతుర్యఘటిత మనుకొనవచ్చును. ఎట్లైనగాని, నూతనమైన యీపోకడ తిక్కనార్యుడు బుద్ధిపూర్వకము గనే, ప్రయోజనాకాంక్షియయే పోయెనేమో యని తోంచును!

ఇక ప్రజలలో ధర్మోత్తిష్ఠ గల్పించుటకై తా నెన్నుకొన్న భారతము,

"వేదములకు నఖిలస్మృతి
వాదములకు బహుపురాణవర్గంబులకున్."

మరియు, 'ధర్మార్థ కామమోక్ష స్థితికిని 'మొదల' యైనది. అట్టి భారతమును దెనిగించు తాను—

"వైదికమార్గనిష్ఠమగు
వర్తనముం దగ నిర్వహించుచు
న్భేదములేని భక్తి మతి
నిర్మలవృత్తిగ జేయుచుండ."

హరిహరాత్మకమగు పరతత్త్వపు "పాదనిరంతర స్మరణ తత్పరభావముకల్మి నాత్మసమ్మోదము" బొందువాడు!—ఇట్లు సంస్కృతమున 'కృష్ణద్వైపాయను డఖిలలోకహితనిష్ఠం బూని' భారతమును జెప్పగా, తాను తన కావ్యసిద్ధికై దానిని తెలుగుచేసినాడు. ఆ కార్య మవిఘ్నముగ గొనసాగినది. విరాటపర్వాదిని కలము మోపిన తిక్కన స్వర్గారోహణపర్వాంతము సాగిపోయినాడు. ఇక పాడవలసినది మంగళము! అదియే ఫలశ్రుతి!

ఇక దీని ప్రాముఖ్య మెట్టిది?

సర్వధర్మముల నొక కథలో నిమిడ్చి వినువనకుండ జెప్పినారో—అని కొందరికి రుచింపవచ్చును. మరికొందరికి రుచింపకపోవచ్చును. కొందరు వాని నాదరింపవచ్చును. మరికొందరు చిన్నచూపు చూడవచ్చును. ఇట్లు వైముఖ్యము గలవారికి లంచములు పెట్టుటవంటివి ఈ ఫలశ్రుతులు—వీనివలన పలువురా గ్రంథమును జదువునటుల మభ్యపెట్టవచ్చును. వాని ఫలములు పతితుల కందనీ, అందకపోనీ, పెద్దలు చెప్పిరి కాదా అట్లగు నని, ఆ నమ్మకము వేళ్లుపారినది గాదా హైందవహృదయములలో. కాననే వారు చదువుదురు; మనస్సులలో అవ్యక్తమైన తృప్తిని నింపుకొందురు!

అదియే భారతపు ఫలశ్రుతి యుద్దేశ్యముగూడను! ఏవిధముగ నైననేమి ప్రజలు భారతప్రతిపాదితధర్మములను నిత్యజీవితమున జీర్ణించుకొనుటగదా కావలసినది! కావననే ఏరకపు మనుజుల కనుకూలముగ లగునటు లాఫలములు గలుగు నిర్ణయములను గల యీఫలశ్రుతిలో—జనులందరికిని జెప్పిన సామాన్యఫలము అఘములు వాయుట! ముక్తి సిద్ధించుట! నాకలోకము గలుగుట!—పాతకులు వినిరా బ్రహ్మహత్యాదిపాతకములైన బాయును! పండుగపబ్బముల వేళలను కాంక్షించి నిర్వహింతురో, పితృకార్యముల వేయాశీషముల నరించి నిర్వర్తింతురో, ఆవియన్నియు నాయారోజుల భారతపఠనమాత్రమున గలిగితీరును. బ్రహ్మ క్షత్రియులు దీని వినుటచే శత్రుల జయింపగల్గుదురు. కన్య పఠించిన సద్వరు గాంచును. గర్భిణి చదివి సుపుత్త్రివతి యగును. కోర్కెలుగలవారు కోరిన కోర్కెలు, అర్థితో విన్నను, భక్తితో పఠించినను శ్రీయు, నాయువు, భూరియశంబు, ప్రమదమును, దృఢవిద్యయు గల్గును! ఇది పంచమవేద మగు భారతసంహితకు ఫలశ్రుతి.

ఈవిధముగ నన్నయతిక్కనల భారతావతారికలు రెండును రెండుతెన్నుల బోవును. నన్నపార్యుని విషయమున, నాయవతారికయం దాయన పడ్డ పాట్లు, ఆ కష్టములను గట్టెక్కుట కామోదించిన పండితసభల పొగడికలు, తనకు చేసూత నిచ్చి కంటికి రెప్పవోలె గాచుకొనుచు వచ్చిన తన మిత్రుని ప్రశంసలు—ఇవి గానిపించును!

ఇక తిక్కనగారి యవతారికలో నాయన యంటీయంటనితనము, తన కున్న బాధ్యతను నిర్వర్తించుకొనుటలో, తన నెత్తిపై గల బరు వితరులకు దెలియకుండ దించుకొనుటలో గల యొకుపరితనము—ఇవి యెదురగును.

వీనివన్నిటిని సమాలోచించి యేర్పరించుకొన్న వారిరువురి మూర్తులును రెండువిధములు. నన్నయ యొక ఋషి! అయినను పసిపాపవలె నాత డతిస్నిగ్ధుడు. తిక్కన యొక కర్మవీరుడు; ప్రపంచమును కాచి వడపోసిన శతవృద్ధునివలె నాత డతిగంభీరుడు!—మానవుని యాద్యంతదశల నీవిధిని రూపొందించుకొన్న వీరిరువురును ధ్రువప్రాయులు—పూర్వపు బౌన్నత్యమును మరచి యైకమత్యము లేక కొట్లాడుకొను నేటి యాంధ్రులకు గర్వకారణములు!

# ప్రఖ్యాత ఆధునిక ఆంధ్రచిత్రకారుని అస్తమయము

## శ్రీ పిలకా లక్ష్మీనరసింహమూర్తి

వరహాగిరి వెంకటభగీరథిగారు పరమపదించారను కుంటే అవాచ్యముగా ఉంది. నవ్యాంధ్రచిత్ర కళారంగములో పిడుగుపడినట్లు అయింది. కళాశీలుర హృదయాలు దద్దరిల్లి పోయినవి. నిర్విణ్ణుల మయాము. రోజులు గడచినకొలది ఆయన లేని కొరత తీరనిదిగా ఉంది. ఆయన పరమపదించుటతో ఆంధ్రులు అమూల్యమైన రత్నమును కోల్పోయినారు.

జీవితములో ఆప్తులు దొరకుట దుర్లభము. అందులో సమానాశయములు కలవారు ఆప్తులగుట మరీ దుర్లభము. ఆంధ్రచిత్రకారులకు భగీరథిగారు పరమాప్తులు. ఆప్తులయొక్క ఆత్మీయత బహుజన్మసముపార్జితము. ప్రేమలో ఎంత తీపి ఉన్నదో అంత దుఃఖముకూడ నిక్షిప్తమైనది. ఆంధ్ర చిత్రకారులందరి ప్రేమను చూరగొనిన ప్రేమమూర్తి భగీరథిగారు. వయస్సుతారతమ్యమే మరచిన వాత్సల్య మాయనది. కొందరు సహృదయులు ఆయనకు సన్నిహిత మిత్రులు-కొంద రాయనను కష్టసుఖములలో ఆదుకున్నవారు ఉన్నారు. కళాపాండిత్యములో మా అందరికన్న ఆయన ఘనుడు. ఆంధ్రయువచిత్రకారుల కాయన జ్యేష్ఠసోదరులవంటివారు.

ప్రపంచచిత్రకారులందరు ఏకకుటుంబము. ఒకరి చిత్రములు ఒకరు చూచి ఒకరి నొకరు ప్రత్యక్షముగా చూచుకొనకయే ప్రేమించుకుంటారు. ఒకరితో ఒకరికి పరిచయము లేకపోయినను ఒక పవిత్రమూర్తిని భక్తిదొంతరలలో ఒకరు దాచుకుంటారు. పవిత్రస్మరణలో వారి రచనామార్గము అలవరచుకొని విశ్వచిత్రకళాధిదేవత కొరకు చిత్రమాలను సమర్పించుకొంటారు. అట్టి సోదర చిత్రకారకుటుంబమునుంచి ఆంధ్రయువ చిత్రకారులకు జ్యేష్ఠసముడైన భగీరథిగారు మెరపులా మాయమైనారు. తెనుగుజాతిచిత్రకళారంగము మరియొక ప్రతిభావంతుని కోల్పోయినది. వరదా వెంకటరత్నముగారనినట్లు దక్షిణభారతమునకే ఈయన ఏకైకప్రకృతిచిత్రకారుడు. ప్రకృతిచిత్రకళలో ఈయన సలిపిన కృషి అనన్యమైనది.

లలితకళలు ప్రజాపోషణలో వర్ధిల్లకలసిన కాలము సమీపించినది. కాని చిత్రకళవిషయములో నేటి లోకము తీరే విచిత్రమైనది. గ్రుడ్డిలోకమునీడలో లౌకికులు—ధాంబికులు నిశ్చింతగా జీవిస్తారు. కాని లోకముపోకడలను వేయికళ్లతో చూచేవారు కళాస్రష్టలు. ఈ నిరంకుశులను లోకము బంధింపజూస్తుంది. ఆ కారణముచేతనే బలవత్తరమైన కళాశాలిని లోకము ధిక్కరిస్తుంది. భగీరథిగారిది బలీయమైన కళాకౌశలము. వారి అపూర్వకళాసృష్టిని లోకము గుర్తించినదో లేదో తెలియదు.

౧౯౩౫ వ సంవత్సరములో మొదటిసారి భగీరథిగారిని సందర్శించాను. అంతకుపూర్వమే చిత్రకళాప్రదర్శనములలో వీరిచిత్రములను చూచి ముగ్ధుడనైనాను. చిన్ననాడే ఈయన గొప్ప చిత్రకారుడని నాకు తోచింది. తెనుగుప్రకృతిచిత్రకళలో ఈయన పరచినది పూలబాట. ప్రాక్ప్రతీచీచిత్రసంప్రదాయములమన్వ ఈయనచిత్రరచనామార్గము ఒక మహాసేతువు వంటిది. ఇట్టి సమన్వయమార్గము అన్వేషించి చిత్రకళలో ఉత్తమమైనకృషి సల్పినవారు ఆధునికభారతీయచిత్రకారులలోనే అరుదు. ఆనాటి నా పసిఊహలకు ఈయన అమృతమూర్తివలె తోచినారు. తరువాత ఈయన అప్పుడప్పుడు రాజమహేంద్రవరము వస్తూపోతూ ఉండేవారు. నెచ్చెలిరైన వెంకటరత్నముగారితో ఇష్టాగోష్ఠి జరుపుతూ మమ్మల్నికూడా సాదరముతో పలుకరించి మా పసిఊహలలో మెరుపులు మెరయించేవారు. ఆ రోజులలోనే రాజమహేంద్రవరములో ఒక పెద్ద అఖిలభారతచిత్రకళాప్రదర్శనము జరిగింది. దానికి భగీరథిగారిచిత్రములు-చాకోలాయి

శిష్యప్రశిష్యుల చిత్రములు—తదితర ప్రముఖచిత్రకారుల బొమ్మలు వచ్చాయి. ఆ ప్రదర్శనములో ఈయన చిత్రములు-అతిచక్కనివి చూచే సదవకాశము కలిగింది. వాటిని ఆప్రదర్శనము జరిగినన్నాళ్ళూ చూచి ఆనంద పరవశుడ నయ్యాను.

ఈయన పైకి కొంచెము మోటుగా కనిపించే వారు. కాని వెన్నవంటి హృదయము. మరికొంత కాలము గడచినవెనుక వీరిని ప్రత్యేకముగా ఒకసారి ఇంటివద్ద కలవటము తటస్థించినది. ఎంతోసేపు చిత్రకళనుగూర్చి ముచ్చటించారు. హృదయము విప్పి మాటలాడారు. మాటల సందర్భములో ఆయనకష్టసుఖములు కూడ దొరలినవి. ఆయనసమక్షములో ఉన్నంతసేపూ ఆయన అంతర్ముఖు డనిపించినది.

చిత్రకారునకు బొమ్మలు వేయటానికి వ్యవధి ఉండాలి. జీవనోపాధి చూచుకుంటూ చిత్రరచన సాగించాలి. జీవితసంఘర్షణలలోనే ఉండి ప్రశాంతి కలిగించుకుంటూ చిత్రరచన చేసినవారు భగీరథిగారు. సర్వసాధారణముగా కళాశీలికి కళారచనలో అనేక అంతరాయములు కలుగుతూ ఉంటాయి. వాటిలో కామినీకాంచనములు రెండు ముఖ్యమైనవి. ధనకాంక్షతో కళను పరిత్యజించిన కళాభాయిగాలు నేడనేకులు ఉన్నారు. : కాని భగీరథిగారు ధనకాంక్షతో చిత్రకళను పరిత్యజించలేదు. అంతటి సాధువును నేను చిత్రకారులలో చూడలేదు. ఆయనకు చిత్రకళ నిత్య వ్యాసంగము. ఉత్తమశ్రేణికి చెందిన చిత్రకారుడు కనుకనే దుర్గమమైన కళాయాత్రలో తుదముట్ట కృషి చేసిన ఘనుడు.

నిజముగా ఆయనలోని ఘనత ఆయన ఎరుగరో, ఎరిగియూ కళాధిదేవతపాదాలమ్రోల వినమ్రులో !!! అన్ని సుగుణములతో మా హృదయములను లోగొనిన ప్రేమమూర్తి భగీరథిగారు. చాలా అమాయక హృదయుడు.

ప్రకృతిచిత్రరచనలో ఆయన కాయనదే సాటి. కైలాసశిఖరముపై - సాంద్రనీలపుచదలపై ఒరసుకొని విహరించే గంభీరభావములను చిత్రరచనలో అందుకొన్న దిట్ట. చిత్రములలో మంచుతెరలు, సులకే రాళ్లపై, పచ్చికపై ఒదిగి శయనించిన నీహారతుషారములు, నిత్యయౌవనముతో మెరిసిపోయే వర్ణికాభంగము—ప్రకృతిచిత్రరచనలో ఈయన పరిపూర్ణ ప్రజ్ఞానిధియని చెప్పకచెబుతాయి. సంధ్యారాగము-చదలపై అటు మునిమాపు - ఇటునుంచి శీతవెన్నెల - ప్రదోషకాలమందలి ప్రశాంతత—ఎన్నోభావములు - రచనాసంవిధానములో ఎంతో నైపుణ్యము చూచి అనేకమందిరసజ్ఞులు మెచ్చుకున్నారు. చిత్రకారులు నిర్విణ్ణు లయినారు. అంత కళావైదగ్ధ్యము నెరపిన కళాతపస్వి. ఆయన జీవితమంతా సంఘర్షణ అయినా కళలో అనన్యమైన కృషిచేసి ఓర్పుతో జీవనభారములు మోచి లౌకికయాత్ర చాలించిన పుణ్యమూర్తి. ఆయన కళద్వారా లోకాని కిచ్చిన దివ్యసందేశము ప్రేమ—ప్రశాంతత ప్రకృతిసౌందర్యమును కళలో ఆరాధించవలసిన మార్గము. వీరు ఆంధ్రలోకమునకు చిరస్మరణీయులు. దక్షిణభారతప్రకృతిచిత్రకారులలో అగ్రగణ్యుడు. భారతీయచిత్రకారులలో వేలుమడిచి లెక్కింపవలసినవాడు. జీవితములో వడుదుడుకులైనా, ఎండమావులునిండినా—చిత్రకళలో ఈయన పరచినది పూలబాట. సౌరభములు ఎడనెడ విరబోసిన దివ్యపారిజాతము ఆయన కళాకుసుమము. కళలో ఆయన తపస్సు ఫలించినది. నవ్యాంధ్రచిత్రకళాచరిత్రలో ప్రకృతిచిత్రరచనలో భగీరథిగారిది ఒక వినూత్న మార్గము. దానిని పలువురు చిత్రకారులు వినిమయం చేసుకుంటే అది విశిష్టసంప్రదాయము అవుతుంది.

నేడు విశ్వమంతటా చిత్రకళారంగములో అలజడిభావములు—అశాంతి—ఆకలి—యుద్ధ ప్రచారములు కలిసి సుడిగాడ్పులా వీస్తున్నాయి. ఇట్టి భావపవనములు కళలోనే కాదు, జీవితములోను, విశ్వమంతటా నిండివున్నాయి. ఇట్టి పరిస్థితులలో దేశపిత అయిన మహాత్ముడు అహింసాసందేశమును లోకమునకు ఇచ్చి నిర్యాణము పొందినాడు. భారతదేశములో ప్రకృతిచిత్రరచనలో శాంతిసందేశమును ఇచ్చినది ఈ తెనుగుబిడ్డ. మళ్లీ రష్యాదేశములో పుట్టి విశ్వమునకంతకు అట్టి శాంతిసందేశమును కళలో ఆవిర్భవింప

చేసిన చిత్రకారుడు నికలస్ రోరిక్ మహాశయుడు ఒకడు. ఈఇద్దరు చిత్రకారుల చిత్రసృష్టి శాంతిసందేశాత్మకమైనదని నా యూహ. ఆయనవి కెంపరావర్ణములు. భగీరథిగారివి నీటిరంగులలో ట్రాన్స్పరెంటు వర్ణములు. ఇద్దరి కళాదృష్టిలోనూ వాస్తవికత కనపడుతుంది. ఆధ్యాత్మికసందేశములు నిండిఉంటాయి. ఇద్దరూ ప్రకృతిచిత్రకారులే. ఆయన జన్మించినది రష్యాదేశము; ఈయనది భారతదేశము. దేశములు వేరైనా కళాదర్శములు ఒక్కటే. అల్లా అని చిత్రరచనలో భగీరథిగారు ఎక్కడా రోరిక్ రచనా మార్గము ననుసరించలేదు. ఒకరి బొమ్మలు చూస్తూంటే ఇంకొకరిచిత్రములు స్ఫురించవు. అందుకే విశ్వములోని చిత్రకారులందరూ ఏకకుటుంబమన్నాను. ఒక తల్లి బిడ్డలు. ఆ తల్లి విశ్వకళాధిదేవత.

భగీరథిగారు మంచి సంస్కారి. ఈయనలోని భక్త్యావేశములు - సాధనలు కళను సమగ్రరూపము సాధించినవి. ప్రకృతిచిత్రములు అంతా చిత్రిస్తూనే ఉంటారు. అనేకులవి నిర్జీవముగా ఉంటాయి. ఆత్మ వెడలిపోయిన మృతశరీరములవలె ఉంటాయి. పయనించవలసిన మార్గము తెలియక, దిక్కు తోచక అనేకులు ప్రకృతిచిత్రరచనలో ఫీట్సు చేస్తూ తమాషాలతో సరిపుచ్చుకుంటారు. భగీరథిగారి చిత్రములు ఆత్మావబోధకములైన దివ్యసందేశములు. మంచుతెరల చాటునించి తొంగిచూచే శిఖరాంచలములు—వాటిని చుంబించే సంధ్యారుణకాంతులు ఆచిత్రకారుడు పాడిన ప్రబోధగీతికలు వినిపిస్తాయి. ఆయన జీవితములో బహుకష్టములకు గురియైనప్పటికి కళను వీడలేదు. కళకు ఆత్మార్పణము చేసుకొన్నాడు. అటువంటి వ్యక్తిని ఆంధ్రజనని కోల్పోయినది. ఆయన చిత్రములనైనా సేకరించుకొని వాటిని పదిలపరచుకొనుట ఆంధ్రుల కర్తవ్యము.

ఇంకొక్కమాట. ఒక్కొక్క చిత్రకారునికి కళ తనకు బలుపలగా ఉంటుంది. దానిని సాధకుడై అన్వేషిస్తాడు. అతని ప్రయత్నములల్లో ఇది కాదు, ఇది కాదు అని తన రచనామార్గములలో తన కళాశాలను అన్వేషించుకుంటూ పోతాడు. కొందరీ అన్వేషణలో విసిగి వేసారిపోతారు. కొందరు చిత్రకళ విడిచి ప్రాపంచికవిషయాలలో మునిగిపోవుట కిది ఏమో కారణమనిపిస్తుంది. ఈయాత్రలో కొందరు భగీరథతపస్సు చేస్తారు. చివరికి సాధిస్తారు. కొందరు చిత్రకారులకు కళ—అందలి నిధులు తమలోనే పుట్టుకతో నిక్షిప్తమైఉంటాయి. వీరిఅన్వేషణ హృదయాంతర్గతమైనది. ఇది బాహ్యము కాదు. ప్రాచ్యఖండములో అడుగడుగునకు ఇట్టి కళాతపస్వులు తగులుతారు. కళాసృష్టిలో వీరి అతిలోకమైన చతురాననులు ఇట్టి కళాదృష్టి కలవ్యక్తి పరమయోగివంటివాడు. అతని కళాదీక్ష ఒక గొప్పయోగము.

అతని దివ్యచక్షువులు సమస్తలోకములు చూడగలవు. అతనికి రసాత్మకమైన కళాసృష్టి కరతలామలకము.

చిత్రకళలో అట్టి గొప్పయోగమును పొందిన ఘనుడు భగీరథిగారు. ఆయనసృష్టి రసాత్మకమైనది. ఆయన కళకోసమే జీవించిన పురుషుడు. ఆయన జీవితములో ఎన్ని అపశ్రుతులు మ్రోగినప్పటికి ఆయనమీటిన కళావల్లకి దివ్యగీతికలే వినిపించినది. ఆయన పట్టిన మహతి గంధర్వగానము చేసినది. ఆయన వర్ణములలో, రూపములలో ఎక్కడా అపశ్రుతి లేదు. ఆయనస్మరణ ఆంధ్రులు మరువరానిది.

శ్రీ చేమకూర సత్యనారాయణగారు వారి చిత్రముల నన్నిటిని ప్రదర్శించవలెనని తలపెట్టిన పూనిక ప్రశంసనీయమైనది. అంతటితో ఊరుకొనరాదు. ఆంధ్రదేశములో ఎప్పటికైనా కళాభవనము నిర్మింపబడాలి. ఆ కళాభవనములో ఇట్టి ఉత్తమచిత్రకారుల చిత్రములు భద్రపరచవలెను. ఆంధ్రులు వారి పవిత్రస్మరణలో తప్పక ఒక కళాభవనమును ప్రతిష్ఠించదగును.

---

# కలగూరగంప

## తేజస్సు అనేది ఏమిటి?

బ్రహ్మాండమంతా ఆవరించి, విశ్వమంతా నిండి ఉంది తేజస్సు. అమావాస్యనాటి నిశాసమయంలో తేజస్సు లేదని మనం భ్రమిస్తామే గాని అప్పుడుకూడ కాంతి—కొంత తక్కువ తీక్ష్ణతలో—మనలను పరివేష్టించే వుంటుంది. తేజస్సు లేకపోతే ప్రపంచకార్యకలాప మొక నిమేషకాలమైనను సక్రమంగా సాగదు; జీవితానికి తేజస్సే ఉండదు. తేజస్సు ఉన్నపుడు కళ్లు లేనివారే గ్రుడ్డివారుగా పరిగణింపబడతారుగాని తేజస్సు లేకపోతే అందరూ అంధులే! అసలు కలకాలం తేజస్సు లేకపోతే జీవులు మనగలవాయనునది ఒక ప్రశ్న.

అయితే యీ తేజస్సుఅనేది ఏమిటి? అది ఎక్కడ ఎట్లు ఉత్పత్తిపొందుచున్నది? ఏరీతిగా ప్రసరిస్తున్నది?

తేజస్సుయొక్క లోతుపాతులను తెలిసికొనుటకై అనాదికాలంనుంచి తత్వశాస్త్రశోధకులు, విజ్ఞానవిశారదులు ప్రయత్నం చేస్తూనే ఉన్నారు; ముక్కునవేలువేసుకుంటూనే ఉన్నారు. స్థబత్వము నొందని మానసికప్రవృత్తి కాకపోయినట్లయితే దానిని గూర్చి, దాని పుట్టుపూర్వోత్తరాలను గూర్చి తెలిసికొనుటకు మనకుకూడ కుతూహలంగానే ఉంటుంది. కాని పీ, నందరిని తన యింద్రజాలప్రభావంలో పడవైచుకొనిరి తేజస్సు ఇప్పటికీ తన నిజస్వరూపాన్ని పూర్తిగా బయటపెట్టలేదు.

స్థూలంగా పరిశీలిస్తే తేజస్సు రెండురకాలు: కృత్రిమము; స్వాభావికము. నిప్పు, నూనెదీపాలు ఎలెక్ట్రిక్ దీపాలు మున్నగునవి యిచ్చే కాంతి కృత్రిమ తేజస్సుకు ఉదాహరణము. సూర్యుడు, నక్షత్రాలు యిచ్చే తేజస్సు స్వాభావికతేజస్సుకు ఉదాహరణము. ఈ రెండురకాల తేజస్సుకుకూడ పదార్థమే ఉత్పత్తిస్థానము. పదార్థానికి అధికోష్ణము నిచ్చినండిస్తే గాని, పదార్థముగుండా విద్యుత్ ప్రవణము (*Electric-discharge*) పంపించి దానిని ప్రకోపింపజేస్తే గాని ఆపదార్థము స్వయంప్రకాశతత్వమును పొంది తేజస్సును ప్రసరిస్తుంది. నక్షత్రాలకు స్వయంప్రకాశత్వము వాటిలోని పరమాణువులు తత్వాంతరపరివర్తన మొందుటలో విడివడు పరమాణుశక్తివలన చేకూరుచున్నది.

స్వయంప్రకాశపదార్థములనుండి బయలుదేరిన తేజస్సు మాటిగా, సరళరేఖలలో అనంతము, అపరిమితము అయిన వేగంతో ప్రవహిస్తున్నదని చాలకాలంవరకు శాస్త్రజ్ఞులందరూ ఊహిస్తూండేవారు. ౧౭ వ శతాబ్దంలో 'రూమరు' శాస్త్రజ్ఞుని పరిశోధనలవలన పై అభిప్రాయం తప్పని వ్యక్తమైంది. రూమరు శాస్త్రజ్ఞుడు గురుగ్రహపు ఉపగ్రహాలయొక్క గ్రహణాలను పరిశీలించి, తేజస్సువేగం బహుళమైనప్పటికిని అపరిమితము, అనంతము మాత్రం కాదని, దానికికూడ కొంత నిర్దిష్టపరిమాణ ముందని కనుగొన్నాడు. కాంతియొక్క వేగము సెకనుకు ౧౮౬, ౩౩౦ మైళ్లు! లేదా గంటకు సుమారు ౬,౭౦,౭౮,౮౦౦ మైళ్లు! కాంతియొక్క యీ పరిమితవేగంచే సూర్యునినుండి బయలుదేరిన తేజస్సు రమారమి ౮ నా సెకనులలోగాని భూమిని చేరలేదు. కొన్ని నక్షత్రములనుండి బయలుదేరిన కాంతి భూగోళమును చేరుకొనులోపల సంవత్సరములు, దశాబ్దములు, శతాబ్దములు, సహస్రాబ్దములు

కూడ గడచిపోవునట! ఈ లెక్కలన్నియు ఊహాజనితములు కావు! ప్రయోగ సంజనితములు! శాస్త్రాధారములు!!

న్యూటన్ విజ్ఞానధీ విలసితుడు. విశ్వశిల్పమునంతను లెక్కలలో ఇమిడ్చి, సూత్రప్రాయమొనర్చిన మేధావి. శాస్త్రసామ్రాట్టుగా విఖ్యాతిగన్న మేటి. కాని తేజస్సును మాత్ర మాయన జయింపలేకపోయినాడు. తేజస్సు సూక్ష్మాతిసూక్ష్మమైన రేణువులుగా, మాత్రలుగా (*Corpuscles*) ప్రయాణంచేస్తున్నదని ఆయనఊహ. అయితే తన సమకాలికుడైన హగిన్సు విజ్ఞాని అది తరంగములుగా ప్రసరించుచున్నదని ప్రతిపాదించి కొన్ని తేజస్సంఘటనలను తన ప్రతిపాదన రీత్యా వ్యక్తపరచునప్పటికి—పాపం—న్యూటన్ మరి మాట్లాడలేకపోయినాడు. అంతటితో హగిన్సువాదానికి ఎక్కువ బలం చేకూరింది. దానిని కాదనువారుకూడ చాలకాలంవరకు ఎవరూ లేరు. ౧౯వ శతాబ్దంలో మేక్స్వెల్ శాస్త్రజ్ఞుడైనను "కాంతికిరణములు సామాన్య కిరణములు కావు; అవి విద్యుత్కాంతికిరణముల"ని చిన్న సవరణ ప్రతిపాదించినాడే గాని హగిన్సు పండితుని సిద్ధాంతాన్ని పూర్తిగా త్రోసిరాజనలేదు.

కాని ౨౦వ శతాబ్దంలో శాస్త్రప్రపంచమున సంస్కరణవాదుల సంఖ్య హెచ్చె, సనాతనసిద్ధాంతాలు చాలవరకు త్రోసిరాజనబడినాయి. జర్మనీ దేశస్థుడు మేక్సుప్లాంక్ హగిన్సుసిద్ధాంతాన్ని ప్రక్కకు త్రోసి, కాంతి కణములుగా (*Quanta*) ప్రవహించుచున్నదని నూతనసిద్ధాంతాన్ని ప్రతిపాదించేడు. పిమ్మట నీల్సుభోర్ పదార్థమునుండి కాంతి వికీర్ణమగుట రెండుదశలలో జరుగుచున్నదని ఊహించేడు. పదార్థానికి అధికోష్ణం కలుగజేస్తేగాని, పదార్థంగుండా విద్యుత్స్రవణాన్ని పంపిస్తేగాని స్వయంప్రకాశరహితమైన పరివర్తియ ఎలెక్ట్రానులు (*Orbital electrons*) కాంతి శక్తిని గ్రహించి, అధికశక్తి సమన్వితములై, ప్రకోపించి, స్వయంప్రకాశస్థితిని పొందుతాయి. కాని ఆస్థితిలో అవి చాలసేపు ఉండలేవు. తాము గ్రహించిన అధికశక్తిని మరల వికీర్ణించి, సహజస్థితికి వచ్చుటకై ఆ ఎలెక్ట్రానులు వెంటనే ప్రయత్నిస్తాయి. ఈప్రయత్నంలో అవి వికీర్ణించు ఆ అధిక శక్తియే తేజస్సు!

పదార్థంలో ప్రకోపావస్థయందున్న ఎలెక్ట్రానులు ఒక అవస్థనుండి మరియొక అవస్థకు ఒక్కసారిగా దూక గలవు గాని క్రమంగా, నెమ్మదిగా దిగజారలేవు. అందుచే అప్పుడు స్ఖలనమయ్యే శక్తికూడ చిన్నచిన్న మొత్తములలో ఉండగలదు గాని మరియొకవిధంగా ఉండలేదు. ఈ చిన్నచిన్న మొత్తములకే కణములని (*Quanta*) శాస్త్రపరిభాషలో పేరు.

రామన్, అయిన్‌స్టయిన్, కాంప్టన్ మున్నగు పెక్కురు శాస్త్రజ్ఞులు ప్లాంక్ సిద్ధాంతాన్నే ఆమోదిస్తున్నారు. కాని మరికొందరు సనాతనమైనదైనా హగిన్సుసిద్ధాంతాన్ని పూర్తిగా వదలలేకుండా ఉన్నారు. కాని నిష్పాక్షికంగా పరిశీలిస్తే ఈ రెండు సిద్ధాంతాలూ కూడ సత్యములేయని, ఆ రెండింటినికూడ వేర్వేరుగా ప్రామాణ్యంగా అంగీకరింపకపోతే తేజస్సంఘటనల కన్నిటికిని సరియగు సమాధాన మిచ్చుట దుర్లభమని స్పష్టమవుతుంది. అందుచేతనే 'కాంతి కణములా? తరంగములా?' అని సూటిగా ప్రశ్నిస్తే, ప్రతిప్రముఖశాస్త్రజ్ఞుడు తనకు తెలియదని నమ్రతతో చెప్పి తప్పించుకుంటాడు. ౧౯౨౭ లో కాబోలు సర్ విలియమ్‌బ్రాగ్ అను ఆంగ్ల విజ్ఞానవతంసుడు సోమ, బుధ, శుక్రవారములందొక సిద్ధాంతము, కుజ, గురు, శనివారాలలో మరియొక సిద్ధాంతము అమలులో ఉన్నట్లు తాను ఊహిస్తుంటానని ఛలోక్తిగా వచించేడు. కాని క్రైస్తవులకు పర్వదినమైన ఆదివారమునాడు ఏసిద్ధాంతాన్ని తేజస్సు ఆమోదిస్తుందో ఆయన వచించలేదు. బహుశా ఆనాడది రెండు సిద్ధాంతాలనుకూడ శిరసావహిస్తుందేమో!

వాస్తవంగా తేజస్సు ఏసిద్ధాంతాన్ని ఆమోదిస్తుందో విజ్ఞానం ఎన్నటికైన నిర్ణయించగలదో లేదో చెప్పలేముగాని ప్రస్తుతం విద్యార్థుల ఉద్దేశంలో మాత్రం "చిన్న తరగతులలో సరళరేఖాత్మకవాదాన్ని,

B. A. తరగతులలో తరంగవాదాన్ని, M. A. తరగతులలో కణవాదాన్ని తేజస్సు ఆమోదించుచుండుట" నిక్కారము !!

ఎ. వి. యస్. రామారావు.

---

# దీర్ఘాయుర్దాయమును గూర్చిన నూతనశాస్త్రము

జెరంటాలజీ (Gerantology) అను వృద్ధాప్యమును గురించిన శాస్త్రము, జెరియాట్రిక్స్ (Geriatrics) అను వృద్ధాప్యమును గురించిన వైద్యశాస్త్రము ఇవి రెండును ప్రస్తుతము అమెరికాసంయుక్తరాష్ట్రములోను, యునైటెడ్ కింగ్‌డమ్‌లోను అతివేగముగ నభివృద్ధి చేయబడుచున్నవి. ఈ శాస్త్రముల ఆశయము మానవునికి దీర్ఘాయువును, సుఖకరమైన ముదిమిని ఇచ్చుటయే.

గ్రీకు హైందవపురాణములలో ప్రాచీనులు అమరత్వమునకు శాశ్వతయౌవనమునకు జేసిన ప్రయత్నముల వివరించు కథలనేకము లున్నవి. ఆధునికశాస్త్రజ్ఞులు రోగబాధితుడు గానివ్యక్తి వృద్ధుడు కావలసిన అగత్యమేమియు లేదనియు, వృద్ధాప్యమును బొందుట కేవల మస్వాభావికపరిణామమే యనియు భావింతురు. మన మొకింతసేపు కీటకములను, చేపలను, సూక్ష్మక్రిములను పరిశీలింతము. అవి జననకాలమం దెంత పసితనముతోను, చురుకుదనముతోను ఉండునో అట్లే మరణకాలమందును చైతన్యమును గలిగియుండును. పెక్కు క్రూరమృగములు సహితము వాని యవసానకాలము వఱకును దుముకుచు వేటాడుచుండుట మనకు విదితమే కదా! కావున ఇతరజీవులకు అరుదైనదియు, మానవులకు సామాన్యమైనదియు నైన ఇట్టి అస్వాభావికమైన ముదిమిని పూర్తిగా అరికట్టవచ్చునని వైద్యులు, శాస్త్రజ్ఞులు భావించుచున్నారు.

చాలకాలమునుండియు, వ్యక్తికి ఆరోగ్యాయుర్దాయముల నొసగుటకు రోగబాధ నివర్తింపజేయుటకు ఆహారమే ముఖ్యసాధనమని గుర్తింపబడియున్నది. ఆహారవిషయమై మన ప్రాచీనశాస్త్రములు పెక్కు నిబంధనలను జేసియేయున్నవి. గ్రీకుల 'అంబ్రోషియా' (Ambrosia) భారతదేశస్థుల 'అమృతము'. ఇది మన జీర్ణాశయములోనికి పంపబడు ఆహారమే కాని, బాహ్యలేపమునకు రక్తములోనికి ఎక్కింపబడుటకు ఉపయోగింపబడు ఔషధములు కావు.

వ్యక్తి ఆరోగ్యమును పొడిగించుటలో ఆహార మెంత ప్రాముఖ్యమైనదో తెలియజేయుటకు రెండు ప్రయోగములు చేయబడియున్నవి. అవి వేర్వేరు దృక్పథముల మనసునం దుంచుకొని చేయబడిన, యాకర్షణీయములైన ప్రయోగములుగా నున్నవి. మన పోషణకు పాలెంత ముఖ్యమో మన మెఱిగినదే. కొలంబియావిశ్వవిద్యాలయపు రసాయనికశాస్త్రజ్ఞుడు, ఆహారనిబంధనలవిషయమున జగద్విఖ్యాతుడు నైన డాక్టర్ షర్మన్, డెబ్బది తరములకు చెందిన ఎలుకలమీద ప్రయోగములు చేసిరి. (ఈ ౭౦ తరములు ౨,౧౦౦ సంవత్సరములనాటి మానవులతరములకు సమము) వీరు పాలు ఆరోగ్యవంతమైన దీర్ఘాయువు నొసగునని వక్కాణించిరి. తమ కష్టభూయిష్ఠమైన పరిశోధనల వలన, పాలలోని కాల్షియమ్ (దీనివలననే సున్నము తయారుచేయబడును), విటమిను 'ఏ' అనునవియే పై జెప్పబడిన ఫలితము నొసగుటయందు ప్రాధాన్యమును వహించుచున్నవని తేల్చిరి. ఇది అందరు గుర్తింపవలసిన విషయము. అమితమైన పోషణశక్తి కలిగి మిక్కిలి తక్కువ ధరలో లభించు నాహారపదార్థములను కనుగొనుటయే వారి ఆశయమై యుండినది. పాలలోను, ఆకుకూరలలోను, తాజాపండ్లలోను కాల్షియమ్ విటమిను 'ఏ' మెండుగా నుండుటచేత, అవి గల యాహారమే మనము స్వీకరింపవలయునని తీవ్రతమమైన సలహో నిచ్చుచున్నారు.

అమెరికాదేశస్థుడైన 'టి. ఎస్. గార్డనర్' అను మతియొకరు పెరుగుదలను వృద్ధిచేయు నాహారపదార్థములగురించి ఆలోచనలు రేకెత్తించు ప్రయోగములను జేసిరి. వారి ప్రయోగములు జీవించుచున్న సమస్త జంతువులలోను వృక్షములలోను లెక్కింపరాని కోట్లయైన వీర్యవంతమైన జీవాణువు (Cells) లున్నవనియు,

లేతవైన జీవాణులు, ముదిమిని బొందినవానికన్న ఎక్కువ 'న్యూక్లియిక్ ఆమ్లము' (Nucleicacid) కలిగియున్నవనియు స్పష్టపఱచినవి. (ఈన్యూక్లియిక్ ఆమ్లము జీవాణువులలో కొద్ది పరిమాణములలో నుండు పదార్థము) చిట్టెలుకల దైనికాహారమునకు ౧/౧౦౦౦ గ్రాము భారము గల న్యూక్లియికామ్లమును చేర్చినచో వాని జీవితకాలము నూటికి పదివంతులు పెరిగినట్లు తేలినది.

ఈ ఆమ్లము వృద్ధములగుచుండు జీవాణువులకు (Cells) పసితన మిచ్చునో, లేక దేహమునకు రోగసంక్రమణనిరోధకశక్తిని వృద్ధిపఱచునో పూర్తిగా బోధపడలేదు. కాని యికమీద న్యూక్లియకామ్లముతో చేయబోవు పరిశోధనలు జయప్రదములైన, చిట్టెలుకలకువలెనే మానవులకును మఱి పదియేండ్లబలమైన పసితన మొసగుటకు అవకాశము కలుగునని ఊహింపవచ్చును.

డాక్టరు గార్డనరుగారు తేనెటీగల విషయమున పరిశోధన చేయుచు, కూలితేనెటీగలకన్న రాణులుగనున్న తేనెటీగల గొప్ప యాకారమును, అపరిమితమైన సంతానోత్పత్తిశక్తిని జూచి ఆశ్చర్యపడి, అట్లవి యుండుటకు కారణమును కనుగొనిరి. వాని యాహారమును బరిశీలింపగా కూలితేనెటీగలు పుష్పాసవ, తేనెను స్వీకరించుననియు రాణులైన తేనెటీగలు కూలితేనెటీగల దేహములో తయారైన ప్రత్యేకమైన ద్రవరూపమైన(Royal jelly, ఆహారమును గ్రహించుననియు తెల్పిరి.(ఈద్రవమున పుప్పొడి, తేనె వీని కలయికవలన నేర్పడినది.) మఱియు రాణులుకాబోవునట్టి తేనెటీగలు రాజార్హమైన యఱలలోను (Royal Chambers), కాబోవునట్టి కూలితేనెటీగలు సాధారణమైన యఱలలోను నుండుననియు, కూలితేనెటీగల యొక్క అఱలలోనుండు పసియీగలకు రాణియీగల కిడు నాహార మొసగబడినచో అవి కూలియీగలుగా మారక, రాణితేనెటీగలుగా మారుననియు, రాణియీగలు గ్రహించు ప్రత్యేకాహారమందు అమితమైన న్యూక్లియకామ్లమున్నదనియు, సాధారణమైన యీగలకు రాణులు గ్రహించు నాహారమిడిన వాని జీవితకాలము నూటికి ఏబదివంతులు పెరుగుననియు స్పష్టపఱచిరి. వీరి శోధనలవలన మేలైన ఆహారము తినిన తేనెటీగలు సగముకాల మెక్కువ నివసించునని తేలినది కదా! ఇట్లు న్యూక్లియకామ్లము మానవులవిషయమునను అద్భుతఫలితమును జూపగలిగినచో మానవు డిప్పటివలె అరువదిసంవత్సరములేకాక తొంబదిసంవత్సరములు నివసింప నపేక్షించుట సమంజసమే!

పై వివరించునట్లు స్వాభావికముగా వృద్ధాప్యమును బొందుటయేకాక, పెక్కండ్రు అస్వాభావికమైన జరను బొందుచున్నారు. బధిరత్వము, క్షీణదృష్టి, కీళ్లబాధ, ఆర్త్రైటిస్, కాన్సర్ మొదలగు నిరోధింపబడునట్టివియు ముసలితనమున సామాన్యముగా బాధించునవియు నైనజాడ్యములే అస్వాభావికమైన జరకు కారణములైయున్నవి. ఆధునికశాస్త్రజ్ఞానము, ప్లేగు, కలరా, సన్నిపాతము, కుష్ఠువ్యాధులు, చలిజ్వరము మొదలగు ఉపద్రవముల జయించుచున్నది. అట్లే యితరములగు తీవ్రవ్యాధులను ఆధునికదివ్యౌషధరాజములు నిర్మూలింపగలవని యూహించుట సహేతుకమే.

ముసలితనమున సంక్రమించు మిక్కిలి బాధాకరమైన ఆర్త్రైటిసు అను వ్యాధిని, సూప్రరీనల్ గ్రంథినుండి తీయబడిన హోర్మోను ద్రవము (Compound E) అద్భుతముగ బాగుచేసినదని ఒక బ్రిటిషు పార్లమెంటుసభ్యుడు మన కాలమందే వచించియున్నారు. పై చెప్పినట్లు ప్రత్యేకాహారము, హోర్మోనుచికిత్స (హోర్మోనువది ద్రవము) అనునవియే గాక నిశ్చలమైన ప్రకృతి, సంతోషదాయకమైన మనస్థితి మనకు సుఖవంతమును ప్రశాంతమును నైన పెక్కేండ్లజీవితము నొసగుటకు తోడ్పడునని ప్రాచ్యులు, పాశ్చాత్యులు నొక్కివక్కాణించుచున్నారు.

కావున నట్టి జీవితము నభిలషింతము గాక.

టి. మునియప్పగారి రచన కనువాదము.

అనువాదకులు :

వజ్ఝల వేంకటసుబ్రహ్మణ్యశర్మ.



# విమర్శనము



### ప్రత్యూష

తెలంగాణములో వర్ధిష్ణువులై వెలుగొందుచున్న కొందరు నవ్యరచయితల పద్యరచనల సంకలనమిది. వారిలోని భావావేశములకును, ప్రగతిశీలమునకును, విషయవివేచనలకును, భాషాపాటవమునకును ఈరచనలు మంచిమచ్చుముక్కలై యున్నవి. ఈ నవ రచయితలసంగ్రహపరిచయములు గ్రంథాంతమున జోడించి ప్రకాశకులు పాఠకులకు మంచి ఉపకారము చేసినవారైనారు.

ప్రకాశకులు : సాధనసమితి, ౧౫౫/B 3 ఈసామియాబజారు, హైదరాబాదు. వెల రు ౧-౦-౦

### బుద్ధగీత

రచయిత : సుందరాచారిగారు, చిత్తూరు.

బుద్ధుని విచిత్రచరిత్రను కవితాచమత్కృతితో చక్కనికథగా పూవు, కాయ, పండు అని మూడు ప్రకరణములుగా సంతరించి రచించిన చిన్న కావ్యము. సుందరాచారిగారి కవితాప్రతిభ యిందులో చక్కగా ద్యోతకమగుచున్నది. కూర్పుతీర్పులు కూడ బాగుగా అమరినవి.

### వీరకంకణము

రచయిత : దండిపల్లి వెంకటసుబ్బాశాస్త్రిగారు. ప్రకాశకులు : బాలసరస్వతీ బుక్ డిపో, కర్నూలు. వెల ౧ రూ.

విశ్వవిఖ్యాతుడైన జగన్నాథపండితరాయల సమగ్రచరిత్ర వృత్తముగా గల చిన్న నవల. ఆంధ్రప్రతిభను భరతఖండమంతటను చాటిన ఈ మహనీయుని సమగ్రజీవితమును తెలియగోరువారికిది చాల ఉపకారకమై యుండగలదు.

## గ్రంథస్వీకారము

### కపోతీ కపోతము

పద్యకావ్యము. కర్త : జోస్యుల రాజారామమోహనరావుగారు. ప్రాప్తిస్థానము : బులుసు వెంకటేశ్వర్లుగారు, రామారావుపేట, కాకినాడ. వెల ౮ అ.

### అష్టాదశ శ్లోకగీత

వ్యాఖ్యాత : శ్రీ నిర్వికల్పానందస్వామిగారు. ప్రకాశకులు : సాధన గ్రంథమండలి, తెనాలి. వెల ముప్పావలా.

### పరమాణుగాథ

గ్రంథకర్త : కొమరవోలు వెంకటసుబ్బారావుగారు, బి. ఏ., ప్రకాశకులు: వెంకట్రామా అండు కో., సికిందరాబాదు. వెల రూ. ౧౦.

### పండుగ బహుమానము

కథల సంపుటి. రచయిత్రి : ఇల్లిందల సరస్వతీదేవిగారు. ప్రకాశకులు : ఆంధ్ర బుక్ హౌస్., హైదరాబాదు. వెల రూ. ౨.

### అర్పణ

కన్నడ గ్రంథము. మొపాసాకథల సంకలనము. అనువాదకుడు : పి. వెంకోబాచార్యులుగారు. ప్రకాశకులు : ఆనందగ్రంథమాల, హుబ్బళ్లి. వెల రూ ౧-౮-౦.

### *Span of Life*

దీర్ఘాయుర్దాయమును గురించిన జ్యోతిష గ్రంథము. ఆంగ్లము. రచయిత : జి. శ్రీరామమూర్తిగారు, టెక్కలి. వెల రూ. ౫.

---

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press,
No. 7, Thambu Chetty St., G. T., Madras. Editor— S. Sambhu Prasad.